# రాత్రి

[ నవల ]

వనఫూల్

అనువాదం:
మద్దిపట్ల సూరి

దేశి కవితా మండలి
విజయవాడ-2

జెకె ప్రచురణ
ప్రథమ ముద్రణ
ఏప్రిల్ - 1958
రెండు రూపాయలు



---

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# రాత్రి

రాత్రి కథ వ్రాద్దామని కూర్చున్నాను.

కాని ఇది వైశాఖమాసపు మిట్టమధ్యాహ్న సమయం. తీవ్రమైన ఎండవేడికి ప్రకృతి కాలిపోతోంది. ప్రొద్దుట్నుంచీ ఎలాగో ఉగ్గపట్టుకుని అలసిపోయి, ఇంక ప్రాణచాలక తనలో గూడుకట్టుకున్న ఉత్తాపాన్ని నాలుగువైపులా కక్కేసి, ప్రకృతి బయటపడబోతున్నట్లుంది. నిస్తబ్ద నిస్తరంగ నిష్ఠుర ఉత్తాపం. దాహంమూలంగా గొంతు ఎండి ఆరిపోయిన కాకి ఒకటి రావి చెట్టుకొమ్మమీద 'ఆఁ' అని నోరు తెరచుకు కూచుంది. దాని అంగిలిగుంట రెపరెపలాడుతోంది. అతిప్రాచీనమైన ఆ అశ్వత్థ వృక్షంనిండా చిన్నచిన్న అగ్నినాలికల్లాగా ఎక్కడచూచినా చిగుళ్ళే. దేవాలయం వాకిలిప్రక్కన ఓ చలివేంద్రవాడు చుట్టూ మూడునాలుగు నీళ్ళ బానలుపెట్టుకు కూర్చున్నాడు. బట్టతల, చేతుల్లేని బనీనూ వాడూ – రోజుకి నాలుగణాలు కూలి పుచ్చుకుంటూ, దప్పికగొని వచ్చిన బాటసార్లకి డబ్బు పుచ్చుకోకుండా మంచినీళ్ళు దానంచేస్తున్నాడు. ఆ పుణ్యం ఎవరికి దక్కుతుందో మరి! దగ్గరలోనే చెప్పరాని వాడొకడు చుట్టూ రకరకాల పాత చెప్పులూ, వాటిని బాగుచేసే సామా నులూ పెట్టుకుకూర్చున్నాడు. ఆ ముసిలివాడి కళ్ళు దాటెన పోయేవాళ్ళకాళ్ళమీదనే ఉన్నాయి. మధ్యమధ్య జోళ్ళు బాగుచేస్తాబాబూ: అని అంటూ, దాటెనపోతున్న వారిదృష్టిని తనవైపు ఆకర్షించుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. వాడిమాట లెవరూ వినిపించుకోవటంలేదు. ఈ నెత్తిమాడే ఎండలో ఆగి

నిలబడి చెప్పలేవరు బాగుచేయించుకుంటారు ? అయినా ముసిలివాడు అడగటం మాత్రం మానటంలేదు. వీలు దొరికి నప్పుడల్లా అడుగుతూనే ఉన్నాడు. మశూచికపు మచ్చలతో గుంటలుపడ్డా, కొట్టవచ్చినట్లుండే పెళ్ళాంముఖం వాడి కనో దృష్టికి కన్పిస్తూ ఉండి ఉండొచ్చు! సాయంకాలమయ్యేసరికి వచ్చి, వాడు సంపాయించిన డబ్బులు లెఖ్ఖ అడిగి మరీ తీసు కుంటుంది! సంపాదన తగ్గిందంటేచాలు, కారణం ఉన్నా లేకపో యినా కలకత్తా కాళికరూపం ఎత్తుతుంది...బర్రుమని గొంతు చించుకుంటూ కారు ఏదో పరుగెత్తింది. గుప్పుమని దుమ్ము పైకిలేచింది. దాని వెనకనే డొక్కుటాంగా ఒకటి వచ్చింది. గుర్రం ఒక్టి ఎముకలగూడులా ఉంది, పాపం! డుక్కల్లో ఉన్న నలుగురు మనుష్యుల్ని లాగలేకుండా ఉంది. టాంగావాడు మాత్రం కొరడాతో ఛెళ్ ఛెళ్మని దాన్ని కొట్టటం మానటం లేదు. బంయ్మని హారన్ మోగించుకుంటూ మరోకారు పరు గెత్తింది. మళ్ళీ మరో గుట్టఎత్తు దుమ్ములేచింది...."చల్లగా, తియ్యగా; చల్లగా. తియ్యగా"...చూస్తే భయం వేసేట్లున్న ప్రాణి ఒకడు గొంతు గేసుకుని ముందునడుస్తున్నాడు. అతగాడి వెనకాలే కూలివా డొకడు. వాడినెత్తిన ఎర్రటి గుడ్డగప్పిన ఐస్క్రీం జాడీ ఉంది...తారు పులిమిన రాజవీధి ఎండనెడికి దవ దవలాడుతోంది. కూలీవాడి కాళ్ళని ఉన్నవి చిరిగిపోయిన వయినా గట్టి చెప్పులు. అవి బహుశా ఎండకి కాలవేమో! చల్లటి ఐస్క్రీం జాడీ మోసుకుపోతున్నందుకు వాడికెంత కూలి గిట్టుబాటవుతుందో మరి. దావిచెట్టు చిగురుటాకులు చిరునవ్వు లొలకపోస్తున్న ట్లున్నాయి.........

ఇలాంటి వాతావరణం మధ్యఉండి రాత్రి కథ వ్రాస్తున్నాను. ఆలోచించి నెమరుకు తెచ్చుకుంటూ మరీ వ్రాస్తున్నాను. ఈ దారుణమైన ఎండవేళ రాత్రిస్మృతి అస్పష్టంగానూ, అగమ్యగోచరంగానూ ఉంది.

ఖట్ – ఖట్ – ఖట్......ఖట్ ఖట్ ఖట్...

పోలీసుల గుంపు ఒకటి– మాంచి ఉన్మాదంతో నేల అదిరేట్లు అడుగులేసుకుంటూ నడచిపోతోంది. వాళ్ళ ఎర్రటోపీలూ, ఖాకీదుస్తులూ ఈమధ్యాహ్నపు ఎండలో చాలా విచిత్రంగా కన్పిస్తున్నాయి.

హఠాత్తుగా అటుకేసి చూశాను. రావిచిగుళ్ళు చిరునవ్వు లొలికిస్తూనే ఉన్నాయి. ఆ పోలీసుల్లో ఒకడ్ని గుర్తుపట్టకలగటంతో నాకూ నవ్వొచ్చింది. మొన్న అక్బర్‌నగర్ స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఈ పోలీసే నేలని కరుచుకుని ఓ తెల్లగాడ్డికి నమస్కరించటం నేను కళ్ళారా చూశాను. ఖట్ ఖట్ ఖట్...పోలీసుల అడుగుల చప్పుడు క్రమక్రమంగా వినపడకుండాపోయింది. చెప్పులుకుట్టే ముసిలివాడు భయభయంగా చూడసాగాడు. దాహంతో వచ్చిన బాటసారి దోసిట్లో నీళ్ళు పోస్తూ ఆ చలివేంద్రవాడు పరధ్యానంగా కాసిని నీళ్ళుక్రింద ఒలకపోశాడు.

ఈవిచిత్ర విశేషవిక్షోభఉత్తాప వాతావరణం మధ్య ఉండి, రాత్రి కథ రాయవలసివస్తోంది. నక్షత్రమయమైన చీకటి రాత్రి లెక్కలేనన్ని నక్షత్రాలు. అర్ధరాత్రివేళకి కృష్ణపక్ష చంద్రుడుకూడా ఉదయించాడు. పెద్ద గాలికూడా ప్రారంభమయింది. నే నివన్నీ చూడలేదు, ఒకవేళ చూసినా ఆ అను

భూతిని పొందలేకపోయానేమో! కాదు. నేనివన్నీ చూడ లేదు, చూడలేకపోయాను; తెలివితప్పి పడిఉన్నాను. నేను మేల్కొని లేచిచూచేసరికి ప్రభాతమయింది.

  

జీవితంలో నాకు ఏ అనివార్యసంఘటనలంటే అయి ష్టమో, ఆ అప్రీతికరమైన సంఘటనమూలంగానే నాకామెతో తొలిపరిచయమైంది. అదీ ఆశ్చర్యం! ఆ రోజున వారమేదో, తిథిఏదో, నక్షత్రమేదో, అసలది ఏ మాసమోకూడా జ్ఞాపకం లేదు. జ్ఞాపకంఉండే విషయంకూడా కాదది. ఎరుపు, పసుపు, నీలం, ఆకుపచ్చరంగులుగల పెద్దగళ్ళ జంపకానా ఒకటి ప్లాట్ ఫారంమీద పరచుకుని, దానిమీద నేను దద్దమ్మలా కూర్చుని ఉన్నసంగతి ఒక్కటేమాత్రం జ్ఞాపకంఉంది. మనస్సెందుకో చిరాకుగాకూడా ఉందనుకుంటాను. ఇంతలో ఓ కూలీ వచ్చి నా నడినెత్తికి సూటిగాఉన్న దీపం వెలిగించిపోవటంతో నా చిరాకు మరింత హెచ్చయింది. ఇంక అస్పష్టంగా యేంలేదు. జంపకానా నూరుగొంతుకలతో తన ఉనికిని వెల్లడిచేసుకుం టోంది. నా పెద్ద నల్లట్రంకుమీద తెల్లటి అక్షరాలతో రాసి ఉన్న నాపేరుకూడా ఎవరికీ కనపడకుండా ఉండటంలేదు.

భార్యలేని పురుషుడు నౌకరుమీద ఆధారపడకతప్పదు. వాడే సఖుడు, వాడే సచివుడూ, వాడే గృహిణీ, సమస్తమూ వాడే. విశేషించి – స్వయంగా వెళ్ళి గ్లాసెడు మంచినీళ్ళయినా తెచ్చుకోవటం చేతకాని నాలాంటి వాజమ్మల విషయంలో ఇంక చెప్పేదేముంది? అందులోనూ ఆ నౌకరుమా గోకుల్

లాగా పరిహాసమనేది ఎరుగనివాడు, కార్యశూరుడు, విశ్వాస పాత్రుడు, స్నేహశీలికూడా అయితే – ఈరంగురంగుల జంప కానామీద దద్దమ్మలా కూర్చుని ఉండటం తప్ప గత్యంతరం లేదు. రైలు మరో పదినిమిషాలకు బయలుదేరుతుందనగా గోకుల్ ఆదరాబాదరా పరిగెత్తుకెళ్ళి, ఈజంపకానా కొనుక్కుని వచ్చి నాకిచ్చి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు – ఈ పరుపుచుట్ట విప్పవద్దని, ప్రయాణంలో కూర్చున్నా, పడుకున్నా, ఏంచేసినా ఈ జంపకానాతోనే సరిపెట్టుకోమని బ్రతిమాలుతూ చెప్పాడు. పరుపుచుట్టలో చిన్నచిన్న వస్తువులు చాలా ఉన్నాయనీ, అది కనుక విప్పానంటే వాటిల్లో ఏదోఒకటి పారేసుకోకుండా ఉండననీ గోకుల్‌కి తెలుసు. నిజం చెప్పొద్దూ; గోకుల్‌ని నిర్లక్ష్యం చెయ్యగల సత్తాలేదు నాకు. కాని భగవంతుడు గోకుల్‌ని రసికుణ్ణిగాకాదు కాని, రవంత తక్కువ అరసికుణ్ణిగా సృష్టించినట్లైతే ఆయన కొంప ఏంమునిగేదో! ఆశ్చర్యం ఏమంటే వాడు చూస్తూ చూస్తూ బుద్ధిపూర్వకంగా జంపకానా రూపంలో ఉన్న ఈ ప్రలాపంని కొనుక్కువచ్చి ఇచ్చి మరీవెళ్ళాడు! కొద్దిరోజులక్రితం భోషాణంలాంటి ఈ నల్లట్రంకుని కొన్నది కూడా వాడే. దానిమీద తెల్లఅక్షరాలతో నాపేరుకూడా గోకులే రాశాడు. ఒక్క ఈ ట్రంకుమీదే కాదు నావస్తువులన్నిటిమీద – పంచెలమీద, పంట్లాములమీద, చొక్కాలమీద,. బనీన్లమీద, దిండుగలీబులమీద, పక్కదుప్పట్లమీద, లుంగీలమీద, తువాళ్ళమీద – నాపేర్లుండటం – మరేంకాదు. నాశ్రేయోభిలాషి అయిన గోకుల్ ప్రతిభకు ప్రబల నిదర్శనాలు? గోకుల్ నాకోసమై ఎందుకో ఒకందుకు ఎప్పుడూ

తాపత్రయపడుతూనే ఉంటాడు. నేనేమో మహా - అన్ని వస్తువులూ పారేసుకోటానికి సిద్ధపడిఉన్నట్లు, వాడే అన్నిటిమీదా పేరూ ఊరూ రాయించి భద్రంగా కాపాడుకుంటూ వస్తున్నట్లూ ఉంటాడు.

వెయిటింగ్‌రూం ప్రక్కగా చీకట్లో ఒకమూల ఈ రంగు రంగుల జంపకానామీద, గట్టిగా బిగించి కట్టిన పరుపుచుట్టకి చేరగిలపడి, కళ్ళుమూసుకుని కూర్చున్నాను. దగ్గరగా ఏదో ఇంజన్ చప్పుడు వినిపిస్తున్నది. కళ్ళుమూసుకొని ఒక కథ ప్లాట్ ఆలోచిస్తున్నాను. కొంచెం మచ్చుచూపిస్తాను :—

'...చతుర్దిక్కులా నిబిడాంధకారం. అరణ్యసమాకులమైన ఉపత్యకసౌందర్యమంతా అమావాస్యాంధకారంలో అవలుప్తమైపోయింది. నిర్మేఘంగా ఉన్న ఆకాశంలో ఈ కొసనుంచి ఆకొసదాకా పాలపుంత వ్యాపించి ఉంది. బ్రహ్మాండమైన వృశ్చికరాశి చిరంతన ప్రశ్నార్థాన్ని కడుపులో దాచుకుని, పెద్ద ప్రశ్నార్థకచిహ్నమువలె శూన్యాంధకారంలో ప్రకాశిస్తోంది...మూరసన్నిబద్ధమైన దేవదారువృక్షపంక్తికి శీర్షప్రదేశంలో అనూరాధ, దానికి కొంచెం క్రిందుగా జ్యేష్ఠ, శూలపాణి పర్వతాగ్రభాగంలో మూలానక్షత్రం దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయి మినుకుమినుకుమనే ఈ నక్షత్రాల కాంతులకు ఆ కారుచీకటి కాస్తంత వెలిబారింది. దట్టంగా ఉన్న వృక్షశ్రేణి పర్వతపంక్తిపై గుమిగూడిన మేఘసముదాయంలా ఉంది. పార్వతి - శూలపాణిలకు మధ్య వనసమాకులితమై ఉన్న ఈ ఉపత్యకపైన - బౌద్ధకాపాలికుడైన రక్తభిక్షువు రహస్యంగా నివశిస్తున్నాడు. క్ష్మారమృగసమాకీర్ణమా

ఉపత్యక. నిబిడాంధకారమే కాని, నిశ్శబ్దాంధకారం మాత్రం కాదు. దగ్గరగా దూరంగా సావధానంగా సంచరిస్తున్న వన్య మృగాల పదధ్వనులు—అజగరంచే చుట్టివేయబడిన నిస్సహాయ జంతువుల ఆర్తధ్వనుల్లాగా స్పష్టాస్పష్టంగా వినిపిస్తున్నాయి. శాఖా ప్రశాఖ సంకులితమైన వృక్షాగ్రభాగాల - నిశాచరము లైన పక్షులు రెక్కలు విదుల్చుకుంటున్న ధ్వనులు......'

ధన్ ధన్‌మని ఏదో చప్పుడయింది. కళ్ళు తెరచి చూశాను. సరిగ్గా నా నెత్తిమీద వ్రేలాడుతున్న దీపాన్ని, దీపాలవాడొకడొచ్చి చేత్తో పట్టుకుని క్రిందికి లాగుతున్నాడు. ఆ కునికిపాట్లు పడుతున్న దీపాన్ని గిల్లి సరిచేశాడు. మరుక్షణంలో, నన్ను కేంద్రంగా చేసుకుని గోకుల్ ప్రతిభ అందరికీ ప్రత్యక్షంగా కన్పించసాగింది - రంగురంగుల జంపకానా, నా పేరు రాసి ఉన్న నల్లట్రంకు...కళ్ళు నలుముకుని లేచి సరిగా కూర్చుని, రైల్వే టైంటేబుల్ ముందరేసుకుని, ఔధ్ - రోహిల్‌ఖండ్ లైన్ ఉన్న పేజీలమీదికి - ఊరికేనే - దృష్టి పోనివ్వటానికి ప్రయత్నించాను. ఒక్కక్షణం ఆ పేజీలకేసి శ్రద్ధగానే చూశాను. టంగ్ - టంగ్‌మని స్టేషన్లో బెల్ మ్రోగింది. ఎవరో 'అప్ డౌన్' పరిభాషలతో మరొక స్టేషన్‌తో మాట్లాడుతున్నారు. మాట్లాడటమయింది ఇంజన్ గుప్ గుప్ ధ్వని మళ్ళీ స్పష్టంగా విన్పించసాగింది. ఎందుకో తెలియదు, ఔధ్ - రోహిల్‌ఖండ్ లైన్ పేజీలమీదనుంచి కళ్ళెత్తి హఠాత్తుగా కుడివైపుకి చూశాను. ఎవరైనా మెడ పట్టుకుని నన్ను అటువైపుకి తిప్పారేమో అనిపిస్తుంది! మొదట్లో ఏమీ కన్పించలేదు. తర్వాత హఠాత్తుగా చూశాను - కాదు

కాదు - వెయిటింగ్‌రూం తలుపుల మధ్యనుంచి ఓ నల్లటి నేత్రాలజంట నాకేసి రెప్పవాల్చకుండా చూస్తూ ఉండటం హఠాత్తుగా గమనించాను . . . మరేంకాదు- ఓ నేత్రాల జంట! అంతే! . . . .

రాత్రి. . .!

నా రంగురంగుల జంపకానాని, కొట్టొచ్చినట్లు పేరు రాసిఉన్న నానల్లట్రంకుని చూసుకుని నేనింకా సిగ్గుపడేలోపు గానే - నాకు బాగా జ్ఞాపకం - వంశీ ఒక అన్నం పొట్లం, ఓ కూజానిండా నీళ్ళూ తీసుకుని వెయిటింగ్‌రూంలో ప్రవేశించాడు. తర్వాత కొద్ది నిమిషాల్లో ఏంజరిగిందో నాకంత బాగా జ్ఞాపకంలేదు. వాని ఇది మాత్రం జ్ఞాపకంఉంది. ఇంజన్ మోత మాత్రం ఆగిపోయింది. నేను మళ్ళీ చప్పున నాశక్తినంతా వినియోగించి - 'ఆ నిబిడాంధకారంలోని నిశాచరములైన పక్షుల రెక్కల కదలికల. . .' దగ్గిర అందుకుని, ఆ అలౌకికబాధభిక్షువు కథను పూర్తిచెయ్యటానికి వ్యర్థప్రయత్నం చెయ్య మొదలెట్టాను.

"విఖ్యాత కథారచయితలైన డాక్టర్ ఘనశ్యాంబాబు గారు తమరేనా?"

ప్రశ్నించినవాడు వంశీ, కాని ఓరగా తెరిచిఉన్న తలుపు సందుల్లోంచి ఓచీరె కదలటం, ఆచీరె ఎర్రంచు జిగాల్‌మని మెరవటం నాకంటపడింది. వంశీ ప్రశ్నకర్తకాదు, ప్రశ్నవాహకుడు మాత్రమే అని గ్రహించాను.

నే నేదో అయోమయావస్థలోపడి పోయాను.

'ఘనశ్యాం' అన్న పేరు ఈయుగంలో, నవనాగరిక సమాజంలో అచలమైనది. నేను కూర్చునిఉన్న రంగురంగుల జంపకానా అచలమే, పేరు రాసిఉన్న నానల్లట్రంకూ అచలమే. అసలన్నిటికంటె వ్రణకిణాంకితమైన నాపొడుగాటిముఖం మరీ అచలం. పైకి కన్పించే ఈ ఆకారవైఖరికీ, నాలో అంతర్గతంగాఉన్న సుసుందరమైన సాహిత్యారాధనకీ పొంతన కుదుర్చుకోలేక తికమకపడుతూంటాను. అయినా 'విఖ్యాత' అన్నపద వ్యామోహంలోపడిపోయి వంశీకి యథార్థమే చెప్పాను.

"మీరు ప్రాక్టీసుచేస్తూకూడా ఇన్నికథలెలా రాయగలుగుతున్నారు?" రెండో ప్రశ్న.

ఈప్రశ్న వంశీ మస్తిష్కంలోంచి స్వతఃపుట్టుకువచ్చిందే అని గ్రహించాను. ఓ చిరునవ్వు నవ్వాను. నా చిరునవ్వు మాటున ఎంత వేడిఉందో వంశీ చూడకలిగినట్లయితే గాభరా పడేవాడే. ఈప్రశ్న చాలామంది అడుగుతూంటారు. కాని ఎంత అవివేకమైన ప్రశ్న! ఇంతకంటె "మీరు డాక్టరుగా ఉంటూకూడా ఊపిరి యెలా పీల్చుకోగలుగుతున్నారు!" అన్నది- చాలావరకు జాతీయమైన ప్రశ్న. చాలామందిని చూశాను ప్రశ్నపరంపరతో పరిచయం చేసుకునేవాళ్ళని. రెండు మూడు మామూలు ప్రశ్నలడిగాక, ఎంతో సన్నిహితులైనట్లు వ్యక్తిగత ప్రశ్నలవర్షం కురిపిస్తూఉంటారు. 'నెలకెంత సంపాయిస్తారు?' ఈప్రశ్న చాలామందినోట విన్నాను. 'ప్రాక్టీసు ఎలాఉంది?' 'రచనలవల్ల ఏమయినా నాలుగురాళ్ళు వస్తున్నాయా?' ఎన్నిసార్లు ఎంతమందినోట విన్నానో - విని విని హతమారిపోయాను. ఇంకో జాతీయసాహిత్యక స్రష్టఉన్నాడు.

అతడి ప్రశ్నలు మరీ జటిలంగా ఉంటాయి. 'చిన్నకథలెలా వ్రాస్తారు?' 'రవీంద్రనాథ్‌కీ బంకించంద్‌కీ విభేదం యెక్కడ?' 'సత్యేంద్రనాథ్ ప్రథమశ్రేణికి చెందిన కవి అంటారా కాదంటారా?' వంగసాహిత్యంలో బ్రౌనింగ్‌లాంటి కవి యెవరు?' 'జీవితంలోని యథార్థమైన అనుభవాలన్నీ ఉత్తమసాహిత్యం క్రిందికి వస్తాయా, రావా?'

దిక్కు తోచక దిమ్మరపోక తప్పదు.

వంశీ జంపకానామీద కూర్చుని, మూడో ప్రశ్న అడిగి, తానెవరైందీ కూడా తెలుపుకున్నాడు.

"సరే కానీండి, ఇప్పుడెక్కడ చూసినా 'ఫ్రాయిడ్, ఫ్రాయిడ్' అన్నమాటే విన్పిస్తూ ఉంటుంది. ఎవరండీ అతడు?"

నేను చిరునవ్వునవ్వుతూ 'డిటెక్టివ్' అని సమాధానం చెప్పాను! ఈల వేసేవాడి భంగిమలో మూతి ముడుచుకుని విస్మితుడైన వంశీ ఇంకా ఏదో అనబోయినాడు కాని, అనలేదు. ఇంతలో లోపల్నుంచి పిలుపువచ్చింది.

"వంశీదా! మాట"

ఆ పిలుపు చాలాదూరంనుంచి, ఆకాశానికి అవతలవైపునుంచి వచ్చిందేమో అనిపించింది. రాత్రివిషయంలో చివరిదాకా నాకీ దూరత్వబోధకానుభూతిమాత్రం తొలగిపోనేలేదు.

లేచి వెళ్ళిపోయాడా వంశీ.

నేను మెదలకుండా కూర్చునే ఉన్నాను. గుప్‌గుప్ మని ఇంజన్‌ధ్వని మళ్ళీ స్పష్టంగా విన్పించసాగింది. ఏదో చేద్దామనే ఉద్దేశ్యంతోనే అనుకుంటాను.

స్టేషన్‌లో ఉన్న గడియారంకేసి చూశాను. దాని మీద కాగితం అతికించి ఉంది. గడియారం కదలటంలేదు. సంస్కృత పదజాలంతో నేనాలోచిస్తూ ఆపిన కథ ప్లాటును మళ్ళీ ఆలోచించటానికి ప్రయత్నించాను. కళ్ళు మూసుకుని మళ్ళీ పరుపుచుట్టకు చేరగిలపడి కూర్చున్నాను. గౌరీ - శూల పాణి పర్వతాలమధ్యనున్న ఉపత్యకదృశ్యం అంత సజీవంగా కళ్ళకి కట్టటంలేదు. వంశీ మనస్సులో మెదలుతున్నాడు. అతడి తోపాటు ఆ నల్లటికళ్ళూ, ఆ ఎర్రటి అంచూకూడా మెదులు తున్నాయి. అప్పుడీఆలోచన తోచలేదు కాని, ఇప్పుడు తోస్తోంది కర్పూరమృగ సమాకీర్ణమైన ఆ అంధకార ఉపత్యకకీ, ఈ నల్లటి కళ్ళకీ, ఎర్రటి అంచుకీ, ఈ వంశీకికూడా ఏదో సన్ని హితసంబంధం ఉన్నట్లుంది. లేకపోతే సరిగ్గా ఆ సమయానికే రక్తభిక్షువనే కాపాలికుడి కథ నామనస్సుకెందుకు తటుతుంది? ఆ అంధకార ఉపత్యకమీద శూలపాణి పర్వతగుహాలో నేను తుణికంగా సృష్టించిన ఆ రక్తభిక్షువనే కాపాలికుడు ఇహ ఎప్ప టికీ నాలేఖనిద్వారా లోకం వెలుగులోకి రాకపోవచ్చు.... అతడు తప్పిపోనే పోయాడు - ఆ మాటకొస్తే...! అయినా సరిగ్గా ఆ సమయానికే నా కల్పనలో ఎందుకు మూర్తీభ వించాలి మరి !

"స్వర్ణేందు అనే అతణ్ణి-ఎవర్నయినా ఎరుగుదురా మీరు?"

కళ్ళు తెరిచి లేచి కూర్చున్నాను.

వంశీ మళ్ళా వచ్చాడు.

"స్వర్ణేందా?."

"ఆఁ స్వర్ణేందురాయ్. 'స్కాటిష్' లో మీతో కూడా —"

ఇఁక చెప్పనవసరం లేకపోయింది. యవనిక లేచింది. స్వర్ణేందు ముఖం కళ్ళయెదుట కన్పించసాగింది. నల్లగా, సన్నగా, ముభావంగా ఉండే స్వర్ణేందు.

"బాగా యెరుగుదును. అతడు మీ కేమయినా అవుతాడా?"

"మా పినతండ్రికొడుకే"

"ఓ"

"సోనాదా ఢిల్లీ ఎక్స్ప్రెస్‌లో ఇపుడే వస్తాడు. మేమంతా మధుపురం వెడుతున్నాం".

"ఊరికేనా?"

"కాదు. గాలి మార్పుకోసం. మాపినతండ్రిగారి కస్వస్థతగా ఉంది.

"ఏమిటి సుస్తీ?"

నావృత్తికి సంబంధించిన కుతూహలాన్ని ఆపుకోలేకపోయాను.

"పక్షవాతం"

పక్షవాతం అసలెందువల్ల వస్తుందో, దానికి సంబంధించిన శ్లీల - అశ్లీలకారణాలన్నీ ఒక్కసారిగా నా మస్తిష్కంలోకి వచ్చి దూరాయి.

విచిత్రమైంది మన మనస్సు!

"ఎన్నాళ్ళనుంచి?"

"దాదాపు సంవత్సరంనుంచి మాటకూడా సరిగ్గారాదు"

"ఎక్కడున్నారాయన? వెయిటింగ్ రూంలోనా?"

"ఆఁ రండి, చూస్తారా?"

ఒక విఖ్యాతరచయితని బాగా చనువుచేసుకోవచ్చుననే కుతూహలంతోనే అయిఉండొచ్చు - వంశీ నన్ను లోపలికి రమ్మని ఆహ్వానించాడు.

"ఇప్పుడెందుకులే! నిద్రపోతున్నారేమో -"

"నిద్రపోవటమేమిటి? ఆయన కసలు నిద్రేపట్టదు. రాత్రింబగళ్ళు మేల్కొనే ఉంటారు."

నాకేసి నల్లటికళ్ళు రెండు రెప్పలు వాల్చకుండా చూస్తూఉండటాన్ని - నామనస్సు అచేతనంగా కాదు, సచేతనంగాఉన్న స్థితిలోనే స్పష్టంగా చూశాను. ఆ చూపులు ఆకర్షించాయి, వికర్షించాయికూడా. స్వర్ణేంద్రుడామె కేమవుతాడో!...రెండు నిమిషాలే గడిచాయో, రెండు గంటలే గడిచాయో మరి! అప్పటి నా మానసికావస్థ గడియారంకేసి చూసేట్లుగాలేదు. ఇది మాత్రం జ్ఞాపకంఉంది. మా సంకోచాలు తీరటానికి చాలాసేపు పట్టింది. ఆ చూపులు నన్ను వివశుణ్ణి చేశాయి. చూపులు వేషభూషణాదులు లేని అసలు వ్యక్తిని గుర్తింపచేస్తాయి. మనస్సుయొక్క అంతరాంతరాల్లో చాటుగా ఉండే మానవుణ్ణి - సామాజిక మానవుణ్ణికాదు - సిసలైన అతడి వ్యక్తిత్వాన్ని గ్రహించేట్లు చేస్తాయి.....ధరించే దుస్తుల్లో మాటలతీరుల్లో సభ్యసమాజంలోని మనుషులందరూ ఇంచుమించు ఒకే అచులోంచి వచ్చినట్లుంటారు. మానవుడి ఆంతర్యంలోఉన్న విశిష్టతనీ, విచిత్రతనీ ఇప్పటికయినా ఒక్క చూపులుమాత్రమే గుర్తించగలవు. ముఖంలోని కళకళకి చూపులే జీవం. ఆ నల్లటికళ్ళు రెండూ చాలా విచిత్రమైనవి.

విశిష్టతకలవి. వాటిని జీవితంలో అసలే నాటికీ అర్థంచేసుకునే యోగ్యత కలగకపోవచ్చు. నా రంగురంగుల జంపకానా, 'డాక్టర్ ఘనశ్యాంరాయ్' అని పేరు రాసివున్న నా నల్లట్రంకు డాక్టర్ వృత్తి – సాహిత్యరచన ఈరెంటిటి సమన్వయాన్ని గురించి ఆ పాతమనుసుకమో: ఆ ప్రసంగం – ఇంతకీ ఏ వస్తువులంటే నేను అయిష్టపడుతూ ఉంటానో; అవే హఠాత్తుగా నాకు ఒనగూడకపోయినట్లయితే ఇంక యెప్పటికీ ఆమెతో పరిచయం కలగకపోయేదేమో! ఆమె అప్పుడన్న మాటలు– అంటే ఇంచుమించు రెండు సంవత్సరాలక్రితం విన్నమాటలు – జ్ఞాపకం వస్తున్నాయి నాకు....

"ముందు మీ యీ జంపకానా కంటపడింది మాకు. తర్వాత పేరురాసి ఉన్న ట్రంకు కన్పించింది. ఆ పేరు చూడగా నేను మా అన్నయ్యకి ఇలాంటి పేరుగల డాక్టరు – రచయిత అయిన స్నేహితులొకరున్న సంగతి జ్ఞాపకంవచ్చింది. వంశీదాతో అన్నాను—"

విచిత్రమైన కుర్రవాడీ వంశీ. అంటే విచిత్రంగా ఎదుటి వాళ్ళ్ని బుట్టలో వేసుకోగలిగిన ముఖం అతడిది. ముందు చూడగానే మంచి చలాకీ, చాతుర్యం ఉన్నవాడిలా కన్పిస్తాడు. అతడి ముఖంలో ఒక విధమైన లాలిత్యం – అంటే ఈ కాలపు యువతీమణుల్ని ముగ్ధుల్ని చేసే లాలిత్యం – ఉంది. వ్యూఢోరస్కుడూ, వృషస్కంధుడూ మాత్రంకాదు. బాగా సన్నగా బక్కపల్చగా ఉంటాడు, వదులు లాల్చీ తొడుగుకున్నప్పుడు మొహం చాలా బావుంటుంది. అతడి ముఖంలో తొణికిసలాడుతూండే చిరునవ్వును హఠాత్తుగా చూసినప్పుడు

మాత్రం అది అతడి తెలివితేటల కాంతియేమో అన్న భ్రమ కల్గుతుంది. ప్రతి మాటలోనూ తెలివైన చిరునవ్వు కూడా కలసి ఉంటుంది. మరుక్షణంలో అతడి కళ్ళకేసి చూసినప్పుడు మాత్రం ఆ నవ్వులో పసలేదన్న సంగతి తెలిసిపోతుంది. ఆకళ్లు యెప్పుడూ - తానెక్కడ పట్టుపడిపోతానో అన్న భయాన్ని కప్పిపుచ్చుకుంటున్నట్లు - బహుచంచలంగా ఉంటాయి. కాని కప్పిపుచ్చలేనివి అమాయక చంచలదృష్టి. ఒక్క పిరికిచూపు.

"రండి - చూస్తారా?"

రమ్మనమని మళ్ళీ కోరాడు వంశీ.

"పదండి"



"దీపం ఉపచేతికియ్, ఘనశ్యాంబాబు వచ్చారు"

దీపం పెద్దదిగా ఉండటంవల్ల, ఓ మూలగా కూర్చుని ఉన్నా ముందు ఆమెనిచూడక తప్పిందికాదు నౌకరు దీపాన్ని ఉపచేతికిచ్చాడు.

వర్ణించటానికి ప్రయత్నించను. అసమర్థత కాదు. చక్కగా మాటలు పొదిగి, ఉద్రేకాన్ని కలిగించటమే కాకుండా, శబ్దాడంబరంతో దిమ్మెరిపోయేట్లు చేసి, 'ఇంక వర్ణింప నాతరంకాదు' అని అశక్తతను అంగీకరిస్తున్నట్లు నటించే చమత్కృతి నాకూ కావలసినంత ఉంది. ఇక్కడమాత్రం ఆ కౌశలాన్ని ఉపయోగించటం మానుకున్నాను. నేనేమీ అతిశయోక్తిగా చెప్పతలుచుకోకపోవటమే కారణం. నవలాధోరణిలో వర్ణించటం మొదలెడితే అతిశయోక్తులు దొర్లక

మానవు. అంచేత ముక్తసరిగామాత్రమే చెప్పతలచుకున్నాను. అలా చెప్పినా ఒకవేళ అంత మరీ అతిశయోక్తులు రాకపోయినా, అదికూడా అంతో ఇంతో అతిశయోక్తి కిందికివస్తే రావొచ్చు!

సన్నగా, పుష్టిగా, నల్లగా ఉంటుం దామె. ఇలాంటి నలుపు సాధారణంగా ఎక్కడా కనపడదు. చామనచాయ నలుపు, నల్లటినలుపు మొదలైన నలుపు రంగును విశదంచేసే విశేషణాలతో ఈనలుపును వర్ణించటానికి వీల్లేదు. ఎంచేతంటే అది కేవలం నలుపుకాదు, అందులో కోమలత్వం ఉంది — మఖమల్‌లో ఉండే విచిత్రమైన కోమలత్వంలాంటిది. అతి పేలవం, అతిమార్దవం, అత్యాశ్చర్యకరం అయిన ఒకవిధమైన శోభ ఆనలుపుతో మిళితమై అది మనల్ని ఏదో స్వప్నంలోకి తీసుకువెళుతున్న ట్లుంటుంది. నల్లటికళ్ళున్నాయే, అవి మరీ అద్భుతమయినవి; చంచలమైనవికావు, నిమ్పలకములు ఎప్పుడు చూసినా నిర్నిమేషంగానే చూస్తూఉంటాయి. ఎవరినిచూస్తూంటాయో వారినంత మరీ పొడుస్తున్నట్లు ఉండవు. వారిని నిశ్శబ్దంగా నిశ్శేషంగా త్రాగేస్తున్నట్లు మాత్రమే ఉంటాయి. వారి భూతభవిష్యద్వర్తమానాల అంతుకనుకున్నట్లు ఉంటాయి. మొదట్లో ఆ కళ్ళను చూసినప్పుడు నాకిన్ని ఊహాలు తట్టలేదు. తర్వాత తర్వాత నాకుకలిగిన, అనుభవాల ఆధారంతోనే ఈ కించిద్వర్ణనయినా చేయగలిగాను. మొదట్లో ఆమెని చూడగానే నాకెలాంటి అభిప్రాయం కల్గిందో, ఇంచుమించు అలాంటి అభిప్రాయమే కలుగుతుంది ఎవరికైనా. నిజానికామె ఒక్కమాట మాట్లాడకపోయినా నా కెందుకో చటుక్కున

ఆమె చాలా ఆరిందా లలామ అయిఉంటుం దనిపించింది . . .
విడమర్చి చెపితే మరేం లేదు. 'ఆమె వయసుకు మించిన తెలివి
తేటలుకలది, అని – పోనీ ఆమె వయసు ఎంతో అదయినా
ఊహించకలిగాననా!. . .ఆమె యేళ్ళు పద్దెనిమిదో పదిఎనిమి
దులో అసలాప్రశ్నే అప్పుడు నామనస్సులోనికిరాలేదు. నాకే
కాదు. ఎవరికైతేమాత్రం వస్తుందా! తర్వాత చాలా రోజులికి
వంశీకి న్యూమోనియా వచ్చినపుడు — 'నీ కన్నెళ్ళో తెలుసు
కోవాలని లేదు నాకు. నీవిషయంలో అస లలాంటివేవీ తెలు
సుకోదలచలేదు నేను' అంటూ అతడు ప్రలాపించటం గుర్తుంది.
అతడిప్రలాపనకీ, నా అభిప్రాయానికీ ఐక్యతఉంది. వంశీ ప్రలా
పనకి డాక్టరుగా నేను చికిత్సయితే చేశానుగాని, కవిగా అతడి
ప్రలాపనతో ఏకీభవించాను. పురుషహృదయాన్ని గట్టిగా
కదిలించగలిగిన స్త్రీ ఉన్నదంటే, ఆమె స్త్రీత్వాన్ని తప్ప
ఇంకేమీ తరచి తెలుసుకుందామనే వాంఛ ఉండదు మనస్సుకి.
ఆమెకి ఎన్నియేళ్లుంటాయి? ఆమె యెన్నిపాళ్లుంటుంది?
ఇలాంటివన్నీ కేవలం అవాంతర ప్రసంగాలు! సమ్మోహితం
కాని మనస్సుకి కలిగే సామాన్యకుతూహలం! చూసీ చూడ
టంతోనే ఆమె 'ఆరిందా' అని మనస్సుకు తట్టటానికి తగిన
కారణం ఉన్నదొకటి. చలనచిత్రం చూస్తున్నప్పుడు ఒకబొమ్మ
చెరిగిపోతూ పోతూండగానే, దాని స్థానంలోనికి రెండోబొమ్మ
వచ్చి ఎలా నిలుస్తుందో, అలాగే నన్ను చూస్తున్న ఆమె
నిర్నిమేషదృష్టిలో ముందు విస్మయం, తర్వాత ఈసడింపు
వ్యక్తమయినాయి. ఆ నిర్నిమేషనీరవదృష్టిని భాషలో వ్యక్తం

చెయ్యబోతే – 'వచ్చారూమీరు! అస్వస్థతగాఉన్న నాన్న గారిని చూడటానికేనా వచ్చింది?' అంటూ కొంచెం నవ్వి, 'మీలాంటివాళ్ళనందర్నీ చాలావరకు కాచివడపోసిన దాన్ని నేను' అని అంటున్నట్లుంటుంది చాలావరకు.

వీలైనంత ఆత్మనిగ్రహం తాలూకు సహాకారంతో – కించిత్ దెబ్బతిన్న ఆత్మగౌరవానికి అనావశ్యకమైన కవచ మొకటి తొడిగి, ఉద్విగ్నకంఠంతో – "ఏదీ? స్వర్ణేందు నాన్న గారెక్కడ? నేనీ సంగతి అసలు విననేలేదే." అన్నాను వంశీతో. ఇలా నే అనటంలో ఉన్నకృత్రిమత నా చెవుల కే ఖంగ్ మని విన్పించింది. వంశీ దీపం పుచ్చుకుని ముందరికి వచ్చాడు. స్వర్ణేందు తండ్రిని చూచాను. క్రిందనే పక్క వేసుకుని. కంఠం వరకూ దుప్పటి కప్పుకుని పడుకుని ఉన్నారు. ముఖం మాత్రమే పైకి కన్పిస్తోంది. సగం సజీవంగా, సగం నిర్జీవంగా ఉన్నది ముఖం. నిర్జీవంగా ఉన్న వైపు ముఖంలో ఏభావమూ వ్యక్తం కావటం లేదు. కనురెప్పలు వాడిపోయి, వాలిపోయి వున్నాయి. కను కొలకుల్లో అశ్రుబిందువు లున్నాయి. పెదవులు ప్రక్కకి తోసుకుపోయాయి. మొత్తాని కా వాలకంలో ఏదో ఆత్మ సమర్పణభావం వ్యక్తమవుతోంది. వైజ్ఞానికులు చెప్పేదాన్ని బట్టిచూస్తే అది మృత్యువు కాదనుకోండి. కాని సామాన్యుల దృష్ట్యామాత్రం అది చావుకంటె నికృష్టమైనది. బ్రతికే ఉన్నారాయన. కాని జీవకళ అనేది ఏకోశానాలేదు. సజీవంగా ఉన్న వైపు ముఖం మాత్రం కాస్త కళగానే ఉంది. ఆచూపులో అతి తీక్షణత, ఆ పెదవులమీద తీవ్రమైన తిరస్కారభావం

వ్యక్తమవుతున్నాయి. కణతలమీది నరాలు రెండు ఉబ్బి, వంకరతిరిగి, తపతపలాడుతున్నాయి.

అలవాటు ప్రకారం చెయ్యిపట్టుకుని నాడి పరీక్షించాను. నాడిలో దోషంలేదని చెప్పటానికి ఆస్కారమున్నట్లు తోచలేదు గుండె ఎలాఉన్నదీ పరీక్షించి తెలుసుకోటానికి అలవాటైన స్టెతస్కోప్ దగ్గర లేకపోవటం చాలా వెలితిగానే తోచింది. కణతలమీది నరాలు ఎంచేత తపతపలాడుతున్నట్లు! వైజ్ఞానిక దృక్పథంతో కొంచెం ఆలోచించటానికి ప్రయత్నించాను. వ్యాధి చరిత్ర, రక్తపరీక్ష మొదలైనవాటిమీద వస్తున్న డాక్టరీ ఆలోచనలన్నిటినీ స్తంభింపచేస్తూ, సజీవంగాఉన్న వైపు కన్ను 'ఊరుకో' అన్నట్లు ఉరిమిచూసింది. ఆవైపు పెదవి తిరస్కారభావాన్ని వ్యక్తంచేసింది......నిర్జీవంగా ఉన్నవైపు కంటికేసి చూస్తే అది బ్రతిమాలుకుంటున్నట్టుంది! ప్రక్కకి తోసుకుపోయిన పెదవి నిశ్శబ్దంగా 'క్షమించండి' అన్న భావాన్ని వ్యక్తంచేస్తున్నట్లుంది! విచిత్రభావ సమ్మేళనం!

ఆ తర్వాత నే నేంచేశానో, ఏం మాట్లాడానో, ఇంత జరిగాకకూడా ఆత్మగౌరవానికి భంగం కలగకుండా చూసుకుంటూ, ఆ వెయిటింగ్‌రూంలోనే ఈజీచైర్‌లో టీకప్పు పట్టుకుని కూర్చుని, సాహిత్యచర్చ చెయ్యటం ఎలా సాధ్యమయిందో అవంతా జ్ఞాపకంలేదు కాని, ఇది మాత్రం అస్పష్టంగా గుర్తుంది. పైకి మర్యాదగా నవ్వుమాత్రం తెచ్చిపెట్టుకుని, నమస్కరించి లేచా నక్కడినుంచి.. ఆఁ! లేచి బయలుదేర బోయాననుకుంటాను. తీరా వస్తూ ఎందుకో వెనక్కి తిరిగి

పోయాను, నిష్కారణంగానే అయిఉండొచ్చు. లేదా నా పంచె కుర్చీ చేతికి తగులుకొని ఉండొచ్చు. సరిగ్గా జ్ఞాపకంలేదు కాని వెనక్కి తిరిగి చూశాను కనుక నే ఇది జరగటానికి కవకాశం ఏర్పడింది. సరిగ్గా ఒకటి తర్వాత ఒకటి ఏంజరిగిందీ మాత్రం గుర్తులేదు. ఇప్పుడీ సంగతి వచ్చింది కనుక ఈదృశ్యం మన స్సులో మెదుల్తోంది....వంశీ కంగారుగా బర్నర్ సరిగ్గా వేడెక్కకముందే అయిదారుసార్లు గాలి గట్టిగా పంప్ చెయ్యటంతో స్టౌలో నూనె అంతా పైకిజిమ్మింది మండుతున్న కిరస నాయిల్ తాలూకు పసుప్పచ్చ కాంతిలో ఆమె చరిత్రలోని ఒక భాగం హఠాత్తుగా స్పష్టమైంది నాకు - పోనీ అలా అయినట్లు తోచింది. ఆ నూనె పైకిచిమ్మేసరికి వంశీ మరింత గాభరా పడ్డాడు. ఆమె మాత్రం రవంతైనా చలించలేదు. పై పెదవి బిగించటంతో క్రింది పెదవి కొంచెం కుంచించుకున్నట్లు కన్పించింది. కనుకొలకుల్లో వ్యంగ్యకరుణాదీప్తమైన దృష్టి ఒక్కసారి తళుక్కుమని, మళ్ళీ అంతలో అవలుప్తమై పోయింది. అంతే! కొంతసేపయిం తర్వాత - సరిగ్గా ఎంతసేపయిం తర్వాతో గుర్తులేదు- "నువ్వు తప్పుకో" అన్న మాటొకటి చెవిని పడింది. వంశీ తప్పుకుని, స్టౌకి పక్కగా కూచున్నాడు. కొంచెం సేపటికి- స్టౌ నోరు నొక్కుడుపడ్డాక - ఆ కిరసనాయిల్ మంట నీలకమలాలా మారిపోయి, స్టౌ రంధ్రాల్లోంచి కన్పించసాగింది. ఇాకే విశేషమూ జరిగినట్లు గుర్తులేదు.

తర్వాత జరిగిన సంఘటన మాత్రం - మర్మాంతికమైన సంఘటన కనుక - గుర్తుంది. రెండోకప్పు టీ తాగుతూండగా జరిగిం దా సంఘటన. ఇంత తీవ్రమైన ఆఘాతం ఇలా తలవని

తలంపుగా తగులుతుందని - అంటే, 'ఈ సబ్ కథ'లోని ఒంటి కంటి లేడికి పట్టినదుర్గతే నా మొహానకూడా రాసిపెట్టిఉండవి - నేను కల్లోకూడా ఊహించలేదు. టీకప్పు చిన్నది. కాసేపట్లోనే ఖాళీఅయింది.

"ఇంకో కప్పు తీసుకుంటారా?"

"ఇవ్వండి!"

మొదటికప్పు తాగుతుండగా జరిగిన హడిపాడి సంభాషణలోని అరమరికంతా చాలావరకు తగ్గిపోయింది. అప్పుడసలు జరిగిన సంభాషణ ఏమిటోకూడా నాకు గుర్తులేదు. బహుశా పక్షవాతానికి సంబంధించినమాటలో నాలుగయిదు స్వర్ణేందునిగురించిన మాటలో రెండుమూడు, వంశీ అవనీశ్ ప్రసక్తి తీసుకొచ్చి, తనకి చేతయినరీతిని అతణ్ణి గేలిచేస్తూ అన్నమాటలో రెండుమూడు మా సంభాషణలోకి వచ్చివుండొచ్చు. ఏ తాహతా - ప్రయోజనంలేని, తలా తోకా లేని, కొన్ని కొన్ని సందర్భాల్లో అర్థంకూడాలేని ఆ మాటలకన్నిటికీ - అపరిచితుడితో, పోనీ అతిపరిచితుడితో ప్రసంగించటానికి ముందుకలిగే అవరోధాల్ని తొలగించట మొక్కటే ప్రయోజనం అయి ఉండొచ్చు!

రెండోసారి నా కప్పులో టీ పోస్తూ, కప్పుమీదనే చూపు నిలిపి "తమరు విదేశీ సాహిత్యం చాలా చదివినట్లున్నారు కదూ;" అని అడిగింది.

"ఏదో కొంత కొంత చదివినాను"

"తమరచనల్ని చదువుతూంటే ఆ సంగతి తెలుస్తూనే ఉంటుంది"

ఇది తెగపొగడటమో, తెగనాడటమో సరిగ్గా అపగా హానచేసుకునేలోపుగానే పంచదార కలుపుతూ, దృష్టిమాత్రం అక్కడే ఉంచి, "ఒక్కవిషయం అర్థంచేసుకోలేకపోయాను. తమరది ఒప్పుకోరేమో?" అని ప్రశ్నించింది నాజూకుగా.

"ఏమిటది?"

"మీరు రాసిన 'అంతేలే' అన్న నాటకంలో, ఇబ్సన్ రాసిన 'పీర్‌గిన్ట్'లోని కొన్ని సంఘటనల్ని తీసుకున్నారు. మీ కవిత్వంలో 'కట్స్' కవిత్వపుఛాయలు చాలా కన్పిస్తాయి. కాని మీరా విషయం ఎక్కడా ఉల్లేఖించనూలేదు; ఆ రచయితలకి కృతజ్ఞత చూపనూలేదు. ఈ రోజుల్లో చాలామంది రచయితలిలాగే చేస్తున్నారనుకుంటాను. ఇంత గొప్ప మేధావులైన రచయితలకేమిటో ఈ దౌర్బల్యం నాకర్థంకావటంలేదు"

నా ముఖంకేసి ఒక్కక్షణం రెప్పవాల్చకుండాచూసింది. 'గ్రేట్‌మెన్ థింక్ ఎ లైక్' అని వంశీ అనబోయాడనుకుంటా. కాని అతడు 'గ్రేట్‌మెన్' అంటూ నవ్వాడు. ఆ నవ్వటంతో చేతిలోవున్న కప్పులోని టీ అంతా తొణికిపోయింది 'థింక్ ఎలైక్' అన్నది ఆ తొణికి కింద పోయిన టీతో కొట్టుకుపోయింది.

తుపాకిగుండు తగలటంతో ఒంటికంటి లేడికి ప్రాణం పోయింది . . .

నాకూ ప్రాణా లెగిరిపోయాయి.

నిర్జీవినైపోయి చూస్తూ ఊరుకున్నాను.

"అయినా మీ రచనలంటే నాకుచాలా యిష్టమండీ!"

ఆ 'చాలాయిష్టం' అన్నమాట, ఎంతో దూరాన్నుంచి టెలిఫోన్‌లో చెప్తున్నట్లు విన్పించింది నాకు. ఆ

చచ్చిపోయిన లేడి మాంసంకూడా ఆ వేటకాడికి చాలా ఇష్టమయే ఉంటుంది!

హఠాత్తుగా నామాటలకి నేనే చకితుణ్ణయినాను.

"అర్థంచేసుకున్నాను . . . కాని నే ననే దేమిటంటే - చాలా సందర్భాల్లో అజ్ఞాతంగానే— ఆఁ ఏమంటారు. . . తెలియలా ?. . . అనేక భావాలు. . ."

"ఓ! అలాగా!"

సరీగ్గా మరుక్షణంలోనే నాలోని మంచితనం అంతా నా చూపుల్లోంచి బైటికిపోయి, ఆమె అనమితముఖంలో కుడిచెంపకి చెందిన మఖ్‌మల్ నిగనిగల నలుపులో కలసిపోయింది. . . .కాసేపు బొమ్మలా అలాగే ఉండిపోయాను . . .

తర్వాత ఏదో సాకుతో నేను కుర్చీలోంచి లేచి ప్లాట్‌ఫారంమీద పచారు లెట్టటం మొదలెట్టాక మళ్ళీ మామూలు మనిషినయినాను. ప్లాట్‌ఫారమంతా గందరగోళంగా ఉంది. ఏదో రైలొచ్చిం దొకటి.

జనం గుంపుగా మూగారు. 'ఇన్‌కిలాబ్ జిందాబాద్,' 'వందేమాతరం' 'ఇన్‌కిలాబ్ జిందాబాద్' 'వందేమాతరం' కేకలమధ్యనుంచి, ఖద్దరుధరించి, ఖద్దరునూలును దండవేసుకున్న ఒక వ్యక్తి ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోంచి దిగాడు. ఈ ప్రాక్టీసులేని ప్లీడరు అందరికీ పరిచితుడైనవాడే. డెమాక్రసీ యంత్రం తిరుగుతున్నప్పుడు ఎప్పుడెంత తైలం పొయ్యటం, ఎప్పుడు డేసీల తిప్పటం అవసరమో తెలుసుకుని, దాన్నలా చాకచక్యంతో త్రిప్పగలిగితే, భాగ్యచక్రం రయ్‌న ఉన్నతపథంలో తిరగటానికి ఎలాంటి అవకాశం ఏర్పడుతుందో దానికి ఇతడే

చక్కటి ఉదాహరణ. మొదట్లో అతడు ఏదో చిల్లరవ్యాపారాలు చేస్తూండేవాడు. ఇప్పుడు తెలివి, మాటలు, ఖద్దరు – వీటిని మూలధనంగా చేసుకుని టోకు వ్యాపారాలు సాగిస్తున్నాడు. గుంపు చెదిరిపోయింది. రైలు వెళ్ళిపోయింది. కాసేపు మెదలకుండా అలాగే నుంచున్నాను.

"ఓ, అలాగా?"

మళ్ళీ ఆమాటే చెవుల్లో మ్రోగింది. నేనూ ఆ దండ వేసుకున్న చోరుడి సగోత్రుణ్ణే నని చటుక్కున తోచింది. చతికిలపడి కూర్చున్నాను. రంగురంగుల జంపకానా క్రింద పరిచేఉంది. గట్టిగాబిగించికట్టిన పరుపుచుట్ట వెనకాలేఉంది. పేరు రాసిఉన్న నల్లట్రంకుకూడా ప్రక్కనేఉంది. కళ్ళుమూసుకుని పరుపు చుట్టకి చేరగిలపడ్డాను. దివాలా తీసినవాడిలా ఉన్నాననిపించింది. దొంగతనం పట్టుపడినంతమాత్రాన నష్టంలేదు. కాని ఆమె దగ్గిరనా? దొంగసొత్తుతో సహా ఎప్పుడో ఒకప్పుడు ఆమెకూడా నాదగ్గిర పట్టుపడుతుందని అప్పు డెవరికి తెలుసు? కానికాదు. అసలుసంగతి అదికాదు. ఆమె పట్టుపడలేదు. పట్టి ఇచ్చింది. ఆకాశ పాతాళాలకి ఉన్నంత వ్యత్యాసం. టెలిగ్రాఫిక్ ప్యూన్ వంశీని వెతుక్కుంటూ రాకపోయినట్లయితే, బహుశా నే నారాత్రంతా అలాగే కూర్చునే వాణ్ణనుకుంటా. వంశీపేర టెలిగ్రాం ఒకటి వచ్చింది. వెయిటింగ్ రూం తలుపులు కొంచెం ఎడంచేసి వంశీని పిలిచాను. వంశీ బయటికి వచ్చి టెలిగ్రాం తీసుకుని చూసుకుని, మళ్ళీ వెయిటింగ్ రూం కేసి తిరిగి "జ్యోతిర్మయదా టెలిగ్రాం ఇచ్చాడు – Missed!

Train. Following in a Taxi. Inform Ratri. Wait for me."

గుమ్మంవైపు చూశాను. రాత్రి నుంచుని ఉంది. మెదలకుండా చాలాసేపు నుంచుంది.



ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌లో స్వర్ణేందువచ్చిన సమయానికి నాకు కాస్త నిద్ర మబ్బువచ్చినట్లుంది. వంశీపిలుపుతో లేచి కూర్చున్నాను. ఎదురుగా – మబ్బురేగిన జుట్టు. మాసిపోయిన గడ్డం. సగంమాసిన గుడ్డలు, కాన్వాస్ బూట్లతో ఉన్న ఒకవ్యక్తి చిరునవ్వుతో నాకేసిచూస్తూ కూర్చుని ఉన్నాడు. ఇతడు ఒక్కనాటికి స్వర్ణేందుకాడు. మాతో కలసి చదువుకున్న ఆ ఒక్కపలచటి – బిడియస్తుడు స్వర్ణేందా ఇతడు? నేను లేచి నిలబడగానే 'ఘనశ్యాం! నువ్వా!' అంటూ నన్ను కావిలించుకున్నాడు. అంతే. ఇంకేం మాట్లాడలేక పోయాడు.

స్వర్ణేందు రెండుగంటలసేపు ఉన్నాడనుకుంటాను. కాని ఈ రెండు గంటల్లోనూ చాలాసేపు నాదగ్గిరేఉన్నాడు. రాగానే అయిదు నిమిషాలుమాత్రం వెయిటింగ్‌రూంలోకి పోయి కూర్చుని, తర్వాత ఇహ అంతా నా దగ్గిరేవున్నాడు. తల్లిని తీసుకువద్దామని మధుర వెళ్ళాట్ట, కాని తల్లి రాలేదు. ఆమెకి ఈ సంసారపు జంజాటంలోకి రావటం ఇష్టంలేదట. స్వర్ణేందుమ్లానంగా నవ్వి, "అమ్మకి అప్పుడప్పుడు ధర్మతత్పరత అలా పైకి ఉబుకుతూఉంటుంది. అలాంటప్పుడు ఈ జంజాటంఅంతా వదిలించుకుని ఎక్కడికోవెళ్ళిపోతూ ఉంటుంది. కొన్నాళ్ళు పోయాక మళ్ళీ వస్తూవుంటుంది. మళ్ళీ వెడుతూ ఉంటుంది.

నాన్నకి పక్షవాతం రావడం ఆమెకి మరీ అవకాశంగా ఉంది. అసలు సంగతేమిటో తెలుసా?" అని వెయిటింగ్ రూం కేసి చూసి, గొంతు తగ్గించి "అసలు దీనికంతకీ రాత్రే కారణం. దాని పెళ్ళినిగురించే బాయీ, ఈ గడబిడంతా. అమ్మకాస్త - అంటే ఏం లేదు. ఈ కాలపు స్వతంత్ర - స్వేచ్ఛ ఇలాంటివి ఆమెకి నచ్చవు. కాని అలా అనటం మాత్రం ఎలాగులే!" అని కాసేపాగి. చిన్న నవ్వొకటి నవ్వి "అంటే మాతో వివాదం పెట్టుకోలేక కోపంవచ్చి చివరికిలా పారిపోయింది." అన్నాడు.

"ఎక్కడికి వెళ్ళిందామె?"

"ఎక్కడికేముంది? కాశీ, బృందావనం, మధుర, ప్రయాగ, ఎప్పుడామె గురుదేవు లెక్కడుంటే అక్కడికి వెడుతుంది. ఆయనకి కబురుచేస్తే చాలు త్రోవఖర్చులు పంపుతూ ఉంటారు"

కొంచెం సందేహం వచ్చింది.

"గురుదేవులే త్రోవఖర్చులు పంపుతారా?"

"ఆఁ, అమ్మని ఎప్పుడూ చూడలేదు నువ్వు. చాలా విచిత్రమైన ప్రకృతిలే ఆమెది. మధ్య మధ్య దేవతలమీద భారమంతా వదిలి ఊరుకుంటూ ఉంటుంది. . .

"దేవతలమీద భారంవదిలా?"

"ఆమెని చూడనిదే విశ్వసించటం కష్టం. కాని చాలా చిత్రం"

తల్లి కథ ముగించి, స్వర్ణేందు తన బికారి జీవితకథ చెప్పటం మొదలెట్టాడు. ఎన్నెన్నిరకాల ప్రయత్నాలుచేస్తే

ఎన్నెన్ని విధాల వ్యర్థమైనాయో ఆవర్ణన అంతా. రెండుగంటలసేపు ఒకే కథని అనేక రీతుల్లో విన్నాను. కాని అవన్నీ జ్ఞాపకంలేవు. కాని ఇదిమాత్రం బాగా జ్ఞాపకం ఉంది. స్వర్ణేంద్రుతో ఏదో క్రొత్తదనం చూశాను నేను. మాతో చదువుకున్న ఒక్క-వల్చాటి బిడియస్తుడైన స్వర్ణేందులాగా లేడితడు. 'ఇతడు అతడికంటె వేరయిన మరో విచిత్రవ్యక్తేమో' అన్నట్లున్నాడు.

పదమూడు పదేళ్ళకిందట మా మేనమామగారింటికి వెళ్ళాను ఒకసారి. అప్పుడు వాళ్ళ యిల్లు ఎలా ఉండేదని! కళకళలాడుతున్న ముంగిలి, అక్కడోక మూలగా వెదురుపందిరి, దానినిండా పందిరిదోసకాయలు, దక్షిణపువైపు మదురు గోడమీదికి పాకిన దొండపాదు . . . మధ్యన దణ్ణంమీదవాలి ఓ చిలక అక్కడ చేరినవారికి రామనామం విన్పింపచెయ్యటం, వంటయింటి వసారాలో అత్త కుంపటిమీద పొరాటాలు, పూరీలు, క్షీరాన్నం వండుతూండడం. . .! మామయ్య అప్పుడు పట్నంలో ఉంటున్నాడు. ఆ ఇంట్లో ఎవరూ లేరు . . . రెండు నెలలక్రితం ఏదో పనితగిలి మళ్ళీ అక్కడికి వెళ్ళాను. ఆయింటి మరో ఆకృతిని చూసివచ్చాను. ఆ ముంగిలినిండా ముళ్ళచెట్లున్నాయి అడివిలాగా. జిల్లేళ్ళు, పల్లేళ్ళు, ఉమ్మెత్తలూ, తుమ్మలూ అన్నీ పెరమొలిచాయి. గుడ్లగూబలు, గబ్బిలాలు నిర్భయంగా తిరుగుతున్నా యిప్పుడక్కడ. ఇది మాత్రం కళ కాదా అంటే, కాదని కాదు – ఇదొక క్రొత్తరకం కళ.

స్వర్ణేందుని చూడగానే ఈ యింటి రెండురకాలైన దృశ్యాలూ గుర్తుకొచ్చాయి. ఇదివరలో ముందుకు వచ్చి

మాట్లాడాలంటే బిడియపడే స్వర్ణేందు ఇప్పుడు 'వాక్య వాగీశు'డయాడు-అంటే ఏంలేదు, వాగుడుపిట్ట అయినాడు.

"తెలిసిందా భాయీ! దరఖాస్తు తీసుకుని వెళ్ళాను. పెద్దమనిషి దగ్గిరికి. ఆయన ఒట్టిమాటలతో ఉట్టికెక్కలేదు, స్వర్గానికెక్కించాడు. ఏమన్నాడో తెలుసా? 'ఫస్ట్‌క్లాస్ యం. యే. వి. నీకు దిగులెందుకోయ్. తప్పక వచ్చితీరుతుంది ఉద్యోగం. నేనుగట్టిగా సిఫార్సుచేస్తాను నీకు' అన్నాడు. హరిశ్రీహరి! అతడందరికీ అలాగే చెప్పేవాడని, అసలు సంగతి లంచం ఇవ్వందే ఏమీ చెయ్యడనీ ఆఖరికి తెలిసిందోయ్."

అనిచెప్పి, అద్భుతమయిన చిరునవ్వొకటి నవ్వుతూ, స్వర్ణేందు నా మొహంకేసి చూశాడు-'నిజంగా లంచంయిచ్చి ఉద్యోగం సంపాయించటమంత అవివేకం మరొకటిలేదు కనుక, ఆ ప్రయత్నం మానుకోవలసి వచ్చింది' అని ఆ నవ్వులోని అర్థం—

ఘాంగ్...ఘాంగ్.. ఘాంగ్...

ఇందాకట్నుంచీ కుయ్ కుయ్ లాడుతున్న ఇంజన్ గుడ్స్‌వాగన్నుని షంటింగ్ చేస్తోంది. ఇప్పట్లో రైలువచ్చే ఆశ యేమీ లేనట్లుంది. 'అప్-డౌన్‌భాషి' అయిన ఆ బాబు అడుగున కార్బన్‌పేపరుపెట్టి ఉన్న కాగితాలమీద పెన్సిల్‌తో ఏదో గీకుతున్నాడు. కూలివాళ్ళు 'సార్! సార్' అంటూ అతని చుట్టూ మూగుతున్నారు.

"తర్వాత ఉద్యోగప్రయత్నాలకి స్వస్తిచెప్పి, ఓచిన్న దుకాణం పెట్టాను తెలుసా? మొదట్లో కొద్దిరోజులు బాగానే

సాగింది. మనవాళ్ళంతా ఈ కొట్లోనే కొంటూ ఉండేవాళ్ళు. కాని 'కాపిటల్' ఆట్టే లేకపోవటంతో ఎక్కువరోజులు ఉంచలేకపోయాను. మా చెడ్డపోటీవచ్చి పడింది భాయీ! తెలిసిందా! "మళ్ళీ ఓ చిరునవ్వునవ్వి, ఆ దోషమంతా 'చెడ్డపోటీ' నెత్తిపరుద్ది కాస్త తెరపినపడ్డాడు. "మనవాళ్ళంతా కొనేవాళ్ళన్నావు. దుకాణం ఆట్టేరోజులు సాగలేదంటావ్ - అంటే అర్థమేమిటి?" అని అడిగాను నేను.

స్వర్ణేందు కొంచెం సిగ్గుపడ్డాడు. అంటే అసలు సంగతి బయటపెట్టటాని కతడికి తలకొట్టేసినంత సిగ్గేసిందన్నమాట! దుబ్బుగా పెరిగిన ఆ గడ్డం మీసంలోంచి, వెనుకటి ఆ బిడియస్థుడైన స్వర్ణేందు అసలు రూపం ఒక్క క్షణంమాత్రం బయటపడింది.

"అంటే - మనవాళ్ళ పరిస్థితులు తెలుసుగా! ఇంచుమించు అందరూ కాతా పెట్టి కొనేవాళ్ళు. అన్నవ్వుడల్లా ఆ కాతాల్లో సంతకాలుకూడా చేసేవాళ్ళుకారు. సంతకాలు పెడితేమాత్రం నేను దావాలుచేసేవాణ్ణా యేం? అనేకమంది నాన్నగారి స్నేహితులు వారిలో; అలాగే నా స్నేహితులు కొంతమంది. అటుచేసి ఇటుచేసి చివరికంతా మనవాళ్ళే! ఏదైనా కావాలంటూ వచ్చినప్పుడు మొహమోటమికొద్దీ లేదని అనలేకపోయేవాణ్ణి. మనవాళ్ళ స్థితిగతులు తెలుసుగా!" అని నవ్వుతూ, ఏదో జాతిజాతి అంతటి తరఫునా క్షమించమని వేడుకుంటున్నట్లు సంకోచంతో నాముఖంకేసి చూశాడు.

నే నతడి మాటలు శ్రద్ధగా వినలేదనికాదు కాని, అతడి మాటలు వినటంకంటే అతణ్నే పరిశీలనగా చూశాను. మాట

మాటకీ మధ్య ఆ చిరునవ్వు, ఆ మాసినగడ్డం - మీసం, ఆ రేగినజుట్టు, ఆ ఆదర్శాలు. ఆ సత్యనిష్ఠ, ఆ నిస్సహాయ స్థితి...ఇవన్నీ కలిపి, వెరసి ఇతడొక కొత్త స్వర్ణేందు. గాలిలో బ్రతుకుతూకూడా ఆ సత్యనిష్ఠతో ఎన్ని అవమానాలయినా చులకనగా త్రోసేసుకోగలుగుతున్నాడు. బహుశా జీవితంలో ఒక్కసారి అబద్ధమంటూ ఆడవలసివస్తే - ఆ తర్వాత అసలింక బ్రతకలేడేమో అనుకుంటూ.

"ఇన్స్యూరెన్సు బిజినెస్ మీద కొన్నాళ్ళు తిరిగాను. కాని అది మనకి సరిపడలేదోయ్! ఒఠ్ఠి పచ్చిఅబద్ధాలాడాల్సి వచ్చేది. అదీకాక ఇటు కంపెనీ అధికారుల్ని, అటు మామూలు ప్రజల్నికూడా తెగపొగిడి సంతోషపెడుతూ ఉండాలి. డాక్టర్నికూడా ఖుషీ చెయ్యాలి. దేశంలో హెచ్చుమంది ఆరోగ్యం లేనివాళ్ళేగా! వాళ్ళంతా ఆరోగ్యవంతులే అని చెప్పటం మోసం చెయ్యటమేగా! నువ్వా డాక్టరివే. ఇలాంటి సందర్భాల్లో మధ్యమధ్య నువ్వయినా చిక్కనపడక తప్పదు. తెలియలా?"

అని మళ్ళీ అలాంటిచిరునవ్వే ఒకటి నవ్వాడు. దాని అంతర్యం అబద్ధాలు చెప్పి డబ్బు సంపాయించడమనేది కూడదు కనుక అదీ మానుకోవాల్సివచ్చిందీ అని...స్వర్ణేందు ఇహ మాట్లాడక ఊరుకున్నాడు.

ఒకదానితర్వాత ఒకటి చాలాకథలువిన్నాను. ప్రతికథకీ చివరమాత్రం 'కనుక అది మానుకోవలసివచ్చింది' అంటూ వ్యంగ్య మందహాసం చేశాడు.

"అయితే మరి ఎలా గడుస్తోంది మీకు?"

అమర్యాదకరమైన ఈ ప్రశ్న హఠాత్తుగా నా నోట్లోంచి వచ్చేసింది.

"నాన్నకిచ్చే పెన్షన్‌తో. నాన్న చనిపోతే మాకు చావే. అందుకనే అన్నీ వదులుకుని నాన్నని బ్రతికించటానికి, చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేస్తున్నాం. కలకత్తాలో మాకో చిన్న ఇల్లయితే ఉందనుకో. కాని, అది అద్దె లెక్కువగా వచ్చే చోటులో లేదు."

స్వర్ణేందు మళ్ళీ నవ్వాడు. నవ్వి నానాలిక చివరదాకా వచ్చిన ఆ అమర్యాదకరమైన ప్రశ్నకి కూడా - అనుకోకుండానే జవాబుకూడా ఇచ్చాడు.

"అప్పుడప్పుడు అవనీశ్ కొంతడబ్బు యిచ్చాడు. జ్యోతిర్మయుడికి మధుపురంలో ఇల్లొకటుంది. అందుచేత గాలి మార్పుకి నాన్నని అక్కడికి తీసుకువెళ్ళగలుగుతున్నాం. లేకపోతే నాన్నకివచ్చే పెన్షన్‌తో ఇన్ని సరిపెట్టుకోవటం ఎలా సాధ్యమౌతుంది?"

"అవనీశు డెవరు? జ్యోతిర్మయుడెవరు?"

"ఇద్దరూ నా స్నేహితులే. అవనీశ్ బొంబాయిలో వ్యాపారంచేస్తూఉంటాడు. నాలుగురాళ్లు సంపాయించినవాడు. జ్యోతిర్మయుడు ఆర్టిస్టు."

"ఓ"

వంశీ టీ తీసుకొచ్చి ఇచ్చివెళ్ళాడు. వంశీ నౌకరులాగా అన్ని పనులూ చేస్తూఉండటం గమనించాను. వంశీ వెళ్ళిపోగానే "వంశీ యెప్పుడూ మీతోనే ఉంటూఉంటాడనుకుంటాను" అని అడిగాను స్వర్ణేందుని.

"ఆఁ. చిన్నప్పట్నుంచీని. అతడికి తల్లీ- దండ్రీ ఎవరూ లేరు. నాన్నే పెంచాడు. అతడ్ని బి. ఏ, ప్యాసుచేయించటానికి ప్రయత్నలోపమేమీూ చెయ్యలేదు. కాని ఏంచేసినా ప్యాస్‌కా లేకపోయాడు." వంశీనిగురించి ఈ అప్రీతికరమైన మాటలు చెప్పవలసివచ్చినందుకు స్వర్ణేందుకు మనసులో కొంచెం కష్టంగా ఉన్నట్లుంది.చిన్న నవ్వొకటి నవ్వి "కొంత కొంత మందికి పరీక్షలు ప్యాసయ్యే 'నేక్' ఉండదు. అలాంటివాళ్ళలో వంశీ ఒకడై ఉంటాడు." అన్నాడు.

ఇద్దరం మెదలకుండా టీ తాగటం పూర్తి చేశాం.

స్వర్ణేందు స్వవిషయాలు చెప్పటం ముగించి ఇంక నా సంగతులు ఎత్తాడు.

"కలకత్తాలో ఎక్కడ - నువ్వు ప్రాక్టీసుపెట్టింది?"

"బేనేటోలాలో"

"బేనేటోలాలో ధరణీబాబుని ఎరుగుదువా? అక్కడే మాకు దూరపుబంధువు బావగారొకాయన ఉన్నాడు - అతడి పేరు నిఖిలచౌధురీ, వకీలు."

"నే నెవర్నీ యెరుగను"

"ఈ సారి వెళ్ళాక మాట్లాడిచూడు"

వారి చిరునామా వ్రాసి ఇచ్చాడు స్వర్ణేందు

"బేనేటోలాలో స్వంత ఇల్లేనా వారిది?"

ధరణీబాబుది స్వంతయిల్లే. నిఖిల్‌దామాత్రం అద్దె యింట్లోనే ఉన్నాడు. చాలాకాలంనుంచీ ఆయింట్లోనే ఉంటు న్నాడు. మంచివాడు."

సరే, అలాగే. ఈ సారి వెళ్ళగానే పరిచయం చేసుకుంటాను"

ఇద్దరి ఇంటినంబర్లూ అడిగి తీసుకున్నాను.

ఇటీవల నువ్వు చాలా గొప్పగా రాస్తున్నావుట భాయీ! నీ రచనల్ని రాతూ భలే మెచ్చుకుంటూ వుంటుంది"

ఆ 'భలే' అన్నమాటను స్వర్ణేందు భలేబాగా అనటం గమనించాను. రాతూ నారచనల్ని భలే మెచ్చుకుంటూ వుంటుంది కనుకనే అనుకుంటాను, అనవసరప్రసక్తి అయినా "ఆమెకి ఏదోఒక సంబంధం నిశ్చయం చెయ్యండి. నేనూ ప్రయత్నం చేసి చూస్తాను. ఆడపిల్లపెళ్ళి అనగానే ఈ రోజుల్లో పెద్ద సమస్యకదా!" అని అనేశాను

"అమ్మ అంత మొండితనంగా ఉండకపోతే రాతూ పెళ్ళివిషయం అంత పెద్దసమస్య అయేదికాదు. ఆమె మనస్సులో ఏం ఉందో నేను చెప్పలేను. జ్యోతిర్మయుడు – అంటే నా ఆర్టిస్టు స్నేహితుడు – రాతూని ఇప్పటికైనా చేసుకోటానికి సిద్ధంగానే ఉన్నాడు. కాని అమ్మే ఏమాత్రం ఇష్టపడటంలేదు. అమ్మ యిష్టంలేందే చేసుకోవటం జ్యోతిర్మయుడికే ఇష్టంలేదు. అమ్మకి అవనీశుడంటే యిష్టం"

"ఎంచేత ?"

"అవనీశుడు నాలుగురాళ్ళు సంపాయిస్తున్నవాడు; అదీ కాక శాస్త్రధార్మికధోరణికూడా ఉన్నవాడు. అమ్మకి అంత యిష్టమవటానికి అదేకారణమై ఉంటుం దనుకుంటాను."

"అయితే అవనీశుడు ఒప్పుకోవటం లేదా యేం?"

"అవనీశుడూ ఒప్పుకున్నాడు. కాని మా కే - అంటే నేనే ఒప్పుకోలేదు."

"ఎందుకని?"

గడ్డం మీసం దుబ్బులా ఉన్నప్పటికీ సిగ్గరి అయిన స్వర్ణేందు మళ్ళీ బయటపడ్డాడు. తర్వాత మళ్ళీ వెంటనే చిన్న నవ్వొకటి నవ్వేసి, ఆసిగ్గును తమాయించుకున్నాడు. ఇహ ఆ తర్వాత వకాల్తనామా పుచ్చుకున్న ప్లీడర్లు తమ కక్షిదారులతరఫున వాదించినట్లు మాట్లాట్టం మొదలెట్టాడు.

"రాతూ పుట్టినప్పటినుంచీ అమాయకురాలే అనుకో. అయితేమాత్రం దానికీ ఇష్టాఇష్టాలనేవి ఉండవూ? అది ఎప్పుడూ నోరువిప్పి పైకి ఏమీ చెప్పలేదుకదా అని, చూస్తూ చూస్తూ దానికి ఏ మాత్రం ఇష్టంలేనివాడికిచ్చి చెయ్యటమా? నాకు తెలుసు —" స్వర్ణేందు సిగ్గుపడటానికి కారణం ఇదే అయి ఉంటుంది. కాని అతడప్పుడది విప్పిచెప్పలేదు. కొంచెం ఆగి, "అవనీశుడు కేవలం శాకాహారి. సంధ్యావందనాలు చేస్తూ, మాటిమాటికీ డబ్బు పంపిస్తూ అమ్మను ఇష్టం చేసుకున్నాడు. అమ్మ ఒక విధంగా అతడికి వాగ్దానంకూడా చేసింది. ఇహ అసలుసంగతి తెలిశాక నేను మాత్రం ఎలా—"

ముసిముసి నవ్వొకటి నవ్వి మొదలకుండా ఊరుకున్నాడు స్వర్ణేందు కొంచెంసేపయాక మళ్ళీ మరొకసారి అలాగే నవ్వి — "ఇదుగో ఈ రాత్రి పన్నెండయేసరికల్లా జ్యోతిర్మయుడు టాక్సీలో ఎటూ వచ్చేస్తున్నాడుగా - "

ఆవాక్యాన్ని అసంపూర్ణంగా వదిలి ఆగిపోయాడు స్వర్ణేందు. హఠాత్తుగా ఏదో పెద్దగాంభీర్యం తెచ్చుకున్నాడు.

సిగ్గరి అయిన స్వర్ణేందుని హఠాత్తుగా ఏదో ప్రక్కకినెట్టి, ఆదర్శవాది, భావుకుడూ అయిన స్వర్ణేందు ముందుకు వచ్చి, కనుబొమలు చిట్లించుకుని, దూరంగా ఉన్న సిగ్నల్ ఎర్రదీపం కేసి రెప్పవాల్చకుండా కొంచెంసేపు చూస్తూ ఊరుకున్నాడు. తర్వాత మళ్ళీ ఆ విచిత్రమైన నవ్వునవ్వి, ఏదో చెప్పబోయి, అంతలో ఆగిపోయాడు. ఆగిపోయి కొంచెం తెల్లబోయాడు.

"మీ అమ్మకి జ్యోతిర్మయుడంటే కోపం యెందుకు?"

"కోపమేమిటి? అమ్మకి అతడంటే చాలా అపేక్ష. అవ నీకుడిమీదకంటె కూడా ఎక్కువ అపేక్ష. కాని అతడికిచ్చి పెళ్ళిచెయ్యటానికి మాత్రం ఏమైనా సరే ఒప్పుకోదు."

"ఎందుకని? బీదవాడనా?"

"జ్యోతిర్మయు డంత బీదవాడేం కాదు. మధుపురంలో ఇల్లు ఉంది; కలకత్తాలో ఓయిల్లు ఉంది. బొమ్మలువేస్తూ అంతో యింతో సంపాయిస్తూనూ ఉంటాడు. కాని ఏముంటే ఏంలాభం? మితంతప్పి సంచరించే స్వభావం. అజాగ్రత్తమనిషి. ఖయాలీ మనిషి — "

"అతడితో నీకెలా పరిచయం?"

"మొదట్లో అమ్మే కాశీలో అతణ్ణి చూసింది. అమ్మే చెపితేనే తెలిసింది. ఆతడి తండ్రికూడా అమ్మ గురుదేవుడి శిష్యుడేట! జ్యోతిర్మయుడు పుట్టిన కొద్ది రోజులకే అతడి తల్లి పోయిందిట! ఆ తర్వాత తండ్రికూడా పోయినాట్ట! ఆ గురు దేవుడే జ్యోతిర్మయుణ్ని పెంచి పెద్దవాణ్ణి చేశాట్ట! గురుదేవుడి దగ్గిర దాచిఉంచిన జ్యోతిర్మయుడి సంపదంతా అతడు పెద్ద వాడు కాగానే ఆయన అతడి కిచ్చేశాట్ట!"

మా రైలు వచ్చేసింది. కూలివాడొచ్చి నుంచున్నాడు. ఆదరాబాదరాలేచి జంపకానా మడతపెట్టాను. "ఉత్తరాలు వ్రాస్తూఉండు అప్పుడప్పుడు" అని ఆ గోలలో స్వర్ణేందుడు అన్న మాటలు ఇప్పటికీ చెవుల్లో వినిపిస్తున్నట్లే ఉంది నాకు. ముఖం వెనక్కి త్రిప్పి చూశాను. వెయిటింగ్ రూం గుమ్మంలో రాత్రి నిశ్చలంగా నుంచునిఉంది....

హఠాత్తుగా గాలి బంధించింది. విపరీతమైన యెండ. చటుక్కున గాలిదుమారం వచ్చి కాలికాలిఉన్న దుమ్మంతా పైకిలేచింది. చెప్పులుకుట్టే ముసిలివాడు, చలివేంద్రవాడు ఏదో భాషలో పోట్లాడుకోవటం మొదలెట్టారు. మన్నులో పడుకుని లేచిన కుక్క, రోడ్డుప్రక్కన నిలబడి ఒళ్లు దులుపుకుంటోంది. ఒక సైకిల్ వచ్చి రిక్షాతో గుద్దుకుంది. సైకిల్ కుర్రాడు ముందుకుపడ్డాడు. అసలతడిదే తప్పు. హాండిల్ మీదనుంచి రెండు చేతులూ వదిలేసి, తన ప్రతిభఅంతా చూపుకుంటూ తొక్కుతున్నాడు. రిక్షావాడు ఒక్క పరుగుతీశాడు. తప్పంతా అతడిదే అని కొంతమంది అతణ్ణి పట్టుకోటానికి పరుగెత్తారు. తమ పోట్లాటంతా మరచిపోయి, చెప్పులు కుట్టేవాడు, చలివేంద్రవాడుకూడా పరుగెత్తారు. ఎంత అద్భుతమైన పరిసరాలు! ఇవాళకింక రాయను. శ్రుతితప్పింది. మరో రోజున ప్రారంభిస్తాను....

## 2

ఇంతకుముందే ఒకజల్లు వాన కురిసి వెలిసింది.

భూమికాస్త చల్లబడిందన్నమాటేకాని, వాతావరణం ఇంకా మామూలుస్థితికి రాలేదు. బిళ్ళలు బిళ్ళలుగాకట్టిన

పాలలాగా, ఆ చిన్నచిన్న బిళ్ళల సందుల్లోంచి కొంచెం పచ్చగా కన్పించే నీరులాగా – ఆఁ, ఓ వాన కురిసి వెలిశాక ఆకాశంకూడా చాలావరకు అలాగే వున్నదని చెప్పవచ్చు. తునకలు తునకలుగా విడిపోయిన మబ్బుల మధ్యనుంచి స్వచ్ఛమైన ఆకాశం తొంగి చూస్తున్నట్టుంది. నాలుగువైపులా వెన్నెల ఒత్తుగా విరిసింది. పూర్ణిమరాత్రివేళ మబ్బులు విడిపోయిన శోభకాదీ వెన్నెలది. మసక మసకగా ఉండే కాక్రీ వెన్నెల సొగసు వానలో స్నానాలుచేసిన చిన్ని చిన్ని పూలుం గోడ కటువైపునుంచి కమ్మని వాసనల్ని విరజిమ్ముతున్నాయి. ఆరుబయటనే – దోమతెర వేసుకుని కూచున్నాను. విపరీతంగా ఉన్నాయి దోమలు...ఇలాంటి రాత్రివేళ అలా ఆకాశంకేసి చూస్తూ కూచోటం చాలా బావుంటుంది; పక్కనెవరైనా ప్రేయసికూడా ఉంటే మంచిదే అనుకోండి, లేకపోయినా వచ్చిన నష్టమేమీలేదు. వాస్తవానికి సశరీరంగా ఉండకపోవటమే వాంఛనీయమేమో అనిపిస్తుంది. నీలాంబరి అయిన ఓ బింబాధరి సరసనే ఉన్నట్లు సులభంగా భావించుకోవచ్చు. ఆ ఊహాసుందరి ఏంచేసినా ఫరవాలేదుకాని, మధ్యలో మనల్ని పల్కరించి రసభంగం మాత్రం చెయ్యకుండా ఉండాలి !

నేను మాత్రం ఇవేమీ చెయ్యకుండానే లాంతరు వెలిగించి వ్రాసుకుందామని కూర్చున్నాను ..స్వర్ణేందువచ్చి కలిశాడు. ఈ మేఘమేచకరజ్యోత్స్నలో స్వర్ణేందు చాటుగానే వచ్చాడో, ఇంకెలా వచ్చాడో ఏం చెప్పగలం.

కోలోటోలావీధి మొగలో స్వర్ణేందుని హఠాత్తుగా కలుసుకున్న సంగతి జ్ఞాపకం వచ్చింది.

దోమతెరకి వెలుపల రక్తపిపాసువులైన దోమలు కావలసినన్ని - రణగొణధ్వని చేస్తున్నాయి. రక్తం అంటే ఆశపడే ఈ దోమలగుంపు ఏ మంత్రశక్తివల్లనయినా హఠాత్తుగా - ఒక్కసారిగా, చక్కెరపొంగలి అంటే ఆశపడే వైష్ణవ భక్తబృందంగా మారిపోయి, 'తమకొకకీర్తన వినిపించాలని వచ్చాం మేము. దయవుంచి కాస్త దోమతెర పక్కకి తప్పించండి' అని సవినయంగా ప్రార్థేమపడితే యెంత ఆశ్చర్యపోతామో, ఆ రోజున స్వర్ణేందు చేతిలో ఎర్రటి ఒరలో వున్న కత్తి చూసినప్పుడు - అంతకంటె ఎక్కువ ఆశ్చర్యపోయాను. కాని ఆట్టే ఆలోచించి చూస్తే ఇదేమంత ఆశ్చర్యకరమైన విషయంగా కన్పించలేదు కత్తి అనేది మానవుల చేతుల్లోనేగా ఉండేది! ఆ రోజున తెల్లవారగట్ల ప్లాట్‌ఫారంమీద కూర్చుని ఉన్నప్పుడు, స్వర్ణేందుమీద నాకు కలిగిన అభిప్రాయంలో ఈ కత్తిని గురించిన ఊహ రానేలేదు. తాడు హఠాత్తుగా పాముగా మారిందంటే వులిక్కిపడతాం. కాని కొంచెం సేపయాక, రజ్జువుని చూడటంతోనే సర్పమనే భ్రమ కలిగింది కాని, రజ్జువు మాత్రం రజ్జువుగానే వుండిపోయిందన్న సంగతి తెలిసివస్తుంది. కాని ఆ భ్రమలో కూడా సూచనప్రాయంగా ఒకవిధమైన నిష్ఠురత వుందనేది నేను ఆనాడు గ్రహించలేదు.

ధరణీబాబు అన్నమాటలు గుర్తుకు రాసాగాయి. "వాళ్ళ ఆనూ పానూ తెలుసుకోలేరు బాబూ! వాళ్ళు అచ్చమైన మనజాతికి చెందినవాళ్ళు కారు. ఏదో మరోజాతికి చెందినవాళ్ళు"...ధరణీబాబు మాత్రం కచ్చితంగా బెంగాలీయే. ఉద్యోగం చేసి అంతో యింతో నికరంగా సంపాయించినవాడు.

వనులని నిందించటం పనిగాపెట్టుకున్నవాడు. ఉత్సవాలవీ చేస్తూంటాడు. వివాహమహోత్స వాహ్వానాలు మొదలైన వాటిల్లో 'బహుమతులేవీ స్వీకరించజాల'నని అచ్చువేయించినా వచ్చినవాటిని స్వీకరిస్తూనూ ఉంటాడు; మళ్ళీ ఇస్తూనూ ఉంటాడు. ఇంట్లో ఇంత ఏతోటకూరో, మెంతికూరో వేసుకుతిని, బయట భళ్ళుమని వాంతిచేసుకుంటూ 'ఉదాత్తభోజనం సరిపడటంలేదు బాబూ!' అంటూఉంటాడు, ముఖం వికారంగాపెట్టి... బొ్రవ్రుంచ్, బట్టతల ఉంది నవరత్నాలూ పొదిగిన ఉంగరం ఉంది. ఇంట్లోఉన్నప్పుడు మూరెడు గుడ్డకట్టుకుని, మితవ్యయం మీద ప్రొద్దున్న బారెడుదూరం నడిచివస్తూ స్వాస్థ్యరక్షణ మీదా ఉపన్యాసాలిస్తూఉంటాడు ఉదయంపూట ఆయన ఇలా వాహ్యాళికి వెళ్ళి వస్తూవస్తూ – పరిచయమైనప్పట్నుంచీ మధ్య మధ్య మా యింటికివచ్చి టీ త్రాగుతూఉండేవాడు. ఆ టీ త్రాగుతున్న సమయంలోనే స్వర్ణేందు ప్రసక్తివస్తూఉండేది. స్వర్ణేందు తండ్రి పూర్ణేందుబాబుకీ – ఆయన మాటల్లోనే చెప్పాలంటే 'రెండు కుక్కలమధ్యపొత్తుకుదిరినట్లు'గా ఆయనకి పరిచయం కాకతప్పనిసరి అయిందట! ఉద్యోగాల సుడిగుండంలోపడివడి చివరికి ఇద్దరూ మూడో బెంగాలీ అంటూ ఎవరూ లేని ప్రదేశానికి వచ్చిపడ్డారు ... అంచేత స్నేహం ఏర్పడింది. ఆయనమాటల్నిబట్టి అందులో స్నేహబంధంకంటె స్వార్థబంధమే ఎక్కువగా ఉన్నట్లు వ్యక్తమవుతున్నా ధరణీబాబు మాత్రం దీన్ని స్నేహమనేఅంటాడు. ధరణీబాబుకి, పూర్ణేందుబాబు సాహచర్యంమూలంగానే చుట్టకాల్చటం అలవాటయిందట! కాల్చిచూడమంటే ఆయనమాటను త్రోసిపారెయ్య

లేకపోయాడు. ఎంచేతంటే పూర్ణేందుబాబు ఎంత స్నేహితుడైనా ఆకడిపై అధికారి ...

ధరణీబాబు అనటం – తానుకూడా సాటి బెంగాలీ అనే ఉద్దేశంతోనే పెడుతూఉండేవాడట! "దొరలాంటివాడు కాని, మరెలాంటివాడయినా కాని, బెంగాలీ అన్నతర్వాత జాతిసంబంధమంటూ ఉండకమానదుగా! ఆ సంబంధాన్ని పురస్కరించుకునే పెడుతూఉండేవాణ్ణి కాని, ఆత్మీయతమాత్రం ఏర్పడలేదు. పూర్ణేందుబాబు పైజమాధరించి పైప్ కాలుస్తూ తలాతోకా లేకుండా చాలా అసహ్యంగా మాట్లాడుతూండేవాడు. చూడరాదూ! ఒకరోజున చాతుర్యాన్నిగురించిన చర్చవచ్చింది. ఏం చెయ్యను? ఆయన చెప్పినదాన్నే బలపరిచాను. ఒకరోజున మాట్లాడుతూ మాట్లాడుతూ చటుక్కున ఆగి, ఒక్క క్షణం నా ముఖంకేసి చూశాడు. తర్వాత 'చుట్టకాల్చు' అన్నాడు....ధరణీబాబు మాటలకి చిరునవ్వునవ్వుతూ అతడు చెప్పినదాంతో ఏకీభవించాను. నేను వస్తుతః డాక్టర్ని. వృత్తిధర్మాన్ననుసరించి చిరునవ్వునవ్వుతూ ఎదుటివారు చెప్పినదాంతో ఏకీభవించటం నేర్చుకున్నాను. నా చిరునవ్వుతో ధరణీబాబు మనసువిప్పటం మరింత తెరుచుకునేది. వాళ్ళసంగతులన్నీ నిరభ్యంతరంగా చెబుతూఉండేవాడు. అయినా వాళ్ళని గురించిన అన్నిసంగతులూ ఆయన చెప్పలేదని ఆ తర్వాత రుజువయింది నాకు.

కోల్‌టోలా వీధి – కాలేజీవీధి కలిసే మొగలోనే ఆరోజున హఠాత్తుగా స్వర్ణేందు కన్పించింది. సరిగ్గా ఆసమయంలోనే. మెడికల్ కాలేజీ గేట్‌లో నుంచి కొందరు ఒక శవాన్ని రాము

నామస్మరణచేస్తూ మోసుకుంటూవచ్చి కోల్‌టోలా వీధి వైపుకి వెళ్ళిన సంగతికూడా గుర్తుంది. అక్కడే ఒంటినిండా ఇత్తడి సొమ్ములు ధరించిన ఒరియాస్త్రీ ఒకామె కాలిబాట మీద పడుకుని ఉంది. ఒక పెద్దమనిషి మోకాలిదండె వేసుకు కూర్చుని, ఆమెముందు ఏవో తినుబండారాలు పెట్టి, స్వీకరించమని ప్రాధేయపడుతున్నాడు. ఆమెనిగురించి రకరకాల పుకార్లున్నాయి - కొందరామెని తాంత్రికురాలైన గొప్పయోగిని అంటారు. కొందరు పిచ్చిదంటారు. మరికొందరు గూఢచారిణి అనికూడా అంటూఉంటారు. హార్డింజహాస్టల్ మేడమీద నిలబడి ఎవరో పాడుతున్నారు. నేను ఎస్ప్లనేడ్ ట్రాం దిగి, మా మేనమామ కొడుకు - హారాధన్‌ని కలుసుకుందామని హార్డింజ్ హాస్టల్‌వైపే నడుస్తున్నాను. అప్పటికింకా సంజె వడలేదు. ఎజరాహాస్పటల్ వెనుక చెట్లమీద గుంపుగా ఉన్న కాకులగోలకి అటుకేసి తిరిగి చూచేసరికి స్వర్ణేందు అటువైపు కాలిబాట మీదినుంచి పోతూఉండటం హఠాత్తుగా నాకంటపడింది. తల వంచుకుని ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు - తన చుట్టు ప్రక్కల యెవరూ లేనట్లు, తన సమస్యే తనకి తప్ప మిగిలిన యావత్తూ తనకి అనావశ్యకమన్నట్లు అసలు వాటికేసి తిరిగి అవి అంటూ ఉన్నాయని అసలు అంగీకరించటానికి కూడా తనకి తీరిక లేనట్లు - నడుస్తున్నాడు.

"స్వర్ణేందూ !"

హఠాత్తుగా ఆగిపోయాడు. కాని నన్ను చూడలేదు. విస్తుపోయి వెనక్కితిరిగిచూస్తూ కాసేపు అలాగేనుంచున్నాడు, కోల్‌టోలా వీధి కాలిబాటమీద. ఆ కాకులు కూసేవేళ

అతడి కళ్ళలోని విస్మితదృష్టి ఇప్పటికీ నా కళ్ళకి కట్టినట్లు కన్పిస్తోంది....కొంచెం ముందుకు వెళ్ళాను.

"ఓ నువ్వా ఘనశ్యాం?"

ఓ చిన్న చిరునవ్వు...తర్వాత కోల్‌టోలా కాలి బాటమీద తాను హఠాత్తుగా ప్రత్యక్షమైనందుకు లజ్జాపూర్వకమైన ఓ చిన్న సంజాయిషీ..."ఒక నౌకరీ ప్రయత్నంలో వచ్చానుభాయీ!" సిటీకాలేజీలో ఒక లెక్చరర్ పోష్టు ఖాళీగా ఉంది." అని కాసేపాగి "ఉహూఁ కాలేదులే నాకు. ఎవరో నిర్ణయించేశారట! అని, స్వర్ణేందు అనే ఓబికార యువకు డెవరో ఉద్యోగంకోసము హాస్యాస్పదంగా ఇలా పరుగులెత్తటాన్ని తాను దూరంగా నుంచుని చూసి ఆనందిస్తున్నట్లు - చిరునవ్వు లొలకపోస్తున్న చూపులతో అలా చూస్తూ ఉండి పోయాడు.

"నీ చేతిలో ఏమిటది?"

పత్రిక చుట్టిపెట్టి ఉన్న పొట్లం ఊడతీసేసరికి ఎర్రటి ఒరలోఉన్న కత్తి ఒకటి బయటపడింది.

నేను చాలా గాభరాపడ్డాను.

"కొన్నావా యేం?"

"ఉహూఁ. ఫర్నాండెజ్ రాతూ పుట్టినరోజు పండుగకి దీన్ని కానుకగా పంపాడు. ఇక్కడి మాఅడ్రస్‌కి వచ్చింది. తీసుకెడుతున్నాను."

"ఫర్నాండెజ్ ఎవరింకా?"

"నాన్న బెంగుళూరులో ఉన్నప్పుడతడు మా డ్రైవరు. ప్రతి సంవత్సరం రాతూకి ఏదో ఒకటి పంపుతూనే ఉంటాడు."

స్వర్ణేందు కళ్ళు రెండూ ఏవో స్వాప్నికదృశ్యాన్ని చూస్తున్నట్లున్నాయి - "అప్పుడు మేము చాలాచిన్నవాళ్ళం. అయినా అతడి ముఖం ఇప్పటికీ బాగా గుర్తుంది - పొడుగ్గా - మంచి వెడల్పుగా, నల్లగా ఉండేది. పార్సీ క్రిష్టియన్. రాతూ అంటే చాలా అపేక్ష. అతడు డ్రైవరుగా కుదిరిన ఏణ్ణర్థానికి రాతూ పుట్టింది. అంటే రాతూని పుట్టినప్పట్నించీ యెరిగి ఉన్నాడన్నమాట" అంటూ స్వర్ణేందు చిరునవ్వునవ్వి ఆగాడు.

ఆ కత్తిని ఒరలోంచిలాగి చూశాను. పైకి లాగగానే ధళధళలాడింది. స్వర్ణేందు ముఖం మాంచి పసనుగా ఆ కత్తి అంచుమీద చాలా వికృతంగా ప్రతిబింబించింది. మొగనిఉన్న గడియారం కేసి చూసి, "రైలుకింక ఎంతో టైంలేదు, వెడుతున్నా భాయీ!" అన్నాడు స్వర్ణేందు.

"మధుపురమేనా వెడుతున్నది?"

"ఊఁ,"

"జ్యోతిర్మయబాబు వచ్చాడా?"

"ఆ రోజున నువ్వు వెళ్ళిన కాస్సేపటికల్లా టాక్సీలో వచ్చాడు."

"మీనాన్న కెలాఉంది?"

"అలాగే ఉంది."

అని తల ఊగిస్తూ నవ్వి, వెళ్ళిపోయాడు స్వర్ణేందు.

  

అతడికి వరసకి బావగారైన నిఖిలచౌధురీతో నాకు కేవలంపరిచయం ఏర్పడటమే కాదు, సన్నిహితత్వంకూడా ఏర్ప

డిందని ఆ హాడావిడిలో స్వర్ణేందుతో చెప్పటం మరిచిపోయాను. అంత సన్నిహితత్వం ఏర్పడటానికి స్థూలమైన మూలకారణం ఒకటుంది. విపత్నీకుడైన నిఖిలచౌధురికి సహచరి అయిన చమేరీ అనే దాసీదాని వంట నేర్పుకు ముగ్ధుణయినాను. మాగోకుల్‌కి మాంసం వండటం చేతకాదని చెప్పటం కాదు. వాడు దాన్ని చాలా రుచివంతంగా చెయ్యాలని అతిశ్రద్ధగా ఆచితూచి వేసే మసాలా దినుసులతో తయారయ్యే ఆ పదార్థంవల్ల ఒక్క లివర్ చెడటమే కాదు; అది బొటన్రవేలెడు జఠరాగ్ని ఉన్న వాడి కూడా ఓ పట్టాన జీర్ణంకాదు. చక్కని అవయవసౌష్ఠవంకల ఆ చమేరీ వంటలోని విశిష్టత కేవలం మసాలాకి చెందింది మాత్రమే కాదు. అది ఆమె స్వవిశిష్టత! రుచి ఒక్కటే ప్రధానం కాని, అందులో వేసిన వస్తువులు ప్రధానం కావు. ఒక్క సంగతి తలచుకుంటే మాత్రం భలే ఆశ్చర్యంవేస్తూ ఉంటుంది. ఈ చమేరీ అనేదే లేకపోయినట్లయితే, నిఖిలచౌధురితో నాకేర్పడిన ముఖపరిచయం ఇంత ఆంతరంగికమైత్రిగా పరిణమించేదే కాదు; ఈ కథకి సంబంధించిన ఎన్నో నగ్నసత్యాలు నాకు తెలియకుండా కాలగర్భంలో కలిసిపోయేవికూడా...

ఆ రోజున ఉదయమే నాలుగు అడివిబాతుల్ని కొన్నాను. తిందామనే వాంఛతో కొన్నప్పుడు వాటికి మృత్యువనేది యెటూ అనివార్యమే! గోకులే కనుక వండితే వీటిమృత్యువు శోచనీయమవుతుందని చటుక్కునతోచింది. వాటికి సద్గతులు లభించుగాక అని సంకల్పించుకుని, వెంటనే వాటిని నిఖిల చౌధురిగారింటికి పంపించాను. హార్టింజ్‌హాస్టల్‌లో హారాధన్‌ని

కలుసుకుని, ఇంటికి వచ్చేసరికి నిఖిల చౌధురి దగ్గిర్నుంచి చీటీ వచ్చి ఉంది.

'ఘనశ్యాంబాబూ!

తమరు పంపినవి కేవలం అడవిబాతులు కావు. అసలైన జాతిబాతులు. కలకత్తా మహానగరంలో అదృష్టంకొద్దీ అప్పుడప్పుడు దైవికంగా వాటి దర్శనలాభం కలుగుతూ ఉంటుంది. మీ ఉదారతకి హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తూ, తమరు వెంటనే రావాలని, తమకోసం చమేలీ ఆత్రుతతో ఎదురు చూస్తోందనీ విన్నవిస్తున్నాను.

— నిఖిల చౌదరి.

కొంచెం రెక్కలు కదిలించి పైకి యెగిరితేనే కాని నెమలి ఈకల అందం స్పష్టంగా కనబడనట్లే, కొంచెం ఉత్తేజితుడయితేనే తప్ప నిఖిలచౌధురి నిజస్వరూపం బయట పడదు. ఆరోజున సాయంత్రం భోజనాత్పూర్వమే డాబామీద ఈజీచైర్‌లో కూర్చుని, స్వర్ణేందువిషయమై ఆలోచన రాగానే హఠాత్తుగా ఉత్తేజితుడైనా డతడు. నామీదికో కోర చూపు విసిరి, దంతపు డబ్బాలోంచి ఓచిటికె నస్యం తీసి, త● కొంచెం కిందికి వంచుకుని, దాన్ని నాసారంధ్రాల్లోకి దట్టించాడు...తర్వాత ముక్కుకి అటూ యిటూ అంటిన నస్యాన్ని తుడుచుకోకుండానే, కొంచెం ఆ వేగంతో "మీరేమీ ఎరుగరన్నమాట!" అన్నాడు.

నిఖిలబాబు ఉత్తేజితుడైనట్లు గ్రహించాను. ఎంచేతంటే నాకు తెలిసిన విషయాన్నయినా, తెలుసునని నేనేం క్లెయిమ్ చెయ్యబోలేదు. స్వర్ణేందుని గురించి ప్రారంభమైన ప్రసంగం

స్వర్ణేందునే అంటిపెట్టుకుని ఉండలేదు. రాత్రి చుట్టూ సుడి గుండాలు తిరగసాగాయి. వాటిలో ఓసుడిగుండం ద్వారా నేనూ నా విశ్వాసాన్ని వ్యక్తపరచాను. 'నల్లగా ఉంటే మాత్రం యేం, చూపులకి చక్కగానే ఉంటుంద'ని ఈ మాట విని నిఖిలబాబు మొదట్లో యేమీ అనలేదు. మళ్ళీ రెండో మాటు ఈమాట అనగానే నిఖిలబాబు పైనచెప్పినమాట అన్నాడు.

"చక్కనిదికాదూ?" అని నేను మళ్ళీ అన్నాను.

మళ్ళీ మరో చిటికె పొడుం పట్టి, ఒక్కసారి నాకేసి ఉరుముతూ చూసి, ఆ నస్యాన్ని మళ్ళీ నాసారంధ్రాల్లోకి దట్టించి, అటు యిటూ అంటుకున్న నస్యాన్ని దులుపుకుంటూ అస్ఫుట కంఠంతో 'దుస్సహం' అని కాబోలు అన్నాడు. ఆ తర్వాత నేనింకేదో అనటానికి ముందే స్పష్టమైన ఉచ్చారణతో;

"చెకోవ్ రాసిన డార్లింగ్ చదివారా?" అని అడిగాడు.

"చదివాను"

"అనటోల్ ఫ్రాన్స్‌రాసిన 'థేయ్' చదివారా?"

"చదివాను"

"రవీంద్రనాథుని 'చిత్రాంగద?"

"చదివాను."

"ఆలీపూర్ జంతు ప్రదర్శనశాలలో ఓ పెద్ద ఆడపులి ఉంది, చూశారా?"

"చూశాను."

"మైదానంలో ఒంటరిగా నుంచునుని అమావాస్య చీకటిని ఎప్పుడైనా పరిశీలించారా?"

"పరిశీలించాను."

"ధగధగలాడే ఖడ్గాన్ని చూశారా?"

"చూశాను."

"సూదంటురాయి ?"

"చూశాను."

"అయితే వీటినన్నిటినీ, మనస్సుని ఓ పెద్ద కటాహంగా చేసి, అందులో వేసి గట్టిగా కలిపేసేసి, బాగా మంటలొస్తున్న అగ్నిపర్వతంమీదికి దాని నెక్కించి మరగపెడుతున్నట్లు ఊహించుకోండి."

తర్వాత కాస్సేపాగి "ఊహిస్తున్నారా ?" అని అడిగాడు.

ప్రయత్నిస్తున్నాను."

"ప్రయత్నించండి – అదెలా వుంటుందో కన్పిస్తుంది. అది చిన్న చిన్న చమత్కారమైన మాటలతో వర్ణించతగిందికాదు."

తర్వాత మళ్ళీ కాస్సేపాగి, "భీభత్సంగా వుంది!" అనే మాట ఒకటుంది కాని, దాన్ని అలా అంటే ఏదో సూచన ప్రాయంగా చెప్పినట్లవుతుంది. అదీ రవంతగానే"...

తర్వాత ఏంమాట్లాడాలో నాకేం బోధపడలేదు. ఎంచేతంటే నిఖిలబాబుతో రాత్రికి ఏదోఘోరమైన ఘనిష్ఠసంబంధం ఏర్పడి వుండివుంటుందన్న సంగతి వెంటనే గ్రహించాను. కాని ఆ ఘనిష్ఠస్మృతి తరచతగిందో కాదో నిర్ణయించుకోలేక

పోయాను. కొంచెం సావధానతని అవలంబించి — "మీరు ఆత్మీయులు కనుక తప్పక బాగా ఎరిగి వుంటారు. కాని నా కా మహాభాగ్యం—"

"దుస్సహాం! మీరు మళ్ళీ తెలియకుండా మరొక పొరపాటుమాట అన్నారు. రాత్రితో ఘనిష్ఠత ఏర్పడట మనేది మహాభాగ్యంకాదు, దౌర్భాగ్యం. నా భార్య ఆమె మూలంగా ఆత్మహత్య చేసుకుంది. నేను డక్కా-మొక్కీలు తిని ఎలాగో బయటపడి బ్రతికిపోయాను."

ఇహ తర్వాత మాట్లాడక ఊరుకోవటంతప్ప గత్యం తరం లేకపోయింది నాకు. ఇద్దరం నోరు మెదల్పకుండానే కూర్చున్నాం. నాలుగు అడివిబాతులు మధ్యన వుండటంతో ఇంత యథార్థవిషయం ఒకటి బయటపడుతుందని నేను ఊహించలేకపోయాను. చాలాసేపు గడిచాక నిఖిలబాబు హఠాత్తుగా "కాని ఇప్పటికీ నే నామెని ప్రేమిస్తున్నాను. ప్రేమి స్తూనూ వున్నాను. అసహ్యించుకుంటూనూ ఉన్నాను. దుస్సహాం!" అన్నాడు.

అనేశాను. అర్థాత్తూ అనకుండా ఉండలేకపోయానన్న మాట :— "మీతో వారికి ఉన్న సంబంధాన్ని బట్టిచూస్తే — మీ రామెని సుఖువుగానే పెళ్ళిచేసుకోగలిగేవారనుకుంటాను!"

"రెండు ఇబ్బందులున్నాయి. పూర్ణేందుబాబు, పూర్ణేం దుబాబుభార్య, రాత్రి వీళ్ళు ఏదోవిధంగా పెళ్ళిచేసుకోవటమే పరమార్థమని భావించేజాతికి చెందినవారుకారు. కనీసం నేనలా అనుకుంటున్నాను — ఇహ రెండోదేమిటంటే నేనుకూడా అన్నీ

తెలిసి తెలిసి ఎవర్నో ప్రేమించిఉన్న యువతిని పెళ్ళిచేసుకునే టంత ఉదారుణ్ణికాను.”

నేను కొంచెం తటపటాయించి నవ్వుతూ – “కాని ప్రేమించింది మిమ్మల్నేగా!” అన్నాను.

నిఖిలబాబు మళ్ళీ మరోపట్టు పొడుం పీల్చాడు.

తర్వాత కాసేపాగి – “రాత్ర్యాకాశంలో అగణితమైన నక్షత్రాలు” అని. మళ్ళీ కాసేపాగి–“పగటిపూట ఆకాశంలో కూడా అంతులేనన్ని నక్షత్రాలుంటాయి. కాని కనపడవు” అన్నాడు. తర్వాత అస్ఫుటంగా ‘మస్నహం’అన్న మాటకూడా అని ఉంటాడు. కాని గందరగోళంలో విన్పించలేదు. అతి వేగంగాపోతున్న లారీ చప్పుడులో ఆ చివరిమాటలు అణగారి పోయాయి.

నిఖిలచౌధురీ ముఖతః విన్నదానితో – నేను ఒకప్పుడు చూసినదృశ్యాంతాలూకు స్మృతిని సమన్వయించి చూసుకు న్నాను. ఆనాడు చాటుగా ఉండి ఆమె యేడుపువిన్నాను. నిఖిలచౌధురీ వర్ణించిన అగణ్య నక్షత్రమయ రాత్రి సరసన, మేఘాక్రాంతమై వర్షిస్తున్న రాత్రి రూపాన్నిచూసి విస్మితు ణ్ణయినాను. ఈ యింట్లోనే అర్ధరాత్రివేళ నిశ్శబ్దాంధకారంలో ఈ ప్రక్కగదిలోనే చాటుగా యేడ్చిందామె. డాబామీద సగం తెరిచిఉన్న కిటికీ తలుపులచాటుని ఆశ్చర్యపోతూ నేను నిలబడివున్న సంగతి ఆమెకి తెలియదు. తెలిస్తే ఏంచేసేదా? అని అనుకుంటూ ఉంటానప్పుడప్పుడు. బహుశా నవ్వేదేమో! ఆమెకలకంఠంలోనుంచి వచ్చిననవ్వు ఈపిరికి చీకటిని చీల్చుకుని

మెరుపులాగా తళుక్కుమనేదేమో! కాని నేను చూడలేదు. విన్నాను. జుట్టంతా రేగిపోయి పక్కమీద బోర్లగా పడుకుని కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చిందామె. నాకప్పటి సంగతులు తెలియవు – ఇప్పటికి మాత్రం ఏమంత తెలుసు నిజానికి! – అం చేత కొంచెం సంకోచిస్తూ "అవనీశుడు, జ్యోతిర్మయుడూ అప్ప టికే ఉన్నారా?" అని అడిగాను.

"లేదు, ఏరి పేర్లు అప్పుడు వినలేదు – విన్న జ్ఞాపకం లేదు. అప్పుడున్నదల్లా ఖగేన్, సౌమ్యేన్, తపేశ్, జమీరా్ అనే ఓ ముస్లిం యువకుడూ, హరుబాబు అనే ఓ డిప్యూటీ కలె క్టరు, ఈ నిఖిలచౌధురీ – అంటే నాకు తెలసిం దింతవరకే. ఇంకా చాలామంది ఉండీ ఉండవచ్చు," అని కాసేపాగి, "అప్పుడు మగవాళ్ళంతా రోజూ వాళ్ళఇంట్లో సమావేశ మవుతూ ఉండేవాళ్ళు" అన్నాడు.

"రోజూనా?"

"ఆ:.....ఎప్పుడడిగితే అప్పుడు చక్కని టీ ఇస్తూండే వాళ్ళు వారు; అక్కడ చేరితే డబ్బుపెట్టి పేకాట ఆడవచ్చు, అంతేకాకుండా ఆ ఆటలో రాత్రిలాంటి అందమైన అమ్మాయి కూడా పాల్గొంటుంది. పైగా ఆ ఇంటి ఇల్లాలు, సంసారాన్ని త్యజించి గురుదేవుని వెంట తీర్థయాత్రలికి తిరుగుతూ ఉన్నది కదా! ఇహ ఆ యింటి యజమానికి నీతి – అవినీతి, పాపం – పుణ్యం మొదలైనవాటికి సంబంధించిఉన్న ఆదర్శాల లాంటివి బోల్షివిక్ రష్యాలోకూడా సాగుతాయో సాగవో అనే సందే హం కద్దు!– మరి అలాంటి ఇంట్లో చేరక మరెక్కడ చేరుతారు మగవాళ్ళు?"

"అప్పుడు మీరెక్కడ ఉండేవారు?"

"ఈ కలకత్తాలోనే. అప్పుడు పూర్ణేందుబాబు ఆర్నెల్లు సెలవు తీసుకుని ఇక్కడికి వచ్చిఉన్నాడు."

"అప్పటికింకా వారికి పక్షవాతం రాలేదా?"

"అరె! లేదు లేదు. అప్పటికింకా అతడు రాకెట్‌లాగానే తిరుగుతూ ఉండేవాడు. మూడేళ్ళ క్రిందటిమాట కదా ఇది!"

నిఖిలచౌధురి మరోపట్టు నశ్యం పీల్చాడు.

నే నప్పటికీ ఇంకా సిగరెట్ కాల్చలేదు. పరధ్యానంగా మీసం కాస్తమెలిపెడుతూ కూర్చున్నాను.

"దుస్సహం!"

నిఖిలబాబు లేచి పచార్లు చెయ్యటం మొదలెట్టాడు.

స్వర్ణేందు కూడా మీ సమావేశంలో పాల్గొంటూ వుండేవాడా?"

"ఉహూఁ. అప్పుడతడు లక్నోలో ఎమ్. ఏ. చదువుతూ ఉండేవాడు!"

అతడు మాతో స్కాటిష్‌లో చదువుతూ ఉండేవాడే!

"తర్వాత లక్నో వెళ్ళాడులే."

స్వర్ణేందు కొన్నాళ్ళు మాతో కలిసి చదువుకున్నాడని చెప్పటంలో వున్న ఆత్మీయత ఈ ఒక్క మాటతో కాస్త కుంగిపోయినట్లయింది. నేను ఆలోచిస్తున్నాను—

ఆరడుగుల పొడవుగల నిఖిలచౌదరీ హఠాత్తుగా నా రెండు బుజాలమీదా 'ఆగు' అన్నట్లు చేతులువేసి "సావధానంగా వుండు" అన్నాడు.

ఆ స్థితిలో అందరూ ఏంచేస్తారో - మాటల సహా యంతో చెప్పాలంటే - ఆత్మగోపనం - అదే నేనూ చేసుకో సాగాను. కాని అంత అవసరంలేకపోయింది. ఇంతలో చమేలీ వచ్చి భోజనం సిద్ధంగా వుందని చెప్పింది.

ఇద్దరం క్రిందికిదిగి వెళ్ళాం.

ఇంత రుచిగల 'డాక్ రోస్ట్' నే నిదివరకెన్నడూ తిన లేదు. కాని నిఖిలబాబు మాత్రం పూర్తిగా తృప్తిపడినట్లు కన్పడలేదు. ఏదో రుసరుసలాడసాగాడు. చిన్న చిన్న పొరపాట్లు వెతికి పట్టుకుని చమేలీని గద్దించసాగాడు. ఆయన ఆప్యాయతను వెల్లడించే తీరు అదేనని తర్వాత తెలుసుకున్నాను. అతడికి యీ నల్లటి దాసీఅంటే అతి అపేక్ష. కనుకనే ప్రతి చిన్న కారణానికీ ఆమెని అలా కూకలేస్తూ ఉంటాడు. అంతఃసలిల అయిన ఫల్గునినది లాగానే నిఖిలచౌధురీకూడా అప్పుడప్పుడు బయటపడకుండా వుండలేదన్న సంగతి చమేలీ గ్రహించింది. నిఖిలబాబు ఎప్పుడు కూకలేసినా ఆమె అతడి యెదుట అపరాధినిలాగా ముఖం చిన్నబుచ్చుకునే నిలబడుతుంది; కాని ముఖం మాటుకి త్రిప్పుకుని మాత్రం నవ్వుకుంటూ వుంటుంది.

డాబామీద మే మేదో కొంప మునిగిపోయే పనిలో వుండి, మధ్యలో క్రిందికిదిగి వచ్చినట్లు, భోజనం కాగానే మళ్ళీ యంత్రం త్రిప్పితే పైకి వెళ్ళినట్లు - మళ్ళీ డాబామీదికి వెళ్ళి కూర్చున్నాం, చాలాసేపు ఇద్దరం ఒకే విషయాన్ని ఆలోచిస్తున్నట్లు మెదలకుండా కూర్చున్నాం. ఆశ్చర్యం ఏమిటంటే ఆ సంగతి ఇద్దరం గ్రహించాం. 'పెళ్ళి ఏదోవిధంగా పెళ్ళి చేసుకోవటమే పరమార్థమని భావించే జాతికి చెందిన

వాళ్ళు కారు' అని నిఖిలబాబు అన్నమాటే నా చెవుల్లో వినిపించసాగింది మాటిమాటికి. ఆ మాటకి ఎన్ని అర్థాలయినా తీయవచ్చు. నిఖిలబాబు ఏ అర్థంలో యీ మాట అని వుంటాడా అని నాకు కుతూహలం కలిగింది. ఏం చెప్పగలం ? ఆ కుతూహలాన్ని నిర్లిప్తునిలాగా మాటల్లో బయటపెట్టాను.

"ఆడపిల్లలు కాస్త పెద్దవాళ్ళయాక ఈరోజుల్లో ఎవర్ని పడితే వాళ్ళని చేసుకోవాడానికి ఇష్టపడను." అంటూ, "వాళ్ళయిష్టాయిష్టాలనేవికూడా ఉంటాయికదా" అని స్వర్ణేందు అన్నమాటనే మళ్ళీ నేనూ అన్నాను.

"పెద్ద అంటే? ఎన్నేళ్ళు వచ్చిన వాళ్ళు పెద్దవాళ్ళని మీ ఉద్దేశం?"

ఒక నిఖిలచౌధురియే కాదు. ఇలాంటివాళ్ళను చాలా మందిని చూశాను. అసలు విషయం తెలిసినా తెలియనట్లు నటించాలనుకున్నప్పుడు ఇలాంటి ప్రశ్నలే వేస్తూ ఉంటారు. ప్రపంచంలో ప్రతీదానికీ వ్యతిక్రమమనేది ఉంది – అనే సత్యాన్ని అవకాశంగా తీసుకుని వారు ఎదుటివార్ని నోరెత్తకుండా చెయ్యటానికి ప్రయాసపడుతూంటారు. అదే జరిగింది.

"పదహారేళ్ళు పదిహేడేళ్ళనస్తే–అనుకోండి" అన్నాను నేను. వేటకాడిమీద దుముకబోయే మృగం కళ్ళలో కన్పించే దృష్టే నిఖిలచౌధురీ కళ్ళలోకూడా కన్పించింది నాకు. ఒక పట్టు పొడుంపట్టి "అంతకుముందే మీ రాత్రి తన స్వాతంత్ర్యపు పంజాని ఓరోజున అందరిమీదికీ విసిరింది. అప్పటికి ఆమె వయస్సు పదమూడో, పధ్నాలుగో" అన్నాడు.

ఆ పట్టు పీల్చాడు.

"ఏం చేసింది?"

"వరుడికి చెవి ఏదో కాస్త వంకరగా ఉన్నదని పెళ్ళి పీటలమీదనుంచి లేచిపోయింది"

"చెవా?"

"ఆఁ, చెవే. చెవి తెగిపోలేదు. కాస్త మెలితిరిగినట్లు వంకరేదో ఉంది."

"ఎలా ఉంది."

"పూర్ణేందుబాబు ప్రధానం చేసుకోవటానికి వెళ్ళినప్పుడు అతడు తలగుడ్డ పెట్టుకుని ఉండటం మూలంగా కన్పించలేదది."

"అప్పుడు తలగుడ్డపెట్టుకున్నాడా వరుడు?"

"ఆఁ వరుడు పశ్చిమదేశీయుడు. అంచేత అప్పుడందరికీ అది అసహజంగా కన్పించలేదు అసలుసంగతి పెళ్ళిముందు భాషికం కట్టించబోయేసమయంలో బయటపడింది"

నిఖిలబాబు మెదలకుండా ఊరుకున్నాడు.

నేను అనబోయాను – "అలాంటి దగాకోరుని పెళ్ళి చేసుకోకపోవటమే –"

"దుస్సహం! నేను చెప్పినదాన్ని సరిగ్గా గ్రహించటం లేదు. నేను చెప్పతలచింది ఏమిటంటే–మరొక అమ్మాయి ఎవరైనా అయినట్లయితే ఆవయసులో అలా చేసిఉండేదికాదని."

నేను మన శ్చక్షువుతో ఆ దృశ్యాన్ని చూడగలిగాను. భాషికం కడుతున్నసమయంలో ఒక్క క్షణం వరుడిముఖంకేసి చూసి తర్వాత లేచి పోయిఉంటుం దామె...

పూర్ణేందుబాబు ఆ ఒక్కసారే ఆమెకి వివాహప్రయత్నంచేశాడు. మళ్ళీ ఎప్పుడూ తలపెట్టలేదు. నిఖిలబాబు మళ్ళీ కాసేపాగి, "ఇంక ఆమెతల్లికికూడా సాధ్యంకాలేదు" అన్నాడు

"ఆ పెళ్ళిచెయ్యటం తల్లికేమయినా ఇష్టంలేదా?"

నిఖిలబాబుకీ ప్రశ్నకి సరైనసమాధానం తెలుసునో లేదో, తెలిసినా చెప్పలేదో నాకుమాత్రం తెలియదు. సరిగ్గా ఇంతలో గడియారం పన్నెండుకొట్టింది ఇద్దరం ఇహ ఆ ప్రసంగాన్ని విరమించక తప్పిందికాదు. "రేపు ప్రొద్దున కోర్టుఉంది మళ్ళీ నాకు" అన్నాడు నిఖిలబాబు

ప్రొద్దున్నే నేనూ ఓ రోగికి వెళ్ళి ఇంజక్షన్ ఇవ్వాల్సిన పనిఉంది. కనుక లేవాల్సివచ్చింది. కాని నాకు బాగా జ్ఞాపకం. చాలా అయిష్టంతోనే లేచివచ్చా నారోజున. నిఖిలబాబుని అంతసేపు ఒంటరిగా పట్టుకునే అవకాశం ఇంక ఒక్కసారే లభించింది. ఆరోజునా ఇదే ప్రసంగం. కాని ఆ పరిస్థితులు వేరు....

## 3

రాత్రిని నేను పూర్తిగా చూడలేదని మొదట్లోనే చెప్పాను. కొంత చూశాను; కొంత కొంత విన్నాను చాలావరకు ఊహించాను. అందర్నీ గురించిన నా పరిజ్ఞానమూ ఈ మూడింటి యోగవియోగ ఫలితంమీదే ఆధారపడి ఉంటుందనుకోండి. అయినా రాత్రి విషయంలో ఈ సంగతి ఇంకొంచెం బాగా జ్ఞాపకం ఉంచుకోవటం అవసరం. ఎంచేతంటే ఈ సందర్భంలో యోగవియోగ ఫలితాన్ని పురస్కరించుకుని నామనస్సులో స్థిరపడబోయే అభిప్రాయస్వరూపం సమాజానికి, స్వార్థానికీ సంబంధించినదైఉంటుంది. కాని—వద్దు; అదలా

ఉంచుదాం. వాక్యాల సుడిగుండంలోపడేసి, మీ సహజబుద్ధిని తికమకపెట్టటం ఇష్టంలేదు నాకు. నేను సంఘటనలన్నిటినీ యథాతథంగా వర్ణిస్తాను. వాటిని మీరు మీచిత్తం వచ్చినట్లు స్వేచ్ఛగా సిద్ధాంతీకరించుకోండి. కేవలం యథార్థంమీది ప్రీతికొద్దీ, ఈ సంఘటనలకి వరుసక్రమమనేది లేదని, మధ్య మధ్య చాలా కంతలున్నాయనీ మాత్రం చెపుతున్నాను. యథాతథశబ్దానికూడా విజ్ఞాన సమ్మతమయిన అర్థాన్నే చెప్పకోటానికి వీల్లేదు. స్త్రీలనిగురించి పురుషులుచేసే వర్ణన – ఎందుకొచ్చినమాట – ఎన్నడైనా యథాతథ వర్ణన అంటే చెల్లుతుందా !

నేను రాత్రి తాలూకు సంపూర్ణ వికసిత రూపాన్ని చూశాననికాదు; కాని ఊహించుకోటంలో నష్టం ఏముంది? ముఖ్యంగా ఆ ఊహకి అతి స్వాభావికమైన ఆధారంకూడా ఒకటి ఉంటున్నప్పుడు? అచ్చమైన బెంగాలీ అయిన ధరణీబాబుకూడా "వాళ్ళ ఆను పానులు తెలుసుకోలేరు బాబూ ! వారు అచ్చమైన బాంగ్లాజాతికి చెందినవారుకారు. మరోజాతికి దేనికో చెందినవారు" అని ఊహించగా లేనిది, ఇహ నేను ఊహిస్తేమాత్రం వచ్చిన నష్టమేముంది! రాత్రి జీవితంలోకూడా స్వాభావిక నియమాన్ననుసరించి, జీవితకుసుమాలు విరగపూసినరోజు అనేది ఒకటి ఉండి, ఉంటుంది. ఆ పుష్పసౌరభం కేవలం తుమ్మెదల దండునే కాకుండా రాత్రినికూడా మత్తెక్కించి ఉంటుంది. ఆ మత్తెక్కిన మోహంలో తుమ్మెదలనేకాకుండా వసంతుణ్ణికూడా తన

పుష్పిత కారాగారంలో బంధీకృతుణ్ణి చెయ్యాలని భావించి ఉంటుంది.

స్వర్ణేందు ఆమె తాలూకు ఈ సంపూర్ణ వికసిత రూపాన్ని చూసి ఉంటాడు. ఊరికే చూసిఉండటమే కాదు. వికాసం అంటూ ఎరుగని తన వ్యవధి జీవితంతో సమన్వయించుకునికూడా ఉంటాడని నా విశ్వాసం. అలాకానట్లయితే- బహుశా వాళ్ళ అమ్మసంగతి - ఊహూం, ఆసంగతేమిటో ఇప్పటికీ సరిగ్గా బోధపడలేదు నాకు. కాని స్వర్ణేందు తాలూకు ఆ ఆదర్శవాదియైన స్వర్ణేందు తాలూకు - నిష్పాపముఖచ్ఛవిని మాత్రం ఎంతప్రయత్నించినా మరిచిపోలేకుండా ఉన్నాను. అతిశాంతంగా 'నే నే చేశాను' అని మాత్రం చెప్పాడతడు. అతడి కంఠస్వరంలో ఓ ఉత్తేజనకాని, ఓ వీరత్వంకాని, ఓ ఉద్రేకంకాని ఏమీ లేవు. అంచేతనే సంపూర్ణ వికసితమైన రాత్రి జీవితంతో తన వ్యగ్రజీవితాన్ని పోల్చి చూసుకుని ఉంటాడు అనిపిస్తోందినాకు. ఇంకా — కాని ఇదంతా నా ఊహే - జరిగిన సంఘటన వినండి. . .

నిఖిలబాబుతో రాత్రికి సంబంధించిన ప్రసంగం వచ్చిన తర్వాత ఇంచుమించు ఆర్నెల్లకి జరిగిందీసంఘటన. ఈఆర్నెల్లూ నాకు వాళ్ళసంగతులేవీ తెలియనూలేదు-నేను పట్టించుకోనూ లేదు. ఆరోజున రాత్రినిఖిలబాబు 'సావధానంగా ఉండండి' అన్నమాటనే పట్టుకుని వీళ్ళవిషయంలో నేను ఉదాసీనుణ్ణిగా ఉన్నాననికాదు; ధరణీబాబు అభిప్రాయం విన్నాకకూడా నామనస్సులో జుగుప్సఅనేది కలగలేదు. రాత్రి విషయంలో నా ఔత్సుక్యం వీసమైనా తగ్గలేదు సరికదా మరింత ఎక్కు-

వమౌంది. అయినా నేను ప్రయత్నించి వారిని గురించి ఏమీ తెలుసుకోలేను - అదిబహుశా ఎవరి విషయంలోనూ ప్రయత్నించి తెలుసుకోక పోవటమనే నాలో జీర్ణించిన స్వాభావిక ధర్మ ప్రభావమై ఉండవచ్చు. కళ్ళ పడిందేదో చూస్తాను. చెవుల పడిందేదో వింటాను. ఇప్పుడు మధ్యమధ్య నాకనిపిస్తూ ఉంటుంది - ఈ ఆర్నెల్ల సంగతులూ నేను తెలుసుకుని ఉన్నట్లయితే-కనీసం ఉత్తర ప్రత్యుత్తరాలైనా వ్రాసుకుంటూ వున్నట్లయితే పత్రికలలో అంత బీభత్సంగా వెలువడినగాథని ఖండించి ఉండేవాణ్ణికదా అని - ఈ కథని ఊహించుకోవటం మూలాన కనిపెట్ట గలిగిన సత్యం. ప్రత్యక్షదర్శన బలిమిని పొందితే - ఇలా అనటం బహుశా సరిగ్గా చెప్పినట్లు కాదేమో - ప్రత్యక్ష దర్శన తీవ్రత ఎలాంటిదంటే - దాని తాకిడికి సూక్ష్మసత్యాలు చాలా మాత్రమారిపోతూంటాయి. ఊహ అనే సూక్ష్మ జాలానికే సూక్ష్మ సత్యాలు పట్టుపడతాయి. అంతా ప్రత్యక్షంగా చూసినట్లయితే ఈ కథని వ్రాయాలనే ప్రవృత్తే ఉండేది కాదేమో నాకు !

ఆ రోజున సాయంత్రం ఏడుగంటలకి డిస్పెన్సరీనుంచి బయలుదేరాను. అనేక కారణాలమూలంగా మనస్సు బాగా లేదు ఏడురోజు లీమధ్య ఇద్దరు రోగులు చనిపోయారు. మరో ఇద్దరు చావటానికి సిద్ధంగా ఉన్నారు. అతి ఐశ్వర్యవంతుడైన ఓ ఆబ్కారీ కంట్రాక్టరింట్లో ఇద్దరికి ప్రమాదకరమైన బాసిలరీ డిసెంట్రీ, పట్టుకుంది. నేను గుమ్మంలో అడుగుపెట్టిన కాస్సేపటికే ఇద్దరూ గుటుక్కుమన్నారు. దాన్ని బాసిలరీ డిసెంట్రీ ప్రమాదఫలితం అని అనుకోరు. ఆ అపఖ్యాతి అచ్చగా నాకే

అంటుకడతాను. ఘోష్‌గారింట్లో టైఫాయిడ్ వచ్చినవ్యక్తికి ప్రొద్దున పథ్యం పెట్టించాను. సాయంకాలాని కల్లా మళ్ళీ జ్వరం వచ్చిందని తెలిసింది. ప్రొద్దువచ్చిన పెళ్ళిశుభలేఖలన్నీ జేబులో పెట్టుకున్నాను. మళ్ళీ వాటిమాటే జ్ఞాపకం లేకు ఇంటికివచ్చి స్టెతస్కోప్ బయటికి తీస్తుండగా ఉత్తరాలన్నీ బయటపడ్డాయి. మహాచికాకు వేసుకొచ్చింది. వెళ్ళక గత్యంతరంలేదు. ఊరికే వెళ్ళితే చాలదు. ఏదో ఒక కానుక కొని పట్టుకెళ్ళాలి. ఎగగొట్టేందు కుపాయం లేదు ధనవంతుడు, జమీందారు అయిన రాయ్‌గారు నన్ను బాగా అభిమానించే వారిలో ఒకరు. వారి ఏకైక పుత్రిక వివాహసందర్భంలో నేను అసలు నడుంబిగించి వడ్డనకికూడా దిగటం భావ్యం. కనీసం ఓ అయిదురూపాయల్లో వచ్చేది స్వదేశీదో, విదేశీదో, జపాన్‌దో, జర్మనీదో ఓ విలాసవస్తువుకొని, పెద్దమనిషితరహాగా పెదవులమీద చిరునవ్వు తెచ్చిపెట్టుకుని వెళ్ళి ఇచ్చి ఆత్మీయత నయినా నటించకతప్పదు. నటించటం పెద్ద కష్టమేమీకాదు. ఎలాంటివస్తువు కొనటమా అనేదే గడ్డుసమస్య. ఎంచేతంటే మరి మనం కొన్నవస్తువుకూడా మనలాగా నటించలేదుగా! పూలసజ్జ, టాయ్‌లెట్-సెట్-టీ-సెట్, నిట్టింగ్-సెట్, రైటింగ్-సెట్, రకరకాల సెట్లూ జ్ఞాపకం వచ్చాయి. కాని ఒక్కటీ మనస్సుకు సమాధానంగా లేదు. ఇహ చీరసంగతి ఆలోచించటమే వెర్రితనం. అయిదురూపాయలుఖరీదుగల చీరె రాయ్‌గారి కుమార్తె ఒకవేళ ఎప్పుడైనా కట్టుకుంటే కట్టుకోవచ్చు కాని, దాన్ని కానుకగా ఇవ్వబోతే అది అక్కడున్నవారి ఎవరి దృష్టినీ ఆకర్షించదు. అసలు కానుక లివ్వట

మనేది అందరిదృష్టుల్నీ ఆకర్షించటానికేగా! అలాంటి అత్యాకర్షణీయమైన వస్తువు అయిదురూపాయిలకి రావటం అసంభవమని తోచింది. మనస్సు మరీ వికలమయింది. దుస్తులు విడిచి స్నానంచేశాను. స్నానంచేసి ఓ కప్పు టీ తాగేసరికి మనస్సు కాస్త తేరుకుంది. దులాల్ సాధుని పోయి పట్టుకుంటే అతడేదో ఒకటి అయిదురూపాయల్లో సరిపెట్టే ఇవ్వగలడని తోచింది. అయిదురూపాయల నోటు మాత్రమే జేబులో వేసుకుని బయలుదేరుతుండగా గోకుల్ దారి కడ్డంగా వచ్చాడు.

"మీ కివాళ రాయిగారింట్లో విందుభోజనానికి పిలుపు వచ్చిందిగా!"

"అక్కడికే వెడుతున్నది!"

"అయితే ఈ దుస్తులు మార్చుకోండి. ఇలాంటిమాసిన దుస్తులేసుకుని విందుకెడతారా ఎవరైనా?"

తర్కించి లాభంలేదని తెలుసు.

"అయితే అవేవో చప్పున తెచ్చిఇయ్యిమరి!" అన్నాను.

చలువచేసిన గ్లాస్కో పంచె, సిల్కులాల్చీ, ప్రత్యేకంగా పురమాయించికుట్టించుకున్న నల్లటి మఖమల్ బూట్లు, వెండిపన్ను వేసిన హాండ్‌స్టిక్కూ - తీసుకొచ్చి ఇచ్చాడు గోకుల్. బీరువా తెరచి అత్తరు తెచ్చి జేబురుమాలకి పూయసాగాడు. ప్రపంచంలో ఇంతమంది మనస్సుల్ని నొప్పించకుండా ప్రవర్తిస్తున్నప్పుడు - వాస్తవానికి సామాజిక జీవితమంటేనే పదుగురి మనసుల్ని నొప్పించకుండా ప్రవర్తించటం - ఇహ గోకుల్ మనస్సుని మాత్రం ఎందుకు నొప్పించాలి. వాడికి నేనేమీ అభ్యంతరం చెప్పలేదు.

"రాత్రి బాగా ప్రొద్దుపోయేదాకా ఉండకండి"

"అలాగే"

రాత్రిని కలుసుకోవటం సంభవిస్తుందని అప్పుడు నాకు మాత్రం ఏం తెలుసు!

నేను ఇంట్లోంచి బయలుదేరి సరాసరి శ్రీ దులాల్ చంద్ సాధూ స్టోర్సుకి వెళ్ళాను. ఎన్నో కారణాలవల్ల దులాల్ సాధూ అసాధుతకి సంబంధించిన ఉదాహరణలెన్ని ఉన్నా, నేను సాధారణంగా అన్నివస్తువులూ అతడి స్టోర్సులోనే కొంటూ ఉంటాను. చూపులనేవి నన్ను సులభంగా ఆకర్షిస్తాయి అని మొదట్లోనే చెప్పానుగా! దులాల్ సాధూ కళ్ళకేసి చూడగానే అతడి వైపుకి ఆకర్షితుణ్ణయినాను. మెల్లకళ్ళు అతడివి దులాల్ సాధూ బజారుకడ్డంగా నిలబడివున్న బసవన్నకేసి చూస్తున్నాడని మనకి తోచినప్పుడతడు మనవైపే చూస్తుంటాడు. అతడి కళ్ళలో కోపం, అతడి మాటల్లో దూషణ – చూసి మీరు విసుక్కుంటారనుకోండి, అప్పుడతడు 'క్షమించండి మిమ్మల్నికాదు' అని అనగానే వెనక్కితిరిగిచూస్తే – వెళ్ళిపోతున్న బిచ్చగాడు కనపడతాడు మీకు–అప్పుడు మీ మనస్సు కొంచెం కుదుటపడుతుంది. అద్భుతమైన అతడి మెల్లకళ్ళే ముందుగా నన్నాకర్షించాయి. అతడి పరిచయం కలిగాక మరింత ఆకృష్టుణ్ణయాను. అతిఅమాయకుడు. కంఠం కత్తిరించుకుపోతున్నా అమాయకుడుగానే ఉంటాడు. ప్రపంచంలో కంఠం అనేకమందికి కత్తిరించుకుపోవచ్చు కాని అందరిలో అప్పుడుకూడా అమాయకులు ఎంతమంది ఉండగలరు! అదంతా అతడి నటనకాదు. అతడిలోని ఒక విశిష్టగుణం అని నావిశ్వా

సం. మీాదు 'పరాయివాళ్ళేటండీ!' అనేది ముఖప్రీతికనే మాట కాదు. దాన్ని ఆచరణలో పెట్టి చూపించగల తాహతు ఉన్నవాడు. కేవలం నోటిమాటలతో యెవరూ మోసపోరు, రవంత ఆప్యాయత ఉన్నట్లుకూడా వ్యక్తంచెయ్యాలి మరి! మూాడో దేమిటంటే అప్పుఇస్తాడు. అందరికీ ఇవ్వడు, మను షుల్ని కనిపెట్టి మరీ ఇస్తాడు. దులాల్ సాధులోఉన్న ఆశ్చర్యకర మైన శక్తుల్లో ఇది ఒకటి. ఆ మెల్లకంటితో ఒక్కసారి చూడ గానే, ఎదుటివా డెలాంటివాడైందీ, అతడి కప్పుఇస్తే మళ్ళీ వచ్చేదీ రానిదీ ఇట్టే కనిపెట్టగలడు.

నేను దులాల్ సాధు దుకాణంలోకి అడుగుపెట్టేసరి కతడు పాపం చాలా హడావిడిగాఉన్నాడు. రంగు రంగుల చీరెలు కట్టుకున్న 'కాలేజీగరల్స్' ఓగుంపు అతణ్ని చుట్టేసి ఉన్నారు. దులాల్ ఎప్పుడెవరికేసి చూస్తున్నాడో తెలుసుకో వటం దేవుడితరంకాదు. అయినా ఆ ఎర్రగా పొడుగ్గా శలాక లాగాఉన్న అమ్మాయి లోపల్లోపల మురిసిపోతూ, ముఖంలో మాత్రం చిరాకును వ్యక్తపరుస్తున్న సమయంలో దులాల్ చూస్తున్నది ఆమెవైపుకాదు, అప్పు డతడి దృష్టి బహుశా ఆ యెడంవైపున ఉన్న నల్లటమ్మాయిమీాద ఉండి ఉంటుంది. ఆ నల్లటిఅమ్మాయికూడా కాస్త లోపల్లోపల కంగారుపడుతు న్నట్లు కన్పించగానే అప్పుడతడి దృష్టి నామీాదకొచ్చిపడింది—

"రండి డాక్టరుగారూ, రండి, రండి."

"నాకు కూర్చునేందుకు లేదు కాని, అయిదు రూపా యల్లో వచ్చేది, ఏదైనా పెండ్లికానుకగా ఇవ్వటాని కుపయోా గించేదిఉంటే చూసి ఇయ్యి."

"ఒక్క నిమిషం...ఇప్పుడే ఇస్తాను... ఒరేయ్! డాక్టరు గారికి డ్రింక్ తెచ్చి ఇవ్వరా."

ఒక్క నిమిషంకంటె ఎక్కువసేపే కూర్చోవాల్సివచ్చిందని చెప్పటం అనవసరం... అలాగే కూచుని ఆ కాలేజీ అమ్మాయిలకేసి చూడసాగాను ముగ్ధణ్ణి కాలేదు. క్షుబ్ధుణ్ణయినాను. ఆ షాపులో ప్రలోభపెట్టే రకరకాల వస్తువులకేసి చూస్తున్నప్పుడు వారి కళ్ళలో కన్పించిన లుబ్ధత్వాన్ని నేనొక్కనాటికి మరిచిపోలేదు. కళ్ళతోనే వాటిని తినేస్తున్నారా అనిపించింది. నా సర్వస్వమూ వెచ్చించి, వాటినన్నిటినీ కొనేసి వాళ్ళకిద్దామూ అనికూడా అనిపించిందొకసారి. ఆ మెల్లకంటి దులాల్ సాధు యెదుట వ్యక్తమవుతున్న వారి లుబ్ధత నా ఆత్మగౌరవానికేదో భంగికరంగా కన్పించసాగింది. కాని ఇంతాచేస్తే నిజానికి నా సర్వస్వంమాత్రం యెంత? ఎంతకొల్లగా ఉన్నా వాళ్ళని తృప్తి పరచగలగటం మాత్రం కల్ల! ఆజ్యంపోసి అగ్నినెవరు తృప్తిపరచగలరు? గీసిగీసి బేరమాడి - ఈ విషయంలో వాళ్లు నాకంటె ఎన్నోరెట్లు నయంఅనికూడా అప్పుడే గ్రహించాను - ఏదో ఒక్క చీరెమాత్రం కొనుక్కుని వెళ్ళిపోయారు వాళ్ళు. చీరెకావల్సింది ఒక్కరికే. మిగతావాళ్ళలో కొందరు నాణ్యం చెయ్యటానికి, కొందరు బేరమాడిపెట్టటానికీ వచ్చారు.

ఇహ మీ కేంకావాలంటారో చెప్పండి డాక్టరుగారూ! ఒరేయ్ జగ్గూ! ఫాన్ వెయ్యరా డాక్టరుగారికి."

"అయిదురూపాయల్లో వచ్చేదేదైనాసరే. అందంగా ఉండాలి. పెళ్ళికానుకగా ఇవ్వటానికి"

దులాల్ హడావిడిగా "రాయ్‌గారింట్లో పెళ్ళికి అను కుంటాను !" అన్నాడు.

"అవును"

ఎదురుగా ఉన్న గణేశ్ కేసి చూస్తూ "ఒరేయ్ చండీ ! పైనుంచి - "నికెల్ ఎలక్ట్రోప్లేట్ ఐస్‌క్రీంసెట్" దింపి తీసుకు రారా. జాగ్రత్తగా తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

కాసేపట్లో చండీ 'నికెల్ ఎలక్ట్రోప్లేటెడ్ ఐస్‌క్రీంసెట్' తీసుకువచ్చాడు. దులాల్ దాన్ని ఏభాగానికది విడతీసి చూపించసాగాడు.

"ఇది అయిదురూపాయలా?"

"వెలకాస్త యెక్కువే అనుకోండి. కాని రాయ్‌గారింట్లో. మీచేతిమీదుగా ఇచ్చే కానుక, మాషాపులోనుంచి వెడుతున్నప్పుడు కేవలం వెలమీదే దృష్టిపెట్టుకుని ఉంటే సాగదు మాకు."

చీరె-బ్లౌజుతొడిగి అక్కడపెట్టివున్న డమ్మీకేసి చూస్తూ దులాల్ ముసిముసి నవ్వొకటినవ్వి నిజంగా వర్ణింప నలవికాకుండా వున్నదన్న భావాన్ని వ్యక్తంచేశాడు. అప్పటికి ఆఖరి ప్రయత్నంగా "నా దగ్గిర అయిదురూపాయలకంటె ఎక్కువ లేదేమరి !" అన్నాను.

"డబ్బుదేముందండి? మీ యిష్టంవచ్చినప్పుడు ఇద్దురుగాని, లేదూ, మీరివ్వకపోయినా ఇష్టమేనాకు. కాని రాయ్‌గారింటికి మీ చేతిమీదుగా నా కొట్లోంచి నాలుగయిదు రూపాయలు ఖరీదుచేసే జపాన్‌సరుకు మాత్రం పంపలేను నేను."

అంటూ అతడు దానికేసి దీనంగా చూస్తూంటే నే నతడిమాట త్రోసిపుచ్చలేకపోయాను.

ఆ ఐస్‌క్రీమ్‌సెట్‌ని అందరూ ప్రశంసించారు. నా అభిరుచిని ప్రశంసించింది రాత్రి. ఓ సంవత్సరం పోయాక చులాల్ బిల్లు పంపించాడు, నలభైరూపాయల పదిహేనణాలకి.

రాయ్‌గారు మా పేటలోకల్లా చాలా కలిగినవాడు. అంచేత ఈ పేటలోని అతిపరిచితులు, అర్ధపరిచితులు, అపరిచితులు – ఇంచుమించు అందరూ ఆహ్వానింపబడ్డారు. ఇంకా బయటనుంచి వచ్చినవాళ్ళు కూడా చాలామంది వున్నారు. ఎదుట పందిట్లో మడతకుర్చీలలో, హాల్లో సోఫాల్లో, వరండాలో, మెడ్‌లో ఎక్కడచూసినా జనం కిటకిట లాడిపోతున్నారు. కూలివాడి నెత్తిన ఐస్‌క్రీమ్‌సెట్‌తోసహా నేనూ పోయి వాళ్ళలో కలిశాను. అదృష్టవశాత్తూ గేట్‌లో ఎవరూ అటకాయించలేదు. 'దయచేసి గేట్‌లో ఈ కార్డు చూపండి' అని పంపిన కార్డు తీసుకురావటం మరిచిపోయాను లెండి. సన్నాయి, బ్యాండు, కన్‌సర్టు, నౌబత్‌ఖానా వాయిద్యాలు ఎరుపు, పసుపు, నీలం ఎలక్ట్రిక్ బల్బుల తోరణాలు, కార్ల హారన్లూ, కుక్కల మొరుగులూ, అతిథుల ఆప్యాయతను వ్యక్తపరచే ధ్వనులు – అంతా కలిసి ఓ పెద్ద ప్రలాపన లాగుంది.

కొంచెంసేపయాక మరో ప్రలాపన – వంశీప్రలాపన – నేను వినవలసివస్తుందని అప్పు డెవరం అనుకున్నాము!

*　　　*　　　*

వంశీ పలావనలోకి దిగుతాడని రాత్రికూడా తెలియ దనుకుంటాను. తెలిసివుంటే ఆమె నన్ను తనవెంట తీసుకు వెళ్ళేదికాదు. నిజానికి రాత్రి నన్ను తనవెంట తీసుకువెళ్ళిం దన్న మాటకూడా నిజంకాదు. నేనే ఆమెవెంట వెళ్ళాను. కాంతిపాల్ కన్పించకపోయినట్లయితే అస లిది సంభవమే అయేదికాదు.

ఐక్ క్రీంసెట్ నెత్తినెత్తుకున్న కూలివాడు ముందు, నేను వెనుక – రాయ్‌గారి విశాలభవనం ఆవరణలో అడుగుపెట్ట గానే కాంతిపాల్ దర్శనమయింది నాకు. ఆరోజున ఆగుంపులో కాంతిపాల్‌ని కలుసుకోవటం హఠాత్సంఘటనగా భావించాను నేను. విధియొక్క చక్రవ్యూహంలో కాంతిపాల్ స్థానం మొదటి నుంచీ అక్కడ నిర్దిష్టమై వున్నదే అని అనిపిస్తుంది నాకు.

కాంతిపాల్ కాంతివంతుడుకాడు. కొంగమొహంవాడు. గడ్డం – మీసం పెంచడుకాని, వాటిని ఒక నియమంగా తీసేస్తూ వుండడు. అంటే రోజూ గడ్డం చేసుకోడన్నమాట! పంచె మోకాళ్ళమీదికి ఎగకట్టి, ఎర్రటి తడితువాలుతో విసురు కుంటూ మాగ్నోలియా గ్రాండిఫ్లోరా చెట్టుచాటున నుంచుని ఉన్నాడతడు. నే నతడ్ని చూడలేదు. అతడే ముందుకువచ్చి "ఓ, డాక్టరుగారా! కూలివాడి నెత్తిసేమిటది?" అని పల్క రించాడు.

"ప్రెజెంటేషన్."

"ఒరేయ్ నితూ! డాక్టరుగారు తీసుకువచ్చిన దీన్ని తీసుకెళ్ళి హాల్లో మధ్యగా పెట్టిరారా! బాగా కనిపించేట్టుగా పెట్టు."

నితూ వచ్చి కూలీని తన వెంట లోపలికి తీసుకెళ్ళాడు. ఇలా వచ్చిన కానుకలన్నీ కలిపి, హాలుమధ్యగా ఓ ప్రదర్శనం ఏర్పాటుచేశారు.

"అబ్బ! కణతలు పగిలిపోతున్నాయి" అంటూ శాంతి పాల్ మళ్ళీ ఆ తువాలుతో గట్టిగా విసుకోసాగాడు. నేను మాట్లాడే లోపుగానే మళ్ళీ – "ప్రొద్దున్నుంచీ ఈ వెధవలతో గాడిపొయ్యిల దగ్గిర పడివుండి పడివుండి – ఉస్! అబ్బ!..." అన్నాడు.

శాంతిపాల్ సంగతి తెలుసునాకు. అతడు నా నుంచి ఏ మాపేక్షిస్తున్నాడో అదీ నాకు తెలియనిదికాదు. "మీరు కాబట్టి ఇవన్నీ చెయ్యగలుగుతున్నారు. మేమయితేనా సలిగి సున్నమయ్యేవాళ్ళం యీ పాటికి" అన్నాను నేను.

"ఇంక నావల్ల కాదు భాయీ! వయసు దాటిపో యింది. కదా! పద నిన్ను కూర్చోబెడతాను చోటుచూసి. ఆ గుంపుకో దూరకు. అటువైపు వరండాలో కాస్త ఏకాం తంగా ఉండే చోటుంది. అక్కడికి పోదాంపద. అక్కడో ఫాన్ కూడా ఉంది. కాస్త విశ్రాంతిగా కూచోవచ్చు.

తర్వాత అక్కడికి వెడుతూ వెడుతూండగా "కణతలు రెండూ ఎవరో స్క్రూలు బిగించినట్లు మెలేసుకుపోతున్నాయి భాయీ" అన్నాడు.

శాంతిపాల్‌లోని విశిష్టత ఇదే. శివవిహీన 'యజ్ఞం' జరుగుట సంభవమేకాని, యీ పేటలో శాంతిపాల్ విహీనమైన 'యజ్ఞం' జరగటం అసంభవం. తనంతటతానే ప్రొద్దుటినుంచీ నడుంబిగించి, వంట పందిట్లో పర్యవేక్షణంతా పైన వేసుకుని

తిరుగుతుంటాడు. తర్వాత ఎంత ప్రొద్దెక్కితే అంతగాంభీర్యం తెచ్చిపెట్టుకుంటూ, ఎరిగిఉన్నవాళ్ళెవరైనా కన్పిస్తే, వాళ్ళ దగ్గరకెళ్ళి మెల్లిగా తానేదో అస్వస్థతతో బాధపడుతున్నానని చెప్పి, ఎదుటవారి దగ్గర్నుంచి నాలుగు సానుభూతిమాటలు నాలుగు ప్రశంసావాక్యాలు చెవిని వేసుకోవాలని తాపత్రయ పడుతూ ఉంటాడు. ఇదంతా చాటుగానే లెండి. కాంతిపాల్ అంతకంటె ఎక్కువ ఏమీ కాంక్షించడు. అస్వస్థత పోవటాని కెదుటివాళ్ళేదయినా ఉపాయం సూచిస్తే 'వద్దు ఎందుకుపోని ద్దురూ!' అంటూ ఉంటాడు. రోజల్లా వంటయింటిచుట్టూనే తిరుగుతూ ఉంటాడు. కాని ఏమీ నోట్లో వేసుకోడు. ఇహ రాత్రి అందరిభోజనాలూ అయినాక మాత్రం ఒక్క గ్లాసు షర్బతు తాగి మహాతింటే చేసిన మంచి పిండివంట ఏదైనా ఉంటే అదీ కాస్త నోట్లో వేసుకుని ఇంటికి వెళ్ళిపోతాడు.

కాంతిపాల్ నన్ను తీసుకెళ్ళి కూర్చోపెట్టినచోటు - నేనే అయితే ఆ గుంపువంతా తప్పుకునిపోయి వెదుక్కోగలిగే వాణ్ణికాను. అలా వెతుక్కునిపోయి కూర్చోకపోయినట్లయితే తదుపాతి సంఘటనలు నాజీవితంలో జరిగేవో కావో అన్నది సందేహమే! నాసానుభూతి మాటలతో విగళితుడై, కాంతి పాల్ నన్ను తీసుకువెళ్ళి కూర్చోపెట్టినచోటు అతిథులకి నిర్దిష్టమైనచోటు కాదు. అది అంతఃపురానికి చేరువగా వెనుక వైపునఉన్న ప్రదేశం. అంత చాటుగాఉండే జాగాకాదు, అంత బహిరంగంగాఉండే ప్రదేశమూకాదు. ఆడవాళ్ళూ కూచో వచ్చు; మగవాళ్ళూ కూచోవచ్చు. అక్కడ ఓ గుండ్రటిబల్ల చుట్టూ నాలుగయిదు కుర్చీలు వేసిఉన్నాయి. పైన ఓఫాన్

ఉంది. అటూ యిటూ తిరిగేవాళ్ళు అక్కడికీ వస్తూనే ఉన్నారు. కాని, అక్కడ మాత్రం ఎవరూ ఆగిపోవటంలేదు. ఇంత గుంపులో ఇలాంటి-చోటు సంపాయించటమనేది చాలా అదృష్టమైన సంగతి ఫాన్ వేసి ముసిముసినవ్వొకటి నవ్వి, "అటువైపు మాత్రం చూడకండేం?" అని చెప్పి వెళ్ళిపోయాడు కాంతిపాల్.

అతడు చూడవద్దని చెప్పి వెళ్ళిపోయిన వైపు చూశాను. అల్లంతయెడంగావున్న విశాలమైన గదిలో ఆహ్వానితలైన ఘరానా కుటుంబాలకిచెందిన స్త్రీలు సమావేశమైవున్నారు. కొద్దిపాటి రణగొణధ్వని ప్రారంభమయింది. వాళ్ళు నన్ను చూడలేరు కాని, నాకు మాత్రం వాళ్ళు కన్పిస్తూనే వుంటారు.

దూర్వాసుడు లాంటివాడైనా రామనాధబాబుగారిభార్య వారిలోలేదేమోఅని హఠాత్తుగా తోచింది నాకు. చేతికి మురిడీ గొలుసులు; పాపిట్లో కుంకుమ, మామూలు నూలుచీరెధరించి ఆత్మగౌరవాన్ని, కాపాడుకుంటూ ఉండే ఆమె – ఈనకిలీ సీతాకోక చిలుకలమధ్య ఒక్కనాటి కుండదు. రామనాధబాబు భార్య ఆత్మగౌరవభిత్తి, ఆమె భర్త కిగల బ్రాహ్మణ భక్తి అనే పునాదిమీద ఏర్పడినట్టిది. ఈ నకిలీ సీతాకోక చిలుకల ఆత్మగౌరవమంతా వారిభర్తల సంపాదనమీదా, లేదా అప్పుచేయ గలిగినవారినేర్పుమీద. అంతేకాదు. మంచి-చెడు. మర్యాద-అమర్యాద అనే వివక్షతలేకుండా తమ ఆత్మగౌరవాన్ని వెల్లడించుకోటానికి చేసేప్రయత్నంమీద ఆధారపడినట్టిది. నగలూ, చీరెలూ, కార్లూ, సోఫాలు కొనుక్కోవటంతో కాదు వీరి ఆత్మగౌరవం పెంపొందేది; దాన్ని దురదృష్టవంతులయెదుట

దరిద్రులయెదుట వెల్లడిచేసుకోవటంతో .... గుంభనగా ఉన్న ఐశ్వర్యాన్ని ఈరోజుల్లో ఎవరూ లెక్క చెయ్యరు. పైకి కన్పించే ఐశ్వర్యమే సమాజగౌరవానికి కొలబద్ద. అంచేతనే రంగు రంగులచీరెలు, రకరకాలనగలు ధరించి, ముఖానికింత క్రీమూ, పౌడరూ పట్టించి, అంతర్యాం వ్యక్తంకాని, లేకినవ్వొ ఒకటి తెచ్చి పెట్టుకుని, గుట్టుబయటపడకుండా, నటనతో నెట్టుకొస్తూవుం టారు ఎవరిభర్త సుమాస్తాఅయిందీ, ఎవరిభర్త ఆనుమాస్తాపై అధికారి అయిందీ వారిభార్యలని చూసి కనుక్కోవటం గగనం; చీరెలూ, నగలూ వీటికి సంబంధించినంతవరకు అందరూ రాజారాణులే. కడుపునిండా తినరు. మానవత్వాన్ని గురించి మాట్లాడుకోరు. అంతోయింతో సంపాయించి తెచ్చినదాంతో ఐశ్వర్యసూచకమైన చవుకబారు మెరుగుల్ని వేటినో కొనుక్కొని ఎండి, ఒరుగుల్లాగ తయారై ఇరుగుపొరుగువారితో ఏదో కీచు లాట తెచ్చిపెట్టుకుంటూవుంటారు. రామనాథబాబు భార్య కాలూకు నిరలంకృతమైన మర్యాదాభావన లౌక్యదృష్ట్యా చూస్తే ఒకరకమైన 'కాంప్లెక్స్' అయితే అవొచ్చు ... కాని ఈ దరిద్రదేశంలో నగలూ, వస్త్రాలతో అభిజాత్యాన్ని వెల్ల డించుకుందామనే 'ఫాల్స్ కాంప్లెక్సు' కంటె దారిద్ర్యాన్ని వ్యక్తంచేసే 'కాంప్లెక్స్' చాలామంచిది, శ్రేయస్కరమైనది. గౌరవనీయమైనది. మనపూర్వులు మనకంటె చాలాతక్కువ సంపాదించి, మనకంటె చాలా ఎక్కువసుఖవంతంగా జీవించారు. ఎంచేతంటే వారివారి గౌరవమర్యాదలు అర్థికానికి సంబంధించి నవికావు, ఆత్మీయతకి సంబంధించినవి. సుఖజీవనానికే ధనం కాని, ధనంకోసంకాదుజీవితం. ఈసంగతి మనం మరచిపోయాం

కనుకనే, డబ్బు ఉన్న ఏ దురాత్ముడివద్దకైనా సరే, అతిస్వల్పమైన ఆర్థిక సహాయానికి తలవంచటానికి తయారవుతున్నాం...

ప్లాసీయుద్ధం....రామ్ మోహన్ రాయ్....విద్యాసాగర్..బంకిం...వివేకానంద్...రవీంద్రనాధ్....నూటయెనభై సంవత్సరాలు మనస్సుమీదినుంచి ఒక్కసారిగా దొర్లిపోయాయి.

దిస్ ఈజ్ కల్ కటా కాలింగ్ —

బియ్యం ధరలు – వస్త్రాలధరల దగ్గర్నుంచి మహామహా రాజ్యాలు నెలకొన్న గాథలు, పతనమైపోయిన గాథలు, పంధొమ్మిదో శతాబ్దపు సాహిత్యం, సితార్ మీద కన్నడరాగాలాపన, నాటకం, క్రికెట్ మాచ్ ఫలాఫలాలు – తారస్థాయిలో ఒకదాని తర్వాత ఒకటి శూన్యంలో ఘోషిస్తున్నాయి. కిళ్ళీ దుకాణం లోనూ, మహారాజప్రాసాదంలోనూ విన్పిస్తున్నాయి. కాని ఇది సంగీతమా! బాంగ్లాభాష తెలియనివారు బాంగ్లాదేశం యావత్తూ ఒకమ్మాడిని ఏడుస్తోందా అని అనుకుంటారు బహుశా. కాని ఎవరేడుస్తారు? ఒక శవం మరొక శవం తాలూకు దుఃఖానికి సానుభూతిగా ఏడుస్తుందా ఎక్కడైనా? ఏడుపుకాదది, సంగీతమే. భాష కనుక తెలిస్తే సంగీతానికి బహుశా ముగ్ధులుకావొచ్చు. ఎవరూ చావలేదు. అందరూ బ్రతికేఉన్నారు. పైగా ఎంత ఆనందంగా ఉన్నారంటే ఎనిమిది ఝాములూ అందరూ గానం చేయగగిలినంత ఆనందంలో ఉన్నారు.

టార్చ్‌కాంతి కారుచీకట్లని ఎలా చీల్చిపారేస్తుందో, ప్రక్కగదిలో మ్రోగిన ఫోన్‌కూడా మా మనస్సుల్లోని తమిస్రాన్ని అలా చీల్చేసేసింది.

'హాలో! ఎవరు మీారు? సవితాదేవి యింట్లోంచి సత్యేందుబాబు కబురుచేస్తున్నారా? రాత్రిని పిలుస్తున్నారా? ఏం చెప్పమన్నారు ఆమెతో? ఒక్కరూ రోగిని పట్టుకో లేకుండా ఉన్నారా? సరే, చూస్తాను నేను.' ఫోన్ రిసీవ్ చేసుకున్న వ్యక్తి అటువైపు గుమ్మంలోంచి బయటికి వెళ్ళిపోయాడు. నే నతణ్ణి చూడలేదు. నామనస్సులో ఒకదానివెంట ఒకటి రెండు అసంబద్ధమైన ఆలోచనలు వచ్చాయి. రాయ్‌గార్ని ఇంతవరకు కలుసుకోనే లేదు...... రాత్రిని మాత్రం కలుసుకోక తప్పేట్లులేదు...!

హఠాత్తుగా లేచి వరండా మెట్లుదిగి - ఆదరాబాదరా 'లాన్' లోకి వెళ్ళాను. బహుశా మెట్లు ఎదురుగా కన్పించాయి కనుక అలా వెళ్ళాననుకుంటాను. లాన్‌లో అటువైపున ఒక కుర్రాడు ట్రేలో పర్బతులు పెట్టుకుని వెడుతున్నాడు. వాణ్ణిపిలిచి, "రాయ్‌గారు ఎక్కడున్నారో చెప్పగలవురా?" అని అడిగాను.

"వారు 'గెస్టుహౌస్' లో ఉన్నారు. దర్భాంగా స్టేట్ మేనేజరుగారున్నారుగా అక్కడ!"

కుర్రాడు వెళ్ళిపోయాడు.

రాయ్‌గారి ఆహ్వానంమీాదనే వచ్చాననుకోండి. అయినా-ఊహూం దర్భాంగా ఎస్టేట్ మేనేజరు వచ్చిఉన్నప్పుడు రాయ్‌గారు నాలాంటి మామూలువ్యక్తితో కూర్చుని తమ

కాలాన్ని వ్యర్థంచేసుకుంటారా – అన్న ఆలోచనకూడా – నేనెంత ఆహ్వానంమీద వచ్చినవాడినైనప్పటికీ – అన్యాయమే. నన్ను అభ్యర్థన చేయటానికి వారి మనుషులు లేకపోలేదు. ఇంత మహారాజసూయయాగ సందర్భంలో వచ్చిన ప్రతి వారినీ ప్రత్యేకంగా కనుక్కోవటం ఎంత రాయ్‌గారికైతే మాత్రం ఎలా సాధ్యమౌతుంది? అదీకాక మరొకమాటకూడా నిజమేగా! నన్ను ఆహ్వానించకపోయినా, పోనీ నేను రాకపో యినా ఈ మహోత్సవంలో వెలితనేది కన్పించేదా? దయతలచి ఆహ్వానించారు నన్ను. ఆహ్వానించకుండా ఉన్నా ఉండగలిగే వారే!

మనస్సులోని అసంతృప్తియాకత్తూ క్షణంలో మాధు ర్యంగా మారిపోయింది.

"నమస్కారాలు. మీరూ వచ్చారే!"

తిరిగి చూశాను. రాత్రి రెప్పవాల్చకుండా నాకేసి చూస్తూనుంచుంది. ముఖంలో రవంత చిరునవ్వు వ్యక్తమవు తోంది. ఆమె ప్రక్కన మరొక యువతి నుంచుని ఉంది. ఆమె ఎంత తెల్లగా ఉందంటే, హఠాత్తుగాచూస్తే యూదు యువ తేమో అనిపిస్తుంది. రాత్రి ఆహ్వానం లేకుండానే సవితని కలు సుకుందామనే ఉద్దేశ్యంతో ఈ యింటికి వచ్చిందన్న సంగతి అప్పుడు నాకు తెలియదు. రాత్రి సవితఇంటికి వెడితే ఆమె కన్పించలేదు. సవిత రాయ్‌గారి ఆహ్వానాన్ని మన్నించటాని కిక్కడికి వచ్చింది. రాత్రికూడా ఆమెను వెతుక్కుంటూవచ్చిం దిక్కడికి. సవిత – రాత్రి ఒకరిసరసన ఒకరు నిలబడి ఉంటే – సరిగ్గా వెలుగు – చీకటి ఒకదానివెంట ఒకటి ఉన్నట్లుంది. అన్న

ఆ పాత ఉపమానమే స్ఫురించింది. ఆరోజు రాత్రి ముఖంలో కనిపించిన మెరుగుదిద్దిన మార్యాదా సూచక మైన స్నిగ్ధత హృదయంలోంచి పుట్టుకువచ్చింది కాదని, అప్పుడు నేను తెలుసుకోలేకపోయాను. అగ్గిపుల్ల చివర ఉండే మందులో ప్రచ్ఛన్నంగా అగ్ని వున్నట్టే, రాత్రిలోకూడా అలాంటి అగ్నే ఉన్నట్లు నేనా రోజున గ్రహించలేక పోయాను. సవితతో రాత్రికి మొదటగా పరిచయమైనరోజున రాత్రే స్వయంగా వచ్చి పరిచయంచేసుకున్న సంగతికూడా తెలియదునాకు మర్నాడుదయం జ్యోతిర్మయుడు వచ్చి రాత్రిని ఒక్కసారిమాత్రం కలుసుకుని సవితయింటికి వెళ్ళి పోతాడన్న సంగతికూడా అప్పుడు నాకు తెలియదు సవిత యెలాఉంటుందో చూడటానికి – ఒక సూదంటురాయి మరొక సూదంటురాయిలోని శక్తి ఎంతటిదో నిర్ధారణ చేసుకో టానికి – వచ్చిందిరాత్రి.

"మీరు మధుపురంనుంచి వచ్చి ఎన్నాళ్ళయింది?"

"నాలుగు రోజులయింది"

రాత్రికాక మరొక యువతి ఎవరైనా అయినట్లయితే ఈ ప్రసంగ సందర్భంలో మరికొన్ని ఇతరసంగతులు కూడా మాట్లాడేదే. రాత్రి నా ప్రశ్నకు సమాధానం మాత్రంచెప్పి మెదలకుండా ఊరుకుంది. ఆమె సవితముఖంకేసి రెప్పవాల్చ కుండా చూస్తూఉండటం, అంచేత సవిత కొంచెం ఇరుకున పడ్డట్టు ఇదవుతూ ఉండటం నేను గమనించాను. నేనూ ఆమె కంటే తక్కువ ఏం ఇదవలేదు. తర్వాత ఏంచెయ్యటం, ఏం మాట్లాడి ఈ ప్రసంగాన్ని మామూలు ధోరణిలోకి తీసుకు

రావటమూ అన్న సంగతులే ఆలోచిస్తున్నాను. రాత్రి ఎదుట ఎప్పుడూ నాకిలాంటి వాక్సంకటమే వచ్చి పడుతూ ఉంటుంది. సరిగ్గా ఈసమయంలో నితూ ఒకకార్డు, ఎర్రపెన్సిలూ తీసుకుని హాజరయినాడు.

"దయచేసి తమపేరేమిటో చెపుతారా?"

"ఎందుకు?"

"తమరు తెచ్చిన ఐస్క్రీం సెట్‌కి తగిలించాలి - కార్డు మీద రాసి..."

"అవి ఎక్కడ పెట్టారు - మేము చూడనేలేదే!" అని అడిగింది సవిత.

"అదుగో హాల్లో కుడివైపున. రండి"

అందరం నితూ వెంట వెళ్ళాము.

ఆ కానుకల ప్రదర్శనాన్ని వర్ణిస్తూ కాలాన్ని వృథా చెయ్యను. మామూలుగా షాపులో ఎన్నిరకాల వస్తువులుంటాయో, అన్నీ అక్కడ ఉన్నాయి. రాత్రి నికెల్ ఎలక్ట్రోప్లేటెడ్ ఐస్క్రీంసెట్‌ని చూసి-నితూఅప్పటికే నాపేరురాసినకార్డు దానికి తగిలించి ఉంచాడు - రెండుమాటలుమాత్రం అన్నది. "చక్కటి కానుక..." తర్వాత హఠాత్తుగా సవితవైపుకి తిరిగి "మీరు విఖ్యాత కథకులు, డాక్టరు ఘనశ్యాం సర్కార్" అన్నది. నమస్కార ప్రతినమస్కారా లయిపోయాక మామూలు కుశల ప్రశ్నలు కూడా జరిగేవేమో! కాని హఠాత్తుగా ప్రక్కనున్న గుమ్మం పరదాతొలగించుకుని - ఎప్పుడూ హడావిడిగా తిరుగుతూ ఉండే ఓ వ్యక్తి - చెమటతో సాంతం తడిసిపోయిన బనీనుతో, ఊడి ఊడిపోతున్న నడుముకు బిగించు

కున్న తువాలుతో వచ్చిపడ్డాడు. సవితాదేవి ఎదుట కన్పించ గానే "ఓ, నువ్వు ఇటు వచ్చావా సవితా? నిన్ను వెతుక్కుంటూవచ్చిన సువర్ణప్రభని, నువ్వు లోపలెక్కడో ఉన్నావనుకుని, లోపలికి వెళ్ళమని పంపించాను. ఇప్పుడే మీ ఇంటి దగ్గర్నుంచి ఓ పెద్దమనిషి రాత్రి అనే అమ్మాయికి - ఐమీన్- రాత్రి అనే ఆవిడకి ఫోన్ చేశారు. స్వర్ణేందుబాబు అనే ఆయన ఆమెని పిలుస్తున్నారుట! రోగిని ఆయన ఒక్కరూ పట్టుకోలేకుండా ఉన్నారని చెప్పారు. నాకు రాత్రి అనే ఆమె ఎవరూ కన్పించలేదు" అన్నాడు.

"ఈమే రాత్రిదేవి"

"ఓ, నమస్కారాలు"

ఆ వ్యక్తి ఇంకేం మాట్లాట్టానికి అవకాశం ఇవ్వకుండానే "నే నిప్పుడే వెడుతున్నాను." అన్నది రాత్రి.

నేను బహుశా కర్తవ్యంతాలూకు ప్రేరేపణవల్ల నే అనుకుంటాను - "ఇంట్లో ఎవరికైనా సుస్తీగా ఉందా యేం?" అని అడిగాను.

"వంశీదాకి జ్వరం"

హఠాత్తుగా పెద్ద దిగులుపడ్డట్టు నటించాను.

"ఓ, అయితే మీతో నేనుకూడా రావాలని చెప్పండి!"

"అలాగే, రండి."

నాకు బాగా జ్ఞాపకం ఉంది. రాత్రి సవితవైపుకి తిరిగి. "ఇవాళ తెల్లవారుఝామున జ్యోతిర్మయబాబు వస్తున్నారు. పది గంటలకి మీ యింటికివస్తారు. మీకు ముందే ఉత్తరం

వచ్చిందన్న సంగతి నాకు తెలియదు. అంచేత ఈ మాట చెప్పిపోదామని వచ్చాను" అని చెప్పింది.

నవ్వు వెల్లివిరుస్తున్న నేత్రాలతో "అనేక ధన్య వాదాలు" అన్నది సవిత.

కానుకల ప్రదర్శనం ఉన్న హాల్లోంచి ఇద్దరం బయటికి వచ్చాము.



సన్నాయి, బ్యాండు, కన్‌సర్టుమేళాలు, ఎరుపు, పసుపు, నీలంబల్బుల తోరణాలు, కుక్కల మొరుగులూ, కార్లహారన్లూ పందిల్లో భోజనాలముందు కూర్చున్న అతిథులు, వడ్డించే వారి కేకలూ, రేడియోగోల – ఇవన్నీ మాకళ్ళ ముందునుంచి కొద్ది నిమిషాలపాటు గారడీవాడు మాయంచేసినట్లు మాయ మైపోయాయి. రాత్రి – నేను ఒకరి సరసన ఒకరం నడుస్తు న్నాం. ఇంక మాచుట్టూ ఏమీలేదని అనిపించింది. కాలం స్తంభించిపోయి మాకేసి చూస్తున్నట్లుంది. ఏదో కీకారణ్యంలో కారుచీకట్లోంచి మేమిద్దరం ప్రక్కప్రక్కనేఉండి నడిచిపోతు న్నామనిపించింది. రాత్రి చీరెకొంగు దీపాలకాంతిలో గాలికి కాస్తంత కదిలి కన్ను చెదరకొట్టింది. మళ్ళీ ఆ సన్నాయి, బ్యాండు, కన్‌సర్టుమేళాలు, రంగు రంగుల ఎలక్ట్రిక్ బల్బుల తోరణాలు, కుక్కల మొరుగులూ, కార్లహారన్లూ, వడ్డించేవారి కేకలూ, రేడియోమోత – అన్నీకలిసి హఠాత్తుగా ఒక్కసారి చైతన్యావస్థలోకి వచ్చిన మా మనస్సులమీదికి దుమికాయి. నేను కళ్ళెత్తి చూసేసరికి రాత్రి వంగి ఊడిపోయిన 'స్యాండల్

స్ట్రిప్'ను సరిచేసుకుంటోంది. రాయ్‌గారి భవనంలోంచి బయటికివచ్చి గేట్‌కి ఎదురుగా నిలబడ్డాం మేము. జేబులో అయిదు రూపాయలూ అలాగే ఉన్నందుకు దలాల్‌సాధుకు మనస్సులో కృతజ్ఞత తెలిపి, టాక్సీ పిలిచాను.

టాక్సీలో మేమిద్దరం రెండే రెండు మాటలు మాట్లాడుకున్నాం.

"క్రొత్త పుస్తకం ఏదైనా రాయటం మొదలెట్టారా మళ్ళీ?"

"లేదు."

వంశీకి సుస్తీగా ఉన్నదన్న వార్త విని విచారించి, అతడి హితైషినసే చద్మవేషంలో పిలవకపోయినా వెంటపడి వెళుతున్నవాణ్ణి, వంశీ సుస్తీనిగురించి ఒక్కమాటయినా అడగలేదు నేను. ఆమె అయినా ఆ ప్రసక్తి తీసుకురాలేదు. ఇద్దరం మౌనంగానే కూర్చున్నాం దీపాలతో ధగధగలాడుతున్న ఇళ్ళను వెనక్కి తోసేసుకుంటూ ముందుకుపోతున్నాం. కాలిబాటలమీంది జనంలోంచి ఏ యువతిదో కలకంఠమధుర మందహాసం చెవినపడ్డట్టు గుర్తు. ఆ మూలమీంద కూర్చునిఉండే గుడ్డిబిచ్చగాడు ఇంకా చెయ్యిచాపుకుని అలాగే కూర్చుని ఉన్నాడు. ట్రాములు, రిక్షాలు, చేగాడీలు, కార్లు, మొదలైన వాటి రణగొణధ్వనులతో కిటకిటలాడే జనంతో రోజూ ఎలా ఉంటాయో, ఇవాళా అలాగేఉన్నాయి వీధులు. కాని అలా లేనిదల్లా నేనే...! రాత్రిని ప్రక్కన కూర్చోపెట్టుకుని టాక్సీ చేసుకుని పరుగెత్తుతున్నాను.... కొంచెం సేపటికి రాత్రి నిర్దేశానుసారంగా టాక్సీ ఆగింది. అదృష్టవశాత్తూ ఆగింది. ఇం

కొంచెంసేపు అలాగే పోయినట్లయితే నేను బహుశా.... అంటే టాక్సీలోంచి దిగగానే నాకేదో నక్షత్రలోకంలోంచి దిగినట్లుంది....

ఒక పక్క డస్ట్‌బిన్నూ, మరోక పక్క ఎలక్ట్రిక్ స్తంభం— పేటివ ధ్యనున్న చిన్న సందు చీకటికోణంలా ఉన్న చిన్న గొంది. దానికి ఆ చివరనున్న రెండంతస్తుల మేడ. ఈ చివరనుంచి చూస్తే కన్పించనే కన్పించదు.

"రండి."

తలుపు తెరవగానే కనకనలాడుతున్న రెండుకళ్ళు కంట పడ్డాయి ముందు; తర్వాత ఒక తరుణిముఖం. ఆతర్వాత ఆమె ధరించిన కాషాయివస్త్రం కన్పించాయి. ఆఁ. మొదట్లో ఆమె తరుణి అనే అనిపించిందనాకు. ఆమే స్వర్ణేందుతల్లి. రాత్రి తల్లి— అని ఇప్పటికీ తోచలేదు నాకు. హఠాత్తుగాచూస్తే రాత్రికి సమానవయస్కురాలే అనిపిస్తుంది. నన్నుచూడగానే ఆ కణ కణలాడే దృష్టి స్నిగ్ధదృష్టిగా మారింది. "ఎవరునాయనా నువ్వు?" అని అతికోమలకంఠంతో ప్రశ్నించింది.

"నేను స్వర్ణేందు స్నేహితుణ్ణి – ఘనశ్యామ్‌ని. వంశీకి నుస్తీగా ఉందని విని..."

"రా. నాయనా రా. ఇప్పుడే అన్నాడు స్వర్ణేందు నీ మాట"

రాత్రిఏమీమాట్లాడకుండా ఎవరికేసీచూడకుండా లోపలికివెళ్ళిపోయింది.స్వర్ణేందుతల్లి కాస్సేపు నాకేసిఅలాగేచూస్తూ ఊరుకుంది.తర్వాత "నేను స్వర్ణేందు తల్లిని" అన్నది.

నేను నమస్కారం చేశాను.

బహుశా సద్యోలబ్ధమైన పరిచయజ్ఞానంమూలంగా అనుకుంటాను, నా దృష్టి భేదించింది. నమస్కారంచేశాక కళ్ళెత్తిచూసినప్పుడు ఆమెముఖంలో తరుణీభావం తిరోహితమైపోయిందా అనిపించింది. లోపలినుంచి ముసలితనం తొంగిచూస్తూన్నట్లు తోచింది. తామరాకుకి నీటి తడిఅంటదు. ఆకాశానికి మేఘాలమాలిన్యం అంటుకుని ఉండదు - అలాగే ఆమెముఖంలో వార్ధక్యలక్షణాలే ఏమీ లేవు. కాని అయినా ఎక్కడో - బహుశా కళ్ళల్లోనే అనుకుంటాను. ఆమె అసలు వయస్సు ఎంతయినదీ తెలిసిపోతోంది. తర్వాత ఈ మహిళామణితాలూకు జీవితరహస్యాలు నేను తెలుసుకున్నంతవరకు - వాటిలో చాలావరకు నేను ఊహించినవే అనుకోండి. ఎంచేతంటే ఒక ఉత్తరంలోచూసిన పొడిపొడిమాటల్నిబట్టి నిస్సంశయంగా ఎన్నివిషయాలని తెలుస్తాయి! డి. కె. మాటలు మాత్రం ఎంతవరకు విశ్వసించతగ్గవో ఏంచెప్పగలం? అంతకు మినహా అతడి నోటిమీదుగా అన్నివిషయాలూ నేనూ పూర్తిగా విననుకూడా లేదు. రాఖాలబాబు, పూర్ణేందుబాబు, జ్యోతిర్మయుడు ఈ పేర్లున్నవారు ఇంకెవరైనా ఉండటంకూడా అసంభవమేమీ కాదు. ఏమయినా కానీ, ఎంతవరకు కనుక్కోగలిగానని నా విశ్వాసమో -బహుశా ఆ విశ్వాస బలిమితోనే రాత్రిలో ఎన్ని దురాలోచనలున్నాయని తెలిసినా నాకు ఆమెనిక్షమించటం సాధ్యమయిందనుకుంటాను-ఆరహస్యాలన్నీ ఆ రోజున స్వర్ణేందుతల్లి కళ్ళలో కన్పించినట్లే ఉన్నాయినాకు. అలాంటి అతిపురాతన - అతినవీన రహస్యాలు, ఏకాలంలో ఏతరగతి స్త్రీలకళ్ళలో నయినాసరే, ఎంత సంకోచంతో వ్యక్త

మైనా, ఎంత నిస్సంకోచంగా వ్యక్తమైనా ఎలాంటివారిలోనైనా పౌరుషాన్ని ఎన్నోవిధాల ఉద్బుద్ధంచేస్తాయి.

"ఈ మొహంగా వున్న గదిలోనే ఉన్నాడు స్వర్ణేందు. వెళ్ళు. లోపలికి వెళ్ళు నువ్వు"

ప్రక్కగా ఉన్న మెట్లమీదినుంచి మేడమీదికి వెళ్ళి పోయింది రాత్రి.... ఈ ఇంటితో తనకేమీ సంబంధం లేక న్నట్లు. ఇక్కడిసంగతులన్నీ తనకి కరతలామలకములే, ఇహ ఏటివిషయంలో తాను కుతూహలపడవలసిందంటూ ఏమీ లేదన్నట్లు. అంతేకాదు, ఇక్కడిస్థితిగతుల కనుగుణంగా రవంత సంప్రదాయాన్నయినా పాటించటం తనకు బాధాకరమైనట్లు - అంత నిర్లిప్తురాలిలాగా వెళ్ళింది.

తలుపుతోసుకుని లోపలికి వెళ్ళాను.

లోపలికివెళ్ళగానే సగంసజీవంగా, సగం నిర్జీవంగా ఉన్న స్వర్ణేందు తండ్రి ముఖం కన్పించింది. తలుపు తెరచినచప్పుడుకు సజీవంగా ఉన్న కన్ను తెరచుకుని, ఆశ్చర్యంతో ఒక క్షణం నాకేసిచూసింది. ఆఁ. తెలిసింది. అని నిశ్శబ్దంగా చెబుతున్నట్లు ఆకన్ను మళ్ళీమూసుకుంది. గదిలో ఇంకెవరూ లేరు. కాసేపు మెదలకుండా నుంచున్నాను నేను. రాకెట్‌లాగా తిరుగుతూ ఉండేవాడు, బోల్షివిక్ రష్యాలోకూడా చెల్లుబాటు కానంతటి నీతి - అవినీతి, పాప - పుణ్యాలకు సంబంధించిన ఆదర్శాలు కలవాడు - అలాంటి వ్యక్తి నిస్సహాయంగా పక్కమీదపడుకుని ఉన్నాడు-మాటలేదు,సహాయులులేరు, కొడుకు, కూతురు, భార్య - ఎవరూలేరు దగ్గర. ఇలాంటి జాలిగొలిపే

దృశ్యాన్ని నా డాక్టరుజీవితంలో ఇతరత్రాకూడా చూశాను. ఇంటి యజమాని హఠాత్తుగా పక్షవాతంవచ్చి పడిపోతే, వారి వారి కలిమిబలిమి ననుసరించి కొన్నాళ్ళపాటుమాత్రం చికిత్స మొదలైన హడావిడి జరుగుతుంది. తర్వాత క్రమంగా ఆ హడావిడిఅంతా చప్పబడుతూంది. స్వాభావిక నియమాన్నను సరించి అనివార్యమైన దుర్ఘటనలు అందరికీ అలవాటుగా మారిపోతాయి. ఆత్మీయులు మరీ ఆదుర్దాతో త్రొక్కిసలాడే టంత తీవ్రత అందులో ఉండదు. అప్పుడిహ నిస్సహాయుడై కదిలేందుకు శక్తి లేక మంచంలోపడివుండే వృద్ధుడికి ఉప చారం చెయ్యటమనేది పూజాగృహంలో వేళకింత దీపా రాధన చేసినట్లు – ఏదో నియమకర్తవ్యంగా పరిణమిస్తుంది. కాని పూజాగృహంలో ఉండే దేముడికి, మంచమెక్కిన యజ మానికి చాలా వ్యత్యాసం ఉంటుంది. ధూపదీప నైవేద్యాలు కాస్త ఆలస్యమైనా విగ్రహాల్లోని దేముడేమీనోరెత్తడు. కాని వేళకి తనకి జరగవలసిన ఉపచారాలు జరగకపోతే పక్షవాతాన పడ్డ యజమానిమాత్రం చాలా రుసరుస లాడుతూ ఉంటాడు. అతడికి ఉపచారాలుచేసేవారు దాసీవాళ్లైనా, భార్యా, కొడుకు, కూతురు – ఎవరైనా వాళ్ళు విసుక్కోవటమే తరచుచూస్తూ ఉంటాం. ఎన్నాళ్ళని ఒక్క బిగువున తెల్లవార్లూ జాగరణ చేస్తారు? భర్తేకానీ, తండ్రేకాని, మాటిమాటికీ ఎన్నిసార్లని లేపతీసి అటుకాదని ఇటూ, ఇటు కాదని అటూ పడుకోబెట్ట గలరు. మనుషులకి, రక్తమాంసాలున్న మనుషులకే నా యెను– వారి సహనానికయినా మితి అనేది లేదూ! అలాంటప్పుడు కొడుకయినా తండ్రిని దూషిస్తాడు. భార్యా రమణీమణినోట్లో

నుంచి వచ్చేమాటలుకూడా అంత రమణీయంగా ఉండవు. నా మనస్సులో కి ఒక ఆలోచనవచ్చింది. మధుపురం విడచి కలకత్తాలోని ఈ ఇరుకు సందులోకి వీళ్ళు ఎందుకు వచ్చారా, అని... రాక తప్పనిసరి అయిందని తర్వాత తెలుసుకున్నాను. స్వర్ణేందుతల్లిని మధురనుంచి తీసుకుని రావటానికి వెళ్ళినప్పుడు తాము మధుపురానికి వెళుతున్నట్లు ఆమెతో చెప్పలేదు. ఆమెకూడా పూర్ణేందుబాబు విషయంలో తన కుతూహాల మంతా చప్పగా చల్లారిపోయినట్లు – ఊరికే తెలుసుకుందా మనైనా సరిగా అడగలేదు. జ్యోతిర్మయుడింట్లో అద్దెల వాళ్లెవరో ఉన్నారని, అతడు కలకత్తాలోని ఏదో చిత్రప్రదర్శన మైకంలో ఉన్నాడని స్వర్ణేందు తల్లికి తెలుసు. లోపల్లోపల జరిగినదంతా ఆమెకి తెలియదు. జ్యోతిర్మయుడు అద్దెకున్న వాళ్ళని లేవగొట్టాడని చిత్రప్రదర్శనశాల తలుపులు తాళా లేసి, టాక్సీలో ఉరక లెత్తుకుంటూ వచ్చాడని–ఇవేవీ ఆమెకి తెలి యవు. ఇవన్నీ తెలియగానే ఆమెఆదరాబాదరా మధురనుంచి పరుగెత్తుకొచ్చి ఇహ.వీరి అరికాళ్ళకింద మంటలు పెట్టసాగింది. దాంతో ఇహ స్వర్ణేందు అందర్నీ తీసుకుని కలకత్తాకి రాక తప్పిందికాదు. స్వర్ణేందు మొదట్లోనే ఈ సంగతంతా తల్లికి చెప్పిఉన్నట్లయితే ఈ గొడవంతా జరిగేదేకాదు. అర్ధరాత్రి జ్యోతిర్మయుడూ రాత్రీ ఇద్దాళ్లూ ఒకచోటకలసిఉండటం తల స్థించేదికాదుకదా అనిపిస్తుంది నాకు. ఈ సంగతి తెలియగానే ఆమెగట్టిగా అభ్యంతరపెట్టింది. ఆమె అభ్యంతరాన్ని స్వర్ణేందు, రాత్రి, జ్యోతిర్మయుడూ–ఎవరూ ఎదిరించలేకపోయారు. తల్లిని ఏదోవిధంగా సమాధానపరచి తీసుకువస్తే, ఆమెకి అన్ని సంగ

తులూ తెలుస్తాయని, జ్యోతిర్మయుడు రాత్రి అన్యోన్యంగా ఉండటంచూస్తే ఆమె యిక వారి వివాహానికి అభ్యంతరం చెప్పదని స్వర్ణేందు అనుకున్నాడు. స్వర్ణేందు పొరపడ్డాడు. తనతల్లి స్వభావాన్ని తను అర్థంచేసుకోలేదు. నిజానికలా అర్థంచేసుకున్న వాళ్ళు మాత్రం ఎందరుంటారు? చెట్టు భూమిని సరిగ్గా అర్థంచేసుకుంటుందా? భూమితాలూకు పేదరికాన్ని-పెద్దరికాన్ని గమనించగలుగుతుందా? భూమిలో ఉన్న సారాన్ని తనకు అందినంత వరకుమాత్రమే పీల్చుకుంటూ పెరిగి పెద్దది అవుతూందికనుక - అంతవరకు మాత్రమే గుర్తించగలుగుతుంది.

స్వర్ణేందు తండ్రి సజీవనేత్రం మళ్ళీ తెరచుకుంది. కేవలం తెరచుకోవటమేకాదు, క్రమంగా విప్పారసాగింది. అదేదో గోళంలాగా రయ్యిన వచ్చి నామీదపడి గాయపరుస్తుందేమో అనిపించింది. నిర్జీవంగా ఉన్న కన్ను మాత్రం బ్రతిమాలుతున్నట్లువుంది. అయినా నేను ఎదురుగా వరదా ఉన్న గుమ్మంలోంచి గబగబా అవతలిగదిలోకి వెళ్ళిపోయాను.

బాగా విశాలమైన గది అది. టేబిల్ లాంప్ తగ్గించి ఉండటంవల్ల గదిలో కొద్ది వెలుతురే ఉంది. గదిలో అటు ప్రక్కగా మంచంమీద వంశీ పడుకుని ఉన్నాడు. అతడి తలంపి దిక్కున స్వర్ణేందు కూచుని ఉన్నాడు. గడ్డం మీసం పెరిగి వున్న అతడి ముఖంలో స్నేహపూర్వకమైన సేవాపరాయణత మూర్తీభవించినట్లుంది. గదిలో వెలుతురు అట్టే లేకపోయినా నేనది బాగానే గమనించాను. నేనేమీ పొరపాటు పడలేదు. పొరపాటు పడలేదుకనుకనే ప్రత్యక్షంగాచూసిన వాణ్ణికాకపోయినా స్వర్ణేందు నిర్దోషి అనిమాత్రం నాకు తెలుసు. నేను

దగ్గిరకు వెళ్ళగానే స్వర్ణేందు కళ్ళెత్తి చూసి, చిరునవ్వు నవ్వుతూ అతడి రూపు బాగా జ్ఞాపకం ఉంది నాకు – "రా, కూర్చో" అన్నాడు.

కూర్చున్నాను.

"వంశీకి సుస్తీయేమిటి? ఎవరు చూస్తున్నారు?"

"ఇప్పటివరకూ ఇంకా డాక్టర్ని ఎవర్నీ పిలవలేదు. వచ్చీ రావటమే వణకుతో ప్రారంభమయింది జ్వరం. మలేరియా యేమో రెండు మూడురోజుల్లో అదే తగ్గిపోతుందిలే అనుకున్నాం. కాని ఇవాళ సాయంత్రంనుంచీ ఏమిటోమరి విషమించినట్లుగా ఉంది."

ఆ కఫంతో కూడిన జ్వరం. ఆ నిశ్వాసాల తీవ్రత, ఆ ప్రలాపన చూసేసరికి 'లోబర్ న్యుమోనియా' యేమో అనే సందేహం కలిగింది నాకు. వంశీ గొణుక్కుంటున్నవాడల్లా హఠాత్తుగా అరవటం మొదలెట్టాడు. "నీ వయస్సెంతో తెలుసుకోవటం ఇష్టంలేదు నాకు. నిన్ను గురించి ఏమీ తెలుసుకో తలచలేదు నేను. నువ్వు కావాలి నాకు, ఎక్కడున్నావ్ రాత్రూ! రాత్రూ!" మళ్ళీ కాసేపు ఏదో గొణుక్కున్నాడు. తర్వాత మళ్ళీ – "ఆఁ ఇచ్చావ్, ఒక రోజున ఇచ్చావు. ఎందుకిచ్చావ్? ఎందుకు?" అంటూ ఉత్తేజితుడై పక్కమీది నుంచి లేవబోయాడు స్వర్ణేందు బలవంతంమీద పడుకో పెట్టాడు. ఇంతిసేపటినుంచీ గమనించనేలేదు నేను, హఠాత్తుగా కంటపడింది. చీకట్లో రాత్రికూడా వంశీ ముఖంకేసి చూస్తూ అటువైపున కూచునిఉంది. ఆమె కళ్ళలో క్రూరత్వం వ్యక్తమవుతోంది.

ముగ్గురం చాలాసేపు మెదలకుండా కూర్చున్నాం. వంశీ కొంతసేపు గొణుక్కుంటున్నాడు; కొంతసేపు బిగ్గరగా అరుస్తున్నాడు. అలా ఎంతసేపు కూర్చున్నామో, ఆ ప్రలాపనంతా వింటున్నప్పుడు నామనస్సులో ఎలాంటి భావాలు కలిగాయో నా కిప్పుడవన్నీ బాగా గుర్తులేవు. తర్వాత గుర్తున్న దృశ్యం ఇది. "తెల్లవారకట్ల జ్యోతిర్మయుణ్ణి స్టేషన్నుంచి తీసుకురావటానికి నువ్వు వెడతావా? అతడికే యిల్లు తెలియదు" అని స్వర్ణేందు రాత్రిని అడిగాడు.

"వెడతాను."

స్వర్ణేందు రాత్రికేసి స్నేహపూర్వకంగా చూస్తూ ఊరుకున్నాడు కాసేపు కేవలం స్నేహభావమే కాదు, అతడి కళ్ళలో ఒక రకమైన ముగ్ధతనికూడా గమనించాను నేను. అప్పుడతడు ఆమెతాలూకు సంపూర్ణ వికసితరూపాన్ని చూసి ఉంటాడు బహుశా....

హఠాత్తుగా వంశీ అరవటం మొదలెట్టాడు – "ఈజిప్పులో అన్నాచెల్లెళ్ళ పెళ్ళి – " రాత్రియొక్క నిప్పులకదృష్టిలో మరింత హింస్రత వ్యక్తమయింది.

వంశీ ప్రేలుతూఉన్నాడు.

జ్యోతిర్మయుడు కొద్ది గంటల్లో వచ్చేస్తాడిహా.

ఆ తర్వాత ఆ రాత్రి ఏయే సంఘటనలు జరిగాయో, అవన్నీ ఈ ప్రకరణానికి సంబంధించినవే అనుకోండి. ఒకటి తర్వాత ఒకటి జరిగినవే కనుక అన్నీ ఒక్కసారిగా వర్ణించతగినవే. కాని అవి ఎంతో గురుతరమైనవి. కేవలం రచయిత

గానే కాదు, వ్యక్తిగతంగాకూడా నే నీకథతో పెనవైచుకుపోయాను. అంచేత వాటిల్లో ఒకటి రాయాలన్నా అసంభవమే.

పడమటివైపు వరాండాలో కూచునిఉన్నాను. కిటికీ తలుపుల ఎరుపు పసుపు ముక్కలైన అద్దాల్లోంచి ఒకే సూర్యకాంతి రంగు రంగులుగా ప్రతిఫలితమై నా కాగితాలమీదికి వచ్చి పడుతోంది. ఒకే సూర్యకాంతి! విస్మయంతో – ఈసంగతే మాటిమాటికీ ఆలోచించ బుద్ధిపుడుతోంది....

## 4

ఆరోజున రాత్రి ఏం జరిగిందో చెప్పటానికి ముందు, ఆతర్వాతి సంఘటన ఒకటి వ్రాయతలచుకున్నాను నేను. మహాభారతంలోని ఆదిపర్వంలో అలౌకిక ధీశక్తిసంపన్నుడు, వెయ్యేనుగులబలంకలవాడు, మహావీరుడు, మహానుభావుడూ అయిన ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డికావటానికిగల హేతువు ఏమని వివరించబడిందో నేను వ్రాయటానికీ అలాంటిదే హేతువు. ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డికావటానికి మాత్రు దోషమే కారణమని మహాభారతకర్త అన్నాడు. 'నీ మరది ఒకడున్నాడు. అతడీరాత్రి నీదగ్గిరకివస్తాడు. నీవు అప్రమత్తురాలివై అతడిరాకకు ఎదురుచూస్తూఉండు' అని సత్యవతి తన కోడల్ని అంబికను సంసిద్ధురాలివైఉండమని ఆదిలోనే హెచ్చరించినా, ఆమె అలా ఉండలేకపోయింది. కృష్ణవర్ణుడైన ఆ మహర్షి ఉజ్జ్వలనేత్రాల్ని, ధూమ్ర జటాభారాన్ని, దీర్ఘ శ్మశ్రువుల్నీ దీపకాంతిలోచూసి, అంబిక భయంతోనూ విస్మయంతోనూ కళ్ళురెండూ గట్టిగా మూసుకుంది. తత్ఫలితంగా

ధృతరాష్ట్రుడు గుడ్డివాడుగా జన్మించాడు. అంధత్వం కార ణంగా అతను చేసిన కృత్యాలకి అతడితల్లి అంబికే చాలావరకు కారకురాలు !

ఆరోజున తెల్లవారగట్ల జ్యోతిర్మయుడ్ని తీసుకురావ టానికని రాత్రి స్టేషన్‌కి వెడుతూ కొంచెంసేపు మాయింటికి వచ్చి ఆగింది. స్టెతస్కోప్ మొదలైనవన్నీ తీసుకుని, మామూలు డాక్టరు వేషంలో రెండోసారి నేను వంశీకి చికిత్సచేసే నెపంతో అక్కడికి వెళ్ళినప్పుడు 'ఓ మందుఇచ్చి వెడుతున్నాను. ప్రలా పనకనుక తగ్గకపోతే కబురుచెయ్యండి' అని చెప్పి, నా అడ్రస్ రాసి ఇచ్చివచ్చాను. ఆ అడ్రస్ పట్టుకుని తెల్లవారగట్ల రాత్రి మాయింటికి వచ్చింది.

మనస్సులో మోహమూవుంది, ఆదుర్దావుంది, కడు పులో చాలా ఆకలిగానూఉంది – రాయిగారింట్లో రాత్రి భోజనం చెయ్యలేదు. చెయ్యలేదన్నసంగతి అంతరాత్రివేళ మా గోకుల్‌తో చెప్పటానికి ధైర్యంచాల్లేదు – అయినా వచ్చిపడుకోగానే మంచి నిద్రపట్టేసింది. నిద్రపట్టటమేకాదు; కలకూడా వచ్చిం దొకటి... ఏదో ఓపెద్ద జలాశయం – కాని అందులో ఒత్తిబురదతప్ప నీళ్ళులేవు. బురద ఉన్నట్లుకూడా దూరాన్నుంచిచూస్తే తెలియదు. అన్నీ కత్తెరగడ్డలేమో అని పిస్తుంది. అక్కడక్కడ గడ్డి మొలిచినట్టు పచ్చగాకూడా ఉన్న ట్లుంది. కాని అందులోంచి వెడుతుంటే మోకాళ్ళవరకు దిగబడి పోతుంది. ఆ నిర్జలంగాఉన్న మడుగులోంచి నేనూ, రాత్రీ జంటగా నడిచివెడుతున్నాం – కాళ్ళు బురదలో కూరుకు పోతున్నాయి. రాత్రి నా మీద భారంమోపి ఆ బురద

లోంచి బయటికి రావాలని ప్రయత్నిస్తుంది. కాని ఆమె చూపు మాత్రం నామీదలేదు. ఆమె రెప్ప వాల్చకుండా శూన్య దిగంతంలో కెక్కడికో చూస్తోంది'....

హఠాత్తుగా టకటకమని తలుపుగొళ్ళెం చప్పుడు కావటంతో దభీమని లేచికూర్చున్నాను. వచ్చి తలుపు తెరచి చూసేసరికి చేత్తో సూట్కేస్ పట్టుకుని రాత్రి నుంచునివుంది. కాసేపు ఆమె స్థిరంగా నాకేసి చూస్తూ నుంచుంది. నేనూ ఆమెకేసి అలాగే చూస్తూఊరుకున్నాను.

"వంశీ ప్రలాపన ఇంకా అలాగే ఉందా?"

"తగ్గింది"

మామూలు 'బ్రోమైడ్'తో ఇంత తొందరగా ఫలితం కన్పిస్తుందని నేను అనుకోక పోయినా మనస్సుకి మహా సంతృప్తి కలిగింది.

మీరు జ్యోతిర్మయబాబుని తీసుకురావటానికి వశారాకి వెడుతున్నారా?"

"ఆఁ, ఈ సూట్కేస్ మీ దగ్గరపెట్టి వెడదామనుకుంటున్నాను. మీకేమైనా అభ్యంతరమా?"

"ఊహు, ఏమాత్రం అభ్యంతరం లేదు"

సూట్కేస్ ఒకటి చేతపట్టుకుని జ్యోతిర్మయబాబుని తీసుకురావటానికి బయలుదేరటంలో కారణమేమిటో! పోనీ కారణం వున్నా మధ్య దారిలో ఆసూట్కేస్ని నా యింట్లో పెట్టి వెళ్ళవలసిన అవసరమేమిటో, ఇలాంటి అతిసముచితమైన ప్రశ్నలు అప్పుడు నా మనస్సుకి తట్టనేలేదు. నేనారోజున స్వప్నావిష్టుడినై ఉన్నాను. వాస్తవిక జగత్తుకి సంబంధించిన

సముచితా సముచితాలనేవాటికి అప్పుడు నా దృష్టిలో అర్థం లేదు. పోలీసుచేతుల్లో ఉత్తరం యెక్కడ పడుతుందో అన్న భయంతోనే ఆ ఉత్తరాన్ని సూట్ కేస్ లో పెట్టుకుని వచ్చిందని, కొంతదూరం వచ్చాక ఆ ఉత్తరం జ్యోతిర్మయబాబు కంట పడుతుందేమో అనే అనుమానం కలిగి ఆ పెట్టెని నా యింట్లో పెట్టిందనీ ఇప్పుడు తెలుసుకున్నాను. ఆ ఉత్తరాన్ని ఎందుకు చించి పారెయ్యలేకపోయిందో, అదిమాత్రం ఇప్పటికీ నాకు బోధపడలేదు. బహుశా ఆ ఉత్తరాన్ని ధర్మపరాయణురాలైన తన తల్లి కాదటానికి వీల్లేని 'డాక్యుమెంట్'గా ఉపయోగించటానికి ఉంచిందనుకుంటా...అయితే ఇదంతా నా ఊహామాత్రమే సుమీ!

రాత్రి వెళ్ళిపోయింది. స్టేషన్నుంచి జ్యోతిర్మయుణ్ణి తీసుకుని మళ్ళీరాలేదు. జ్యోతిర్మయుడికి సవితను కలుసుకునే అవకాశాన్నే కలగనీయలేదామె. నాలుగు మాసాలకి వచ్చింది మళ్ళీ అప్పుడామె వెంట జ్యోతిర్మయుడులేడు. అవనీశు డున్నాడు అతడుకూడా ఎంతోసేపు ఉండలేదు. రాత్రిని దిగబెట్టి అతడు ఆ తర్వాతి రైలులోనే బొంబాయి వెళ్ళిపోయాడు. వ్యాపారస్తుడతడు. వృథాచేసేందుకు సమయమంటూ ఉండదతడికి

రాత్రి నాదగ్గర విడిచిపెట్టి వెళ్ళిన సూట్ కేసు...హఠాత్తుగా నా మనస్సులో జ్యోతిర్మయుడి రూపం కన్పించింది. సరేకాని, ఇలా ఎందుకు జరుగుతూంటుందో చెప్పగలరా? ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తున్నప్పుడు – మధ్యలో మరొక విషయం హఠాత్తుగా స్ఫురణకివస్తూ ఉంటుంది – ఒక చిత్రకు

వును ప్రక్కకుబెట్టి. మరొకచి త్రువు దానంతటది ముందుకు రావాలని ప్రయత్నించటమా?...జ్యోతిర్మయుడ్ని నేనెప్పుడూ చూడలేదు, కాని అతణ్ణిగురించిమాత్రం చాలా విన్నాను. అతడ్ని నేను ఎప్పుడు ఊహించుకున్నా – అతడు పెద్ద విలువైన కార్లో 'ఫుల్ స్పీడ్'లో పోతున్నట్లు కన్పిస్తాడు. తెల్లటి ముఖం. పెద్దపెద్ద కళ్ళు, ఎప్పుడూ పెదవులమధ్యన ఉండే పొడగాటి నల్లటి సిగరెట్ హోల్డర్, రయ్యిన గాలి వీస్తూంటే, బయ్యిన కారుని పరుగెత్తిస్తూ జుట్టుఎగిరిపోతూ స్టీరింగ్ పట్టుకొని ఎదుటకు చూస్తూ కూర్చున్నట్లే కన్పిస్తాడు. అతడటూ – యిటూ ఎవరికేసీ చూడడు. కారు సరీగ్గా ఉందా లేదా అన్న ఆలోచనకూడా ఉండదు. ప్రక్కన ఎవరు కూర్చున్నారో ఆ దృష్టే ఉండదు. అతడు రైయ్యిన కారులో పోతున్నట్లే కన్పిస్తాడు.

రాత్రి ఆ రోజున నా దగ్గరపెట్టి పోయిన సూట్ కేస్‌ని ఆ తర్వాత ఇంచుమించు మూడేళ్ళకి తెరిచాను – అంటే తెరచకతప్పనిసరి అయిందన్నమాట! అందులో రాత్రివే ఒకటో రెండో చీరెలు, బ్లౌజులూ, ఒక ఉత్తరమూమాత్రంఉన్నాయి. రాత్రి తల్లి పూర్ణేందుబాబుకి రాసిన ఉత్తరం అది. ఆనాటి రాత్రి ఏం జరిగిందో చెప్పటానికిముందు, నేనీ ఉత్తరంసంగతే చెప్పతలచింది! ఆ ఉత్తరం తప్పక పూర్ణేందుబాబుకి రాసిందే అని చెప్పటానికిక్కూడా తగిన ఆధారాలేమీ లేవు. ఉత్తరంలో 'శ్రీ వారికి' అని తప్ప, వేరే సంబోధనకూడా ఏమీలేదు. అయినా ఆ ఉత్తరంరాసిన ఫణితి, అందులో ఫర్నాండేస్‌ని గురించి ఉల్లేఖించటం, పశ్చాత్తాపంతో కూడిన ఆ నివేదన,

ఇవన్నీ చూశాక వాకిప్పుడు నిస్సందేహంగా తేలిపోయింది – అది రాత్రితల్లి పూర్ణేందుబాబుకి వ్రాసిన ఉత్తరమేనని నా ఊహ. కోర్టులోనే నీ విషయం ఋజువు చెయ్యలేకపోయినా, నా అంతర్యామికిమాత్రం నిస్సంశయంగా తెలుసు.

మా గోకుల్‌చంద్రుడు సెలవుమీదవెళ్ళి ఉండకపోయి నట్లయితే ఈపెట్టెని తెరవటమంటూ సంభవించేది కాదు. కేవలం అదేకాదు, గోకుల్ నీలూకంటె కొంచెం తెలివిగల వాడి కెవడికైనా దీన్ని ఇచ్చివెళ్ళినా సాధ్యమయేది కాదు. ఇహ మూడోది, ముఖ్యమైనదీ ఏమిటంటే – అసలీ పరిస్థితి కలగటానికి గయలో హఠాత్తుగా నాచిన్ననాటి స్నేహితుడు డి. కె. ని కలుసుకోవటమే కారణం. అదొక విచిత్రమైన కల యిక. నా 'క్లయింట్స్'లో ఓ శ్రీమంతుడు పితృదేవతలికి పిండప్రదానం చెయ్యటానికి గయ వెళ్ళాడు. గయకి వెళ్ళాక అతడికక్కడ సుస్తీచేసింది, అక్కడుండే డాక్టర్లమీద విశ్వాసంకుదరక – ఈ విశ్వాసమనేది ఓ విచిత్రమైన వస్తువు – నాకు టెలిగ్రాం ఇచ్చాడు. నేను వెళ్ళాను, చికిత్సచేశాను, అతడి ఒంట్లో వస్తుతః ఉన్నశక్తి ప్రాబల్యంతోనే బహుశా అది నయమైఉంటుంది. అయినా నేను మాత్రం కాస్త కీర్తి, కాస్త డబ్బు మూటకట్టుకుని సంతోషంతో తిరిగివచ్చే ప్రయ త్నంలో ఉండగా, రోడ్డుమీద హఠాత్తుగా వ్యాయామవీరు డైన ధీరేంద్రకుమార్ కలిశాడు. ధీరేన్‌ని ఇదివరలో ఒకటి రెండుసార్లు చూచిఉన్నాను. ఒకటి రెండుసార్లతడు మా యిం టికే వచ్చాడు. అంచేత కన్పడగానే ఒకర్నొకరం సులభంగానే గుర్తించుకున్నాం. మామూలు దుస్తులువేసుకుని ఉన్నప్పుడు

ధీరేన్ వ్యాయామప్రవీణుడని తెలుసుకోటానికి అవకాశం ఉండదు. నేపాలీయుల పద్ధతిని మీసాలులేని అతడి ముఖం, అతడి పెదవులమీద చిరునవ్వూ చూస్తే అతడో బ్రహ్మాండమైన వస్తాదన్న సంగతి తెలుసుకోలేం. అతడికొక అభిప్రాయం మనస్సులో ఏర్పడిందంటే దాన్ని మార్చటం ఎవరికీ సాధ్యం కాదు. గయలో ఆ దుమ్మురేగిన రోడ్డుమీద నన్ను చూడగానే డి. కె. చటుక్కున ఆగి, ఒక్కక్షణం అలాగే నిలబడి పోయాడు; మరుక్షణంలో ఏ మాలోచించుకున్నాడో మాంచి ఉల్లాసంగా ఉన్నాడు – తలవని తలంపుగా నేను కనపడటంవల్ల కాదు – దానికి వేరేకారణం ఉంది నేను గయకి ఎందుకు వచ్చానో స్పష్టంగా చెప్పేసెయ్యగానే 'అద్భుతంగా కలుసుకున్నాం' అంటూ ఏదో అనేసి, డి. కె. ఆనందంలో తన్ను తాను మరచిపోయే స్థితికిజారటం మొదలెట్టాడు. అంతే. నేను నిస్సంశయంగా తనతో తాజ్‌మహల్ చూడటానికి ఆగ్రా వస్తాననే నిశ్చయంలో ఉన్నాడతడు. హఠాత్తుగా ఈ కలుసుకోవటం అతడికి ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించింది. నేను తనవెంట వస్తాను – అంటే తనశక్తి విషయంలో ఆతడికి రవంత కూడా సందేహంలేదు.... తాను వేటాడతలచిన జంతువుమీద ఎలాగో అలా ఒక దెబ్బపడగానే వేటకాడా జంతువు విషయంలో ఎంత నిశ్చింతగా ఉంటాడో, నేను కంటపడగానే ధీరేన్‌కూడా అంత నిశ్చింతుడై 'హాసీ ఓసాటి బెంగాలీవాని సాయం దొరికింది' అని అనుకున్నాడు. బెంగాలీవాని సాయం లేకపోతే అతడి యాత్రకి భంగంకలుగుతుందని కాదు, కాని మనస్సులో ఒకసారి కలిగిన అభిప్రాయానికి మార్పు అనేది

రాకపోవటం ధీరేన్ స్వభావం. సాధారణంగా బెంగాలీలు వివాహ సందర్భంలో ఒకసారి, చనిపోయేముందు ఒకసారి ఫొటో తీయించుకుంటారు. అలాగే యాత్రలుకూడా చేస్తారు-ఉద్యోగ ధర్మంలోనో లేదా వ్యాపారరీత్యానో, లేదా మంచి స్థితికలవారు వృద్ధులైనాక ధర్మచింతనలో తీర్థయాత్ర చేస్తారు. ఊరికే తాజ్ మహాల్ చూడటానికని డబ్బు ఖర్చుపెట్టుకుని ఆగ్రావెళ్ళటం – అనే ఆలోచనకూడా బాంగ్లాజాతికి హాస్యాస్పదంగాకన్పిస్తుంది. నిజమైనవీ, నిజంకానివీ కొన్ని కారణాలు గుచ్చెత్తి చూపుతూ నా అభ్యంతరాన్ని వెలిబుచ్చాను. కాని ధీరేన్ మనస్సులో ఏర్పడిన నిశ్చయం అంతమాత్రానికి చలించేదికాదు. అదీకాక ఎలాంటి యెత్తువేస్తే బెంగాలీలు చిత్తయేదీ అతడికి బాగా తెలుసు. అతడేం మాట్లాడకుండా ముందుకివచ్చి, నాభుజం మీద చెయ్యేసి, నాటిక్కెట్టూ, అంతకుముందే నాకు వచ్చిన 'చెక్'తో సహా మనీపర్సు – జేబులోంచి తీసుకుని తన జేబులో పెట్టుకుని ముసిముసినవ్వులు నవ్వటం మొదలెట్టాడు. డి. కె. పహిల్వాన్. తలమీద ఇనపకమ్ములు పెట్టుకుని వంచగలడు, రొమ్ములమీద ఫోర్డ్ కారుని ఎక్కించుకోగలడు. అలాంటివాడి దగ్గిర్నుంచి బలవంతంగా లాక్కోవాలని ప్రయత్నించటం వృథా. నేను కాస్తదిగజారి "నేను ఇంచుమించు కట్టుకున్నబట్టతో వచ్చేశాను భాయీ! అంత మరీ రాకతప్పదంటే కనీసం ముందు కలకత్తా వెళ్ళి, అక్కడినుంచి గుడ్డలవీ అయినా తెచ్చుకుని వస్తానుపోనీ" అన్నాను.

డి. కె. మరొకసారి చిరునవ్వు నవ్వుతూ నాకేసి చూచాడు.

ఇద్దరం మాట్లాడకుండా నడవటం మొదలెట్టాం.

పోస్టు ఆఫీసు దగ్గరకొచ్చాక "కాసేపాగు" అన్నాడు ధీరేన్.

ఆగాను, పారిపోయేందుకు మార్గంలేదు. అతడిదగ్గ ర్నుంచి. పదినిమిషాలయినాక పోస్టు ఆఫీసునుంచి బయటికివచ్చి, "పద" అన్నాడు.

"ఎక్కడికి?"

"స్టేషనికి. అక్కడే దిగాను నేను"

ధీరేన్‌కి దేశాటనపిచ్చి పట్టుకుంది. "రెండుమాసా ల్నుంచి తిరుగుతున్నాను" అని చెప్పాడు. స్టేషంలోకి వచ్చాక "నిన్ను ఆగ్రానుంచి పంపించేస్తానులే. నాకు కేదారం, బదరీ నాథ్‌దాకా పోవాలనివుంది. ఒంటరిగా వెళ్ళటం మనస్సుకేం బాగాలేదే అనుకుంటూండగా నువ్వు కన్పించావ్" అన్నాడు.

"మరినాకు గుడ్డలూ అవీ యేవీ దగ్గరలేవే!"

"రాత్రి పదకొండింటికల్లా అన్నీవస్తాయి. నే నెరిగిఉన్న వ్యక్తి ఒకరు వస్తున్నారివాళ. మీయింటిదగ్గిర్నుంచి గుడ్డలూ అవీ తీసుకురమ్మని అతడికి టెలిగ్రాం ఇచ్చాను. కంగారు దేనికి? అంతగా రాకపోతే కొనుక్కుని వెడదాం. నేను ఇస్తానేడబ్బు"

వేటకాడిచేతిలోంచి విముక్తి లభించలేదు.

మాయింట్లో యిప్పుడు గోకుల్ లేడు. నీలూఉన్నాడు. గోకుల్ ఉంటే నాపేరురాసిఉన్న నల్లట్రంకు వచ్చిపడుతుంది. కానీ నీలూఉన్నాడు కనుక ఆ సూట్‌కేసువస్తుంది — మూడు

మాసాలక్రితం తెల్లవారకట్ల చాటుగావచ్చి రాత్రి మా యింట్లో పెట్టిపోయిన సూట్ కేసు...

  

ధీరేన్‌తో అబద్ధమాడాను. నాదగ్గిర అసలు గుడ్డలేమీ లేకపోలేదు, కొద్దిగాఉన్నాయి. ఆగ్రాలోని దుమ్ముకి రెండు రోజుల్లోనే అవన్నీ మాసిపోయాయి. ధీరేన్ ఆరోజున ఇహ అక్కడినుంచి వెళ్ళబోతున్నాడు రైలుకి ఎంతో ఆలస్యంలేదు. తన సామానులన్నీ సర్దుకుంటున్నాడు. ఇంతలో హాఠాత్తుగా "నువ్వు ఆ సూట్ కేస్‌వచ్చాక ఒక్కసారికూడా దాన్ని తెరిచి నట్టులేదు. ఎంచేత?" అని అడిగాడు.

"దాని తాళంచెవి నా దగ్గిరలేదు"

"తాళంచెవి లేకపోయినంతమాత్రాన మాసినగుడ్డలు కట్టుకుని తిరుగుతావా?"

గదిలో మూలగావుంది సూట్ కేసు. డి. కె. దాని ముందుకు పోయి కూర్చుని నేనేమీ అనకముందే ఆ తాళాన్ని గట్టిగా చేత్తో పట్టుకులాగాడు. తాళం ఊడి చక్కా వచ్చింది. మరెవరైనా అయినట్లయితే పెట్టె మూతతీసి, అందులో ఏమేమి ఉన్నాయో అని చూసేవాళ్ళే. కాని ధీరేన్ స్వభావం అలాంటిది కానేకాదు. ఊడివచ్చినతాళాన్ని పక్కగాపారేసి, ఒకసారి నా ముఖంకేసిచూసి, మళ్ళీ ఏదో కూనిరాగం తీస్తూ తన సామానులు సర్దుకోవడం మొదలుపెట్టాడు. ఆరోజునే అతడు మధురమీదుగా హరిద్వారానికి వెళ్ళబోతున్నాడు. అక్కడినుంచి హృషీకేశం, లక్ష్మణ్ ఝూలా వెడతాట్ట! లక్ష్మణ ఝూలానుంచి కేదారం, బదరీనాథ్ వెడతాడు!

అతడు మనస్సులో ఏదో గొణుక్కుంటూ పాడుకుంటున్నాడు. ఆ చిన్న సూట్‌కేసులో ఏముందో చూద్దామనే కుతూహలమే కలగలేదు. తాళం ఊడివచ్చినా నేను వెంటనే లేచివెళ్ళి పెట్టె తెరవలేదు. అదీ అతడు గమనించలేదు. అతడి స్వభావమే అంత. కాసేపటికల్లా ఓ టాంగాని పిలుచుకువచ్చి, ధీరేన్‌ని స్టేషన్‌దాకా పంపివచ్చాను. "బదరీనాద్‌నుంచి తిరిగిరావటమంటూ ఉంటే కలకత్తా వచ్చి మళ్ళీ కలుసుకుంటాను నిన్ను" అని చెప్పాడు ధీరేన్. నేను ఆగ్రాలో ఇంకా ఒకటి రెండు రోజులు – ఆ దగ్గిరిలో చూడవలసినవన్నీ చూసిపోదామనే ఉద్దేశంతో – ఉండిపోయాను.

ఈ సందర్భంలోనే సిగరెట్లు కాల్చటం బాగా అలవాటున్న ఓ తెల్లదొర కథ జ్ఞాపకం వస్తోంది. కాని అతడిప్రవర్తనతో నా ప్రవర్తనని పోల్చి చూసుకుంటే – మనస్సులో సిగ్గేస్తోందని చెప్పవచ్చు. కాని – యథార్థం చెప్పాలంటే లజ్జావిహీనుణ్ణి నేను రాధారిబంగళాలో మకాంచేసి ఉండగా ఆ దొరగారిదగ్గర అగ్గిపెట్టె అయిపోయింది. దగ్గిరున్న దుకాణాల్లో ఎక్కడ అడిగినా 'మేడ్ ఇన్ ఇంగ్లండ్' అగ్గిపెట్టె దొరకలేదు. చుట్టుప్రక్కల నాలుగు మైళ్ళల్లో ఎక్కడా దొరకలేదు. సాయంత్రం స్టీమరేదో వస్తే, 'మేడ్ ఇన్ ఇంగ్లండు' అగ్గిపెట్టె అందులో దొరికింది. అప్పుడు మళ్ళీ సిగరెట్ కాల్చాడు. అంతవరకు – అంటే ఆ రోజల్లా సిగరెట్ కాల్చనే లేదు.

నా ఆదర్శనిష్ఠ చాలా దుర్బలమైనది. రవంత ఏమాత్రం ఒత్తిడి తగిలినా ఎక్కడిదక్కడ ఎగిరి చక్కాపోతుంది. డి. కె.

వెళ్ళిపోయాక రాత్రి సూట్ కేసు తెరిచి చూశాను. అందులో ఒకటి రెండు చీరెలు, బ్లౌజులు కాక ఓ ఉత్తరం ఉంది! ఎవరి ఉత్తరమైనా వారి అనుమతిలేందే చదవటం అనుచితమనేజ్ఞానం ఉండికూడా—ఆ ఉత్తరం చదివాను నేను. రాత్రి తల్లి పూర్ణేందు బాబుకి రాసిన ఉత్తరం అది . . .



మర్నాడుదయం సూర్యోదయాత్పూర్వమే – తాజ్ మహల్ పై స్తంభంమీద కూర్చుని ఉన్నాను నేను. వేసవి కాలం. ఇంచుమించు నిర్జలంగా ఉన్న యమునా నదిని చూస్తూంటే అది తన ప్రాచీనవైభవాన్ని స్మరించుకుంటూ, ఎలాగో ప్రాణాల్నిమాత్రం నిలబెట్టుకుని అలాగే పడి ఉన్నదా అని అనిపించసాగింది . . .

'ఆలంగీర్' ఊహించిన నల్లటి తాజ్ మహల్ యమునా నది కవతల ఒడ్డున నిజంగానే నిర్మించబడినట్లయితే అది ఎలా ఉండి ఉండేదా అని ఊహించటానికి ప్రయత్నించసాగాను. తాజ్ మహల్ లోని వృద్ధపరిచారకుల 'అల్లా' ఉచ్చారణ తాలూకు ప్రతిధ్వనులు అతిజాలిగా విన్పిస్తున్నాయి చెవులకి. షాజ్ హాన్ వచ్చి కూర్చునే ఆగ్రా కోటలోని ఆ ప్రదేశం గుర్తుకొచ్చింది. ఆ గోడలోని ప్రతిరాయిలోనూ తాజమహల్ రూపం ప్రతిబింబిస్తూ ఉంది . . . చటుక్కున మనస్సులోంచి ఈ ఊహాంతా అవలుప్తమైపోయి. ఆ ఉత్తరం గుర్తుకొచ్చింది. ఉత్తరం జేబులోనేవుంది. మళ్ళీ తీసి చదివాను. అర్థం తెలిసినా తెలియనట్లుండే ఆ ఉత్తరంలోని ఆ భాగాన్ని మళ్ళీ మళ్ళీ చదివాను.

మీరు లేనప్పుడు, మీ అనుమతికూడా తీసుకోకుండా ఫర్నాండెజ్‌ని మాత్రమే తీసుకుని నేను శివసముద్రం చూడటానికెందుకు వెళ్ళానో, అక్కడ రెండురోజులెందుకు ఆలస్యం చెయ్యాల్సి వచ్చిందో—వీటన్నిటికీ మీదగ్గిర సంజాయిషీ చెప్పుకోవాల్సిన బాధ్యత నాకు లేదన్న సంగతి మీకు తెలుసు అన్నీ తెలిసి ఉండికూడా మీరు సంజాయిషీ కోరాలని ప్రయత్నిస్తున్నారు. మీరు పురుషులు. ఉద్రేకంలో ఏవ ప్రతిజ్ఞలైతే చేస్తారో, ఆ ఉద్రేకం చల్లారగానే వాటిని నిలబెట్టుకోవాలంటే; వచ్చే ఒడిదుడుకుల్ని మాత్రం సహించటానికి ప్రయత్నించరు. మీరు ఒకానొకప్పుడు నేనేం చేసినా దానికి అడ్డురానని నాముందు గద్గదకంఠంతో, శంతనుడి లాగా ప్రతిజ్ఞ చేసిన సంగతి సునాయాసంగానే మరిచిపోయినట్లున్నారు. పైగా ఇప్పుడు ఖచ్చితంగా సంజాయిషీ గావాలని కోరుతున్నారు. న్యాయతః ధర్మతః సంజాయిషీ కోరటానికి హక్కున్నవారెవరో వారు పొరపాటునకూడా అలా ఎప్పుడూ అడగలేదు. అడగబోరు కూడా. దీనికి మూర్తీభవించిన సంజాయిషీ మీరేనని వీరికి మాత్రం తెలియదా!.....

ఈ కొద్దిమాటల్లో నిగూఢంగా ఉన్న యథార్థవిషయం ఏమిటో నాకు దాన్ని స్పష్టంగా వ్యక్తపరిచే సాహసమూ లేదు, అలాంటివాంఛా లేదు. చీకటిరాత్రివేళ చెట్టుని దయ్యం అనుకుని, మేఘాన్ని పర్వతమని భ్రాంతిపడటం అసంభవం కాదు. అయినా నేను భ్రమపడటంలేదని నాకు తెలుసు. రాత్రిని ఈవిషయమై ఎప్పుడూ – ఆ అధికారం సంప్రాప్త

మయినా – ప్రశ్నించలేదు. సూట్ కేసుని మామూలుగా మళ్ళీ అలాంటితాళమే వేసి, నిర్లిప్తుడిలాగా తిరిగి ఆమెకి ఇచ్చేశాను.

ఉత్తరం చదివాక యమున కవతలిఒడ్డున నల్లటి తాజ మహల్ తాలూకు నిగనిగ కాంతి నా ఊహలో మూర్తీభవించింది. మళ్ళీ – అందులో ఎక్కడా రవ్వంతయినా తెలుపనేది లేదు. మొత్తం అంతా నల్లటినలుపే... తర్వాత మళ్ళీ నేను తెల్లటి తాజ్‌మహల్ తాలూకు ఓ ఎత్తైన స్తంభంమీద కూర్చుని సూర్యోదయాన్ని చూస్తున్నానని, నల్లటి తాజ్ మహల్ అనేది కేవలం ఊహామాత్రమే నని చటుక్కున స్ఫురించింది.

ఆరోజున వేకువజాము వేళ, రాత్రి సూట్ కేస్ తీసుకు వచ్చి నాకప్పగించి వెళ్ళిపోయాక నేను కాసేపు అలాగే చూస్తూ నిలబడిపోయాను తలవనితలంపుగా రాత్రి వచ్చి వెళ్ళిపోవటం, మూడుమోతాదుల మామూలు బ్రోమైడ్ మిక్చర్ అంత శక్తివంతంగా పనిచెయ్యటం, దాంతో నాకు కాస్తగర్వం కలగటం, నా ఆఫీసుగదిలోకి క్రొత్తగా కొన్న లేత నీలిరంగుబల్బు కాంతి మామీద పడటం, కొన్ని ఫ్యాక్టరీలు, కలసి ఒక్కసారిగా కెవ్వుమనికూతలు వెయ్యటం – వీటన్నిటితో అదొక కొత్త వేకువలా ఉంది.

నే నీ వీధిలో ఉంటున్నప్పట్నించీ, వేకువజామునుంచి విడతీయటానికి వీల్లేని వాటూ ఏవేవిఉన్నాయని అనుకుంటూ వచ్చానో, ఆ వేకువజాముతో ఒక్క ఫ్యాక్టరీలకూతలు తప్ప మిగిలినవన్నీ ఎలా విడివడిపోయాయో, నాకు తెలియలేదు. రోజూ ఆవేళప్పుడు పెంటపోగుల్ని ఎత్తుకుపోయే కార్పొరేషన్

లాగే డబడబలాడుతూ పోతూఉంటుంది. ప్రక్కయింటి దాసీది టకటకమని గొళ్ళెంకొడుతూ ఉంటుంది. ఎదుటింటిద్వారికా బాబు ఖర్ ఖర్ మని దగ్గుతూ చుట్టకాలుస్తూంటాడు. బడబడ మని మంత్రాలుచదువుతూ ఓ ముశా గంగాస్నానానికి పోతూ ఉంటుంది. గలగలమంటూ కుళాయిల్లోకి నీళ్లువస్తూఉంటాయి. ఆనాటి వేకువనకూడా ఇవన్నీ తప్పకజరిగే ఉంటాయి. కాని నా మనస్సు సచేతనంగానే ఉన్నా ఇవన్నీ పట్టివుండవు. ఆ నాటి వేకువ గగనేంద్రఠాకూర్ చిత్రపువులోని విశిష్టతలాగా నామనస్సులో ఇప్పటికీ అపురూపంగా ముద్రితమయేఉంది. రాత్రి ఆ నీలిరంగు బల్బువెలుగులోకి వచ్చి నుంచుని, వంశీ ప్రలాపన తగ్గిందనిచెప్పటం వినేసరికి నామనస్సు పురివిప్పుకున్న ట్లయింది. అయినా రాత్రి నిశ్చలదృష్టిలో నే నాశించిన ప్రశంస ఆభాసమాత్రంగానైనా లేక పోవటంతో నా మనస్సు కొంచెం చివుక్కుమంది. అయితే యేం; అది రాత్రి గంభీర స్వభావానికి సూచకమై ఉంటుందని సరిపెట్టుకోవటంతో మన స్సుకు మళ్ళీ ఊరటచిక్కింది. నిశ్శబ్దతని చీల్చుకుంటూ ఫ్యాక్టరీ కూతలు వినవచ్చాయి. రాత్రి వెళ్ళిపోయింది.

అప్పుడు నా ఊహాకితట్టిన సంగతులు బాగా జ్ఞాపకం ఉన్నాయి. కలకత్తాలాంటి మహానగరంలో – భూమి, ఆకాశం, గ్రహాలు, ఉపగ్రహాలు, నక్షత్రాలు ఇలాంటివాటన్నిటికీ సమ న్వయమనేది లేదు...బజార్లలో నేతప్ప చెట్లనిపూలుపూయని చోట, పంజరాల్లోనేతప్ప గూళ్ళలోపక్షులు నివసించనిచోట, అజ్ఞాతంగానో, జ్ఞాతంగానో అందరూవ్యామోహాల్లోపడి తమ్ము తాము మరిచిపోయేచోట, మనఃస్వాస్థ్యం అనేది పరిహాసాస్ప

దంగా పరిణమించిన చోట, స్త్రీల స్త్రీత్వం, కవుల కవిత్వం, మనుష్యుల మనుష్యత్వం అమ్మక పువస్తువుల జాబితాలో చేరిపోయిన చోట ట్రాముల్లో, బస్సుల్లో, సినిమాల్లో, పెద్దవీధుల్లో, చిన్న సందుల్లో ఎక్కడపడితే అక్కడ స్త్రీ బాలవృద్ధుల నిర్జీవ మనస్తత్వంతాలూకు నిస్తేజమైన ఉబలాటాన్ని ఆనందమని అనుకుని కృత్రిమ ఉల్లాసాన్ని వ్యక్తపరచే చోట - అలాంటి కలకత్తా మహానగరంమధ్య ఇలాంటి వేకువ ఎలా సంభవమయింది? మనస్సు కాశ్చర్యం వేసింది. ఏదో ఒక స్వప్నసులభమైన ఆనందంతో వివశుణ్ణి అయిపోయాను. సంపూర్ణంగా విస్మృతుణ్ణయి పోయాను. వర్తమానయుగంలోని ఉన్మత్త జనబాహుళ్యంలో నేనూ ఒకణ్ణి, నేను ఏ ఆనందంలో వివశుణ్ణి అయానో అది వర్తమాన యుగంలో సులభసాధ్యమైన స్వాప్నికానందమే. అంతకన్న బలిష్ఠమైనదేమీ కాదు.

కొంతసేపయాక నాతాత్తుగా మళ్ళీ నాలోకి నేను వచ్చి చూసుకునేసరికి, ఆ నీలిరంగుబల్బు వెలుగులో ఓ ఈజీచైర్‌లో పడుకుని లోబర్ న్యుమోనియాకి సంబంధించిన పరిజ్ఞానాన్ని తాపీగా నెమరువేసుకుంటున్నాను. . వంశీని బ్రతికించటానికి నా తెలివి, పరిజ్ఞానం, చదువు-అన్నీ ఏకమై విజృంభించాయి. రాత్రిది గంభీర ప్రకృతయితే అవుగాక, వంశీని నిజంగా బ్రతికించగలిగానంటే, అంతుచిక్కని ఆమె మనస్సముద్రంలో ఒక్క కృతజ్ఞతాకెరటమైనా కదలకపోతుందా! ఆమె నిష్పలక దృష్టిలో కించిత్ కోమలత్వమైనా తొంగిచూడకపోతుందా? ఎంతసేపు అలా పడుకుని ఉన్నానో గుర్తులేదు. ఏదో ఒక తీవ్రానుభూతి తాలూకు ఆఘాతంలో లేచి కూర్చోకపోయి

నట్లయితే, బహుశా ఇంకా చాలాసేపు అలాగే పడుకుని ఉండేవాణ్నేమో! విపరీతమైన ఆకలివెయ్యసాగింది. రాత్రంతా ఏమీ తినలేదు. కుప్పగాపడివున్న డాక్టరీ పుస్తకాలన్నిటినీ చటుక్కున విసుగ్గా అవతలికి నెట్టేసి గోకుల్‌ని అవసరంగానే బిగ్గరగా కేకేసి, దీపం ఆర్పేసి, కుర్చీలోంచి లేచినిలబడ్డాను. తలుపు తెరవగానే - ఎలక్ట్రిక్ బల్బు కాంతికి భయపడి ఇంతసేపటివరకూ బయటనే నిలబడిఉన్నట్లు - వేకువవెలుగు సంకోచిస్తూ సంకోచిస్తూనే గదిలోకి వచ్చేసింది.

నా ఆదేశాన్ని విని గోకుల్ సంతోషించాడు. మనస్సులో ఆశ్చర్యపడికూడా ఉంటాడు బహుశా. 'విపరీతమైన ఆకలేస్తుంది; తినేందుకేమైనా తెచ్చిపెట్టు' - ఇంతకన్నా ఆనందదాయకమైన, ఆశ్చర్యకరమైన సంఘటన గోకుల్‌జీవితంలో తరచు సంభవించదు. అతడు నాచేత కడుపునిండా తినిపించటానికి రోజూ ఎంతగానో బతిమాలాల్సివచ్చేది, ప్రాధేయపడాల్సి వచ్చేది, ఎన్నో ఉపాయాలు పన్నాల్సి వచ్చేది. చిన్నపిల్లలు అన్నం తినటానికి ఎన్నివిధాల మారాంచేసి, తల్లిని ఎలా మాయపుచ్చుతారో నేనూ అలాగే గోకుల్‌ని మాయపుచ్చుతున్నానని అతడి నమ్మకం. గోకుల్ మహాసంతోషంతో ఓ నాన్‌రొట్టె తెచ్చి ముక్కలు కోస్తూ కూర్చున్నాడు. కొంచెంసేపయ్యాక వినిపించిన చప్పుడును బట్టి కోడిగుడ్డుకూడా కొట్టి ఇస్తున్నాడని గ్రహించాను. నా కేమేమి ఇష్టమో గోకుల్‌కి తెలుసు. వాడు మగవాడుకాడు-మాతృమూర్తి...

ఇప్పుడు నా కనిపిస్తోంది - ఆ రోజున ఈ ఆలస్యమంతా అవకపోయినట్లయితే - హఠాత్తు రాత్రి రావటం, సూట్‌కేసు

అప్పగించి వెళ్ళిపోవటం ఈ సామాన్యసంఘటన ఆరోజున నన్నంత స్వప్నావిష్టుణ్ణిచేయకపోయినట్లయితే, పెద్దపెద్ద వైద్య గ్రంధాల్ని చుట్టూపెట్టుకుని నేనంతసమయాన్ని వ్యర్థం చెయ్యకపోయినట్లయితే, ఆ అసమయంలో నా కంత ఆకలి వెయ్యకపోయినట్లయితే, రాత్రిని కలుసుకోవటానికి ముందే రాయ్‌గారింట్లో భోజనాలన్నీ అయిపోయినట్లయితే-హఠాత్తు ఏ అనివార్యసంఘటనలు జరగటంమూలంగా, నేను స్వర్ణేందు దగ్గిరకి వెళ్ళటం ఆలస్యమయిందో, అవన్నీ అలా జరగకపోయి నట్లయితే - బహుశా ఇది మరోకవిధంగా పర్యవసించిఉండేది. ఆలస్యం అయింది కనుకనే ఉదయం వాహ్యాళికి వెళ్ళి వస్తున్న ధరణీబాబుని కలుసుకోవటం తటస్థించింది. ఆయనేదో ప్రసంగం తీసుకొచ్చి మరింత ఆలస్యంచెయ్యనే చేశాడు. నా నోటిమీాదుగా అంతావిని, పూర్వపు స్నేహమర్యాదని కాపాడే నిమిత్తం నాతోరావటాని కిష్టపడ్డాడు. తాను కళ్ళారాచూాశాక న్యాయశాస్త్ర (Law) మర్యాదని రక్షించటానికి సిద్ధపడ్డాడు.

నేను స్నానంచేసి బ్రాకాఫ్ దువ్వుకుంటూాన్న సమయంలో గుమ్మందగ్గిర అలికిడి విని వెనక్కి తిరిగిచూశాను. చేతికర్ర చంకనిపెట్టుకుని, వంగి జేబురుమాలతో ఫ్లానల్ జోడుకి అంటు కున్న దుమ్మును దులుపుకుంటున్నాడు ధరణీబాబు. నన్ను చూసి చిరునవ్వునవ్వి, నా దొంగతనాన్ని ఏదో పట్టుకున్న ధోరణిలో "ఇవాళ అప్పుడే టీ తయారై పోయిందల్లే ఉంది. బ్రాహ్మడిచేత ప్రొద్దున్నే టీ తాగించి పుణ్యంకట్టుకుందామనే ఉద్దేశ్యమూా ఏం?" అని ప్రశ్నించాడు.

"దయచేయండి, కూర్చోండి" అన్నాను.

ధరణీబాబు టకటక లోపలికి వచ్చాడు.

నేను పరధ్యానంగానే ఉండివున్నప్పటికీ - అంటే నా మనస్సు ఒకవైపున ధరణీబాబు ప్రసంగంవైపుకి మొగ్గివున్నా, చాలావరకు నిశ్శబ్దం నేపథ్యంలో రాత్రిమీది ధ్యాసతో కిందు మీదవుతోంది. అయినప్పటికీ - ధరణీబాబు అన్న ఒకమాట చెవిని పడేసరికి రాత్రివైపు మొగ్గివున్న మనస్సు కూడా విశ్వాసఘాతుకత్వానికి ఒడిగట్టి ధరణీబాబువైపుకే మొగ్గింది. ఒక్కగుక్క టీ తాగి, ధరణీబాబు చాలా మనోరంజకమైన ప్రసంగాన్ని లేవదీశాడు.

ఒక్క ధరణీబాబుకేకాదు. మనలో చాలామంది జీవితాదర్శాలకీ - జీవిత యాత్రమధ్య ఆకాశానికీ పాతాళానికీ మధ్య వున్నంత వ్యత్యాసం వుంటుంది. వాస్తవమూ, అవాస్తవమూ అయిన వేదాంతపు రెక్కలు కట్టుకుని, ఏ భావనాకాశంలో మనం నిత్యమూ ఎగురుతూ ఉంటామో, నిజంగా ఎగిరిచూడబోయినప్పుడు ఆ ఆకాశంలో వాహ్యాళి మనకి వాస్తవ జగత్తులో లభ్యమయేదికాదనీ తెలిసిపోతుంది. ఎంచేతంటే మనం కట్టుకున్న రెక్కలు, మనం ఎగురుతున్న ఆకాశం - రెండూ కాల్పనికాలే. వాస్తవానికి బురదగుంటలోపడి కొట్టుకునే పురుగులాగా గిజగిజ లాడటంతప్ప గత్యంతరంలేదు. ఆపురుగు దుర్దశ ఎలాంటిదో మన దుర్దశా అంతే. ధరణీబాబుకి దారలంటే మంట. స్త్రీ విద్య అంటే మంట, బ్రహ్మసమాజమంటే మంట. సినిమాటార్చి, టాక్సీ - ఇలాంటి ఆధునిక విలాసాలేవన్నా అతడు మండిపడతాడు. అతడి మనస్సు కాల్పనికమైన రెక్కలతో ఏ యుగంలోని ఆకాశంలో ఎగురుతూ ఉంటుందో

ధరణీబాబు వైదికయుగమే అని అన్నా, నిజానికది శాయేస్తా ఖాన్ పరిపాలన యుగమేమో అనిపిస్తుంది. ఆ యుగంలో రూపాయకి ఎనిమిది మణుగుల బియ్యం యిచ్చేవారట! పాలు పెరుగు, కూర, నార అన్నీ బహు చవుకగా దొరికేవిట. ఆడ వాళ్ళకి ఘోషా ఉండేదిట! ఎవరికివారు కాకుండా, సమిష్టి కుటుంబంగా ఉంటూ అందరూ సుఖంగా హాయిగా దీర్ఘ జీవులై గ్రామాల్లో నివసిస్తూ వుండేవారట! ఆయుగస్వప్నంలో తేలుతూనే ధరణీబాబు వాస్తవజీవితంలో దొరలముందు తల వంచి, వారికింద నౌకరీ చెయ్యాల్సి వచ్చింది. పల్లెటూరు విడిచిపెట్టి, పట్నానికి రావాల్సివచ్చింది, సమిష్టికుటుంబం నుంచి వేరుపడాల్సి వచ్చింది, సినిమాలు చూడాల్సివచ్చింది. టార్చిలైట్ కొనాల్సివచ్చింది. తన చిన్నకూతుర్ని స్కూల్లో చేర్పించాల్సివచ్చింది. టాక్సీలు ఎక్కాల్సివచ్చింది. మరబియ్యం, నీళ్ళుకలిపినపాలు మండిపోయే ధరకు కొనాల్సివచ్చింది. శాయే స్తాఖాన్ పరిపాలనాకాలంలో ఎవరూ చెయ్యని పనులు ఇంకా ఎన్నో చేయాల్సి వచ్చింది. దీనివల్ల కలిగిన ఫలితాన్ని కుత్సిత మనస్తత్వ పరిణామం అని అనకతప్పదు. కాని పరిస్థితు లను కూలంగా ఉంటే మసిబొగ్గయినా మాణిక్యమవుతుందన్న మాట మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. నావిశ్వాసం ఏమంటే పరిస్థితు లనుకూలంగా ఉన్నట్లయితే ధరణీబాబు తాలూకు ఈ పరనిందా పరాయణత్వపు మనస్తత్వం వేదాంత ధోరణి లోకి మారి ఉండేది. అతడప్పుడింకేమీ కాకపోయినా, కనీసం జనప్రియుడైన సంపాదకుడైనా అయేవాడు. అప్పుడిహా

ప్రొద్దున. సాయంత్రం ఎవరి యిళ్ళకిపడితే వాళ్ళ ఇళ్ళలోకి పిడుగులాగా వచ్చిపడి, వర్తమాన యుగంలో తప్పనిసరిగా జీవించవలసి రావటంవల్ల కలిగిన వేదాంతక్షోభను, సోడా హారణంగా వ్యక్తంచేస్తూ తిరగాల్సిన అగత్యం ఉండేదికాదత డికి. ప్రజలే సభలూ సమావేశాలూ జరుపుతూ అతడ్ని అధ్యక్షునిగా పిలిచి తీసుకువచ్చి కూచోపెట్టి, ఆ వేదాంత సూక్తులన్నిటినీ చెవులు నిక్కించుకుని వినేవాళ్ళు.

ధరణీబాబు ఒక గుక్కకే చప్పరించి "ఇన్నాళ్ళనుంచీ మేఘాలచాటున ఉండి బాణాలు విసురుతున్న మేఘనాధు డేసారి మీాసం మెలేస్తూ సశరీరంగా సాక్షాత్కరించాడోయ్" అన్నాడు. ఇంతకు ముందుకూడా ఒకటి రెండుసార్లు ఈయన మేఘనాధుడి ప్రసక్తి తీసుకువచ్చాడు. అంచేత అతడు ధరణీ బాబు ఇంటికి ఎదుటి మేడలో ఉంటున వయసుకత్తెయైన వంతు లమ్మతాలూకు ప్రియుడనీ, ఇన్నాళ్ళ నుంచి చాటుగా ఉండి వ్యవహరిస్తున్నవాడల్లా, ఇప్పుడిహ ఆమెకి ప్రత్యక్షమైనాడని గ్రహించటాని కెంతోసేపు పట్టలేదు నాకు.

"అలాగా?" అన్నాను ఉత్సుకతతో.

మరొక గుక్క టీ తాగుదామని ధరణీబాబు కప్పుపైకి యెత్తాడు. కాని ఆ కప్పుని పెదిమలవరకూ రానీయకుండా అలాగే పట్టుకుని, చిరునవ్వుతో నాకేసి చూడసాగాడు.

"మీాకు ముఖంచూసి మనిషి ఆంతర్యంలో ఏమున్నది చెప్పగలరా? అయినా అన్ని సందర్భాల్లోనూ చెప్పలేము. కాని మనం అలా ఒక్కసారి చూస్తేచాలు చెప్పెయ్యగలం"

రెండో గుక్క తాగాడు. ఆయన దృష్టిలో - క్రొత్తగా పరిశోధనచేసి దేన్నయినా కనిపెట్టినవాని దృష్టిలో తొణికిస లాడే ఆనందం - తొణికిసలాడింది.

"ఇప్పుడే చూశాను 'సిడన్-బాడీ' టాక్సీ ఒకటి వచ్చి, ఆగిఉన్న దక్కడ. కిటికీలోకి టార్చిలైట్‌ను ఫోకుచేస్తూ..."

మరొక గుక్కకూడా తాగి మిగిలిని టీ సాసర్లో పోశాడు.

మర్యాదకోసమని తప్పనిసరిగా "ఇలాంటి వ్యవహారా లన్నీ ఈ రోజుల్లో అతిచిత్రంగా పర్యవసిస్తున్నాయి" అన్నాను.

నే నిలా అనటంతో స్త్రీ స్వాతంత్ర్యంమీద వేదాంత ధోరణిలో 'లెక్చర్' కొట్టే అవకాశం లభించింది. ఉద్వేగంలో సాసర్లో పోసిన టీ కాస్తా చప్పున తాగేసి, చేతులూ, మూతీ తుడుచుకుని, ఎన్నోసార్లు వినివిని ఉన్న ఆ వినసొంపైన మాట లనే మళ్ళీ చెప్పసాగాడు. నేను చిరునవ్వుతో తల ఊగిస్తూ వినటం మొదలెట్టాను. తర్వాత కాసేపటికే పైకి ఊం కొడు తున్నా స్వభావధర్మాన్ననుసరించి మళ్ళీ నా మనస్సు ఎక్క డికో పోయింది. ఆ పంతులమ్మ విషయమే ఆలోచిస్తున్నాను- 'అదృష్టవంతురాలు కనుక ఆమె కలకత్తాలో ఉద్యోగం చేస్తోంది. కలకత్తానగరంలో ఈ విశాల జనసముద్రంలో ఇలాంటి మురికినీటి బుడగలెన్నెన్నో ఉద్భవిస్తూ ఉంటాయి, నశిస్తూ ఉంటాయి. వాటినే పట్టుకుని ఎక్కువసేపు బుర్ర చెడ గొట్టుకోవాల్సిన అవసరం ఇక్కడెవరికీ లేదు. అదీకాక ఇక్కడ ఒకర్ని ఒకరు ఎవరూ లక్ష్యపెట్టరు. కాని ఈ మహిళామణి ఏదైనా ఓ దొరువులాంటి చిన్న బస్తీకెళ్ళి, ఇలాంటి బుడుగల్ని

సృష్టించటం మొదలెట్టినయితే - అక్కడ ఇలా దర్జాగా సిడన్ బాడీ టాక్సీ వచ్చి, కిటికీలోకి టార్చిలైట్ ఫోకస్ చేసినట్లయితే అక్కడుండే ధరణీబాబులికి ఈ మీసాలు మొలిపెట్టిన పీనుణ్ణి పట్టుకునే అవకాశం లభించి ఎంత రభసయినా జరిగేది. పల్లెటి దిక్కున ఉండే చిన్న చిన్న బస్తీల్లో అందరూ అందరికీ శ్రేయోభిలాషులే. కొంతమంది పనిలేని వృద్ధులు, యువకులూ అందరి విషయాలూ తెలుసుకోటానికి సర్వదా తాపత్రయపడుతూనే ఉంటారు. అలాంటి బస్తీల్లో ఉండే పంతులమ్మల్ని చూశాను నేను. వాళ్ళ సంగతి తలుచుకుంటే చాలా విచారం వేస్తూ ఉంటుందినాకు ఆ ఊళ్ళో ఉండేవాళ్ళంతా వారికి గార్డియన్‌లే. వాళ్ళు స్వతంత్రంగా ఎక్కడికీ వెళ్ళటానికి వీలుండదు. ఎవరితోనూ నవ్వుతూ సరదాగా మాట్లాడటానికి వీలుండదు. రాత్రి తొమ్మిది దాటాక ఇంట్లోతప్ప మరెక్కడా ఉండటానికి వీలుండదు - ఏమిటో రాత్రి తొమ్మిది లోపల ఎలాంటి దుర్ఘటనా జరగటానికి అవకాశం లేదన్నట్లు - పాపం, వాళ్ళు ఏం చెయ్యటానికీ వీలుండదు. అనేకమంది సంరక్షకులు హామేషా వాళ్ళ రాకపోకల్ని కనిపెడుతూనే ఉంటారు. వాళ్ళు చదువుకుని ఉండికూడా స్వాతంత్ర్యానికి నీళ్ళొదులుకొని, హాస్యాస్పదమయిన బురఖా ఒకటి తగిలించుకొని, జైల్లోఉన్నవారిలాగా రోజులు వెళ్ళతీస్తూ ఉంటారు.

ధరణీబాబుమాటతో చటుక్కున మళ్ళీచైతన్యంవచ్చింది.

"అరె! మీ పూర్ణేందుబాబుకు తురు - ఆ వయస్సుకే అంతవ్యవహారం జరిపిందేమిటోయ్!"

అప్పుడు నాకు తెలియదు. తర్వాత తెలిసింది. ఈధరణీ బాబే ఆమెకి ఓ ప్రేమలేఖ రాశాడు. ఆఁ. ఈ ధరణీబాబే — ఆమెతండ్రి స్నేహితుడు.

నే నక్కడనుంచి లేచాను.

"నేను వాళ్ళింటికి ఓసారి వెళ్ళిరావాలి. వంశీకి చాలా జబ్బుగా ఉంది."

"వాళ్ళిక్కడికి వచ్చారా యేమిటి?"

"ఊఁ."

"రాత్రికూడా వచ్చిందా?"

"వచ్చింది"

"ఎప్పుడు?"

"ఎప్పుడువచ్చిందీ సరిగ్గా తెలియదు."

చొక్కా తొడుక్కుని, చేతికి గడియారం కట్టుకుంటూ ఉండగా—"పద నేనుకూడా వచ్చిచూస్తాను. ఎంతచెడ్డా స్నేహితుడుకదా!"

అన్నాడు ధరణీబాబు.

అభ్యంతరం చెప్పలేకపోయాను.

ధరణీబాబు వెంట బయలుదేరాడు.



ఆరోజున ఉదయం జరిగినసంఘటనలన్నీ ఒకదానివెనుక ఒకటి అన్నీ జ్ఞాపకమున్నాయి నాకు. బయలుదేరాక గడియారంకేసి చూశాను. ఆరున్నరా వయింది. ఏ అనివార్య సంఘ

టనలమూలంగా నా కాలస్యమయిందో, ఆ సంఘటనలు జరగ కుండా ఉన్నట్లయితే నేను కనీసం ఓ గంటముందైనా వంశీ దగ్గరకి వెళ్ళేవాణ్ని. ధరణీబాబుని కలుసుకునేవాణ్ణికాదు. ఇప్పటికీ నా అభిప్రాయ మేమిటంటే. ఇదంతా ధరణీబాబుకి తెలియకుండా ఉన్నట్లయితే, ఇంతత్వరలో అందరికీ తెలిసేది కాదు. బహుశా మరొకవిధంగాకూడా జరిగేదేమో!... ఎందేతంటే ఇంట్లో ఎవ్వరూ లేనప్పుడు, ఆవేళకి వచ్చిఉండవల సిన దాసీదికూడా రాలేదింకా అప్పటికి. స్వర్ణేందుతల్లి ఇంట్లో లేదు. ఆమె మీర్జాపూర్ స్టేట్‌లో తన గురుదేవుడున్న యింటిదగ్గరుంది. నాకు తర్వాత తెలిసింది-అసలామె ఇక్కడికి రానేలేదట! గురుదేవునితో పాటు ముందు మీర్జాపూర్ స్టేట్‌కే వెళ్ళింది. రాయ్‌గారింటిదగ్గిర్నుంచి క్రితంరాత్రి నేను రాత్రితో ఇక్కడికివచ్చి ఆమెని చూసినప్పుడు, ఆమే అంతకుమునుపే వచ్చిందట! ఆమె పూర్ణేందుబాబునీ, వంశీని చూద్దామనికాదు. రాత్రినీ, జ్యోతిర్మయుణ్ణీ చూడాలని వచ్చింది. జ్యోతిర్మయు డసలు వచ్చాడో; లేదో చూద్దామని వచ్చింది. నేను అక్కడి నుంచి వచ్చేసిన కాస్సేప టికే ఆమె మళ్ళీ మీర్జాపూర్ స్టేట్‌కి గురుదేవుడిదగ్గిరకి వెళ్ళింది.

గడియారంమీదినుంచి దృష్టిమరల్చి చూసేసరికి-నల్లటి లుంగీ ఒకటి చుట్టుకుని రోడ్ల వెంట తిరిగే ఆ యెర్రటి యువ కుడు, రోజూలాగే ఇవాళకూడా, వీధివైపుకుండే కిటికీ అద్దపు ముక్కల్లో మొహంచూసుకుంటూ గడ్డం గీసుకుంటున్నాడు. ఆ కిటికీక్రిందే ఉన్న చిన్న కాలిబాటమీద పిల్లివకటి నుంచుని వుంది. అది తన పసుపుపచ్చటి గుడ్లను కాసేపుమావమీద నిలిపి

చూసి, అంతలో భయపడి చటుక్కున ప్రక్కసందులోకి పరు గెత్తింది. తర్వాత ఆ యింటి పెంపుడు చిలక బిగ్గరకా వీధిఅంతా ఉలిక్కిపడేట్టు అరిచింది. ఆ సందు మలుపుదగ్గరే ఓ కుళాయి ఉంది – ఆ పంపుదగ్గిర ప్రణయ కావ్యకలవరం ప్రారంభమైంది. ...అక్కడే మేకెడు అంట్లుతోముతూ వంగి నిలబడివున్న ఓ వయసు పనికత్తె చిరుగుల చీరలోంచి తొంగి చూస్తున్న పరిపక్వయౌవనశోభతో మత్తెక్కించేట్లున్న ఆ పరిసరాలమధ్య అల్లంత దూరంలో పండ్లమ్ముకొనేవాడొకడు నిలబడి ఈ పేటలోకల్లా చాలా తెలివైనవాడినని విర్రవీగే గోవిందబాబు గోరోజనాన్ని లెక్కచెయ్యకుండా డాగులుపడ్డ మామిడి పళ్ళని అతడికి అమ్మచూపుతూ "మీరు అన్నీ తెలిసినవారు కనుక ముందు మీ దగ్గరకే తీసుకొచ్చానుబాబూ ! మల్ గోవా మామిడిపళ్ళంటే ఈ కలకత్తాలో ఎంతమందికి తెలుసు నంటారు ?" అని అంటున్నాడు. ఈ మామిడిపళ్ళను చూచే సరికి బహుశా ధరణీబాబుకి మర్యాద పాటించాలనే ఆలోచన గుర్తుకొచ్చిం దనుకుంటాను "నీ దగ్గరేమైనా చిల్లరడబ్బు లున్నాయా డాక్టరూ !" అని అడిగాడు. జేబులోంచి పర్సు తీసి చూశాను. రాత్రి టాక్సీవాడికి ఇవ్వగా మిగిలిన చిల్లర డబ్బులేవో అవి మాత్రమే ఉన్నాయి. నేను టాక్సీడ్రైవర్ కి అయిదురూపాయలనోటు యిచ్చాను. అతడు తిరిగి యెంత ఇచ్చాడో లెక్కపెట్టి చూసుకునేట్టుగా లేదప్పుడు నామనస్సు. ఇప్పుడు చూస్తే ఓ అర్ధరూపాయి ఉంది. దాన్నితీసి ధరణీ బాబుకిచ్చాను. అది తీసుకుని నే నేంచెయ్యను ! వెళ్ళి కాసిని కమలాఫలాలైనా ఏమైనా కొందాంపద. జబ్బులో ఉన్నవాణ్ణి

పోరాటానికి వెడుతున్నవాళ్ళం, ఊరికే వెడితే యెలా? ఎంత చెడ్డా స్నేహితుడు కదా! లోకంకోసం, ధర్మంకోసం అయినా" ధరణీబాబు అక్కడితో ఆగి, కమలాఫలాలు కొనటానికి నే నేదో విరోధినైనట్లు నాకేసి చూశాడు. నే నేమీ మాట్లాడకుండా ఆయనవెంట నడిచాను. మూలమీద నున్న టీ దుకాణంలో చీకిపోయిన ఆయిల్‌క్లాత్ పరిచిఉన్న టేబిల్ చుట్టూ కొందరు కాతాదార్లు రోజూ లాగే ఇవాళకూడా యుద్ధవార్తల్ని చర్చించుకుంటూ టీ తాగుతూ కూర్చున్నారు. పెదవులమీద, కళ్ళమీద, వేళ్ళమీద బొల్లిమచ్చలున్న జ్యోతిష్కుడు కాలిబాటమీద రోజూలాగే పట్టాపరుచుకు కూర్చుని అటూ యిటూ చూస్తున్నాడు. శ్యాంబజార్ వైపుకి వెడుతున్న ట్రామ్ నెత్తిన 'ఎస్ప్లనేడ్' అనే బోర్డు త్రిప్పి ఉంది. డ్రైవరే పరధ్యానంగా ఉన్నాడో, లేక ట్రామ్ చెడి పోయి ఆగిందో మరి! కుడివైపు మొగలో మామగారి సహాయంతో ఫ్యాన్సీషాపు పెట్టిన కొత్త పెళ్ళికొడుకుని స్నేహం చేసుకోటానికని రోజూ ఓ యిరుకుగావున్న షాపులో ఓ చిన్న బెంచీమీదకొచ్చి కూర్చుని నవ్వుతూ బాతాఖానీ కొట్టే కుర్రాళ్ళలో ఆముంగిస మొహంవాడు, ఆ పిప్పళ్ళబస్తాలాంటి వాడూ ఇద్దరుమాత్రమే కన్పిస్తున్నా రివాళ . . .

ఎవరింట్లోనుంచో చూడలేదుగాని ఓ బొచ్చుకుక్క ఒకటి బయటికి వచ్చి కాలిబాటమీదనుంచి పరుగెత్తుతోంది. బల్లపరుపుగా ఉన్నదాని ముఖమంతా బొచ్చుతోనిండి ఉంది. కళ్ళు కన్పించటమే లేదు . . .

"వెళ్ళిపోకోయ్. ఆగు"

అవతలి కాలిబాటమీద కమలాఫలాలకొట్టు ధరణీ బాబు కంటపడింది. నన్ను రమ్మని చేత్తో సైగచేసి, అతడు రోడ్డుకడ్డంగా నడిచిపోతున్నాడు. మర తిప్పితే నడిచినట్లు - నే నతడివెంట నడవసాగాను. పశ్చిమ ప్రాంతీయుడైన ఆకొట్టు వాడితో వచ్చీరాని హిందీలో గీసిగీసి బేరమాడసాగా డతడు. నేను మెదలకుండా వింటూ ఊరుకున్నాను. చివరికి బేరంచేసి చేసి, రూపాయికి ఇరవైనాలుగు కంటె ఎక్కువివ్వనని అన్న వాడు ముప్ఫైరెండు ఇవ్వటానికి ఒప్పుకున్నాక, అర్థరూపాయి పళ్ళు కొన్నాడు ధరణిబాబు. ప్రక్కనున్న మరమరాల దుకాణంవాడిని ఓ కాగితపు సంచి మూట్టి అడిగి తీసుకున్నాడు.

ఇవీ, ఇలాంటివింకా చాలా సంఘటనలు ఆరోజున ఉదయం నా కళ్ళముందు జరిగాయి. వీటినన్నిటినీ ఎంతో ఓర్పుతోనూ, ఆనందాతిశయంలో సాధారణంగా మానవుల్లో ఓ క్రొత్తశక్తి కలుగుతుందే - అలాంటి శక్తిసహాయంతోనూ చూసీ చూడనట్లు ఊరుకోగలిగాను. నే నిచ్చిన మూడు బ్రోమైడ్ మిక్చర్ మోతాదులతోనే వంశీప్రలాపన తగ్గిపోయింది; ఆ సంగతి రాత్రే స్వయంగా వచ్చి నాతో చెప్పి వెళ్ళింది - ఇహ దాంతో నా మనస్సు, ఇలాంటి చిన్నచిన్న సంఘటనలేవీ నన్ను కదిలించటానికి వీల్లేని ఉత్తుంగ శిఖరాన్ని ఎక్కి కూచుంది.

మాన్యుమెంట్ మీద ఎక్కి నుంచున్నవ్యక్తి - వీధిలో నడుస్తున్న సాటిమనుష్యులు, ఇళ్ళు, బళ్ళు, కార్లూ - వీటన్నిటి తాలూకు విచిత్రమయిన కలయికని ఎంత నిర్లిప్తంగా, ఎంత

జాలిగా చూస్తూఉంటాడో, ఆ రోజున నేనుకూడా ఈ సంఘటనలన్నిటినీ అతి ఊర్ధ్వలోకంలోకూర్చుని ఉదాసీనదృష్టితో చూశాను. రాత్రి ముఖం రక్తతయినా చలించలేదనుకోండి. ఆమె నిర్నిమేష దృష్టిలో వీనపాలు చిరునవ్వయినా తొణకలేదనుకోండి, అయితేమాత్రం యేం. ఆరోజున కలకత్తానగరంలోని కలవరంమధ్యనుంచి 'వంశీప్రలాపన తగ్గింది' అన్నమాట నా చెవులకి ఎంతో మధురగీతంగా విన్పిస్తూనే ఉంది.

♦ ♦ ♦

స్వర్ణేందు ఇంటికి వెళ్ళేసరికి కించుమించు ఏడయింది. కాని అప్పటికీ ఆ చీకటిసందులోని చీకటి ఇంకా పూర్తిగా పోలేదు. వీధిచివరి యిల్లు నీళ్ళలోని ప్రతిబింబంలాగా కన్పిస్తోంది. సన్నగా, పొడుగ్గా, కొంచెం చీకటిగా ఉన్నసందు. అయినా ఆ సందులోంచి ఎక్కడనుంచో రివ గాలి కొడుతూనే ఉంది. రిజర్వాయరులోంచి వచ్చినట్లు పంపులో ఎక్కడనుంచో నీళ్ళు వస్తున్న ధ్వని విన్పిస్తోంది. ఆ ధ్వనితో శ్రుతికలిపి ప్రక్కయింట్లో ఎక్కడో పావురాలగూట్లోంచి ఒకపావురం తోటి పావురాన్ని పిలుస్తోంది. టకటక గంట చప్పుడుచేసుకుంటూ రిక్షావా డొకడు మెల్లిగా పోతున్నాడు.

ఆ సందులో ముందు అడుగుపెట్టగానే, ధరణీబాబు కమలాఫలాలు వేసి తెస్తున్న కాగితపుసంచి చిరిగి, రెండో మూడో క్రిందపడటంతో రసాభాస జరిగింది. వాటిని యెత్తబోయేసరికి ఇంకోనాలుగు కిందపడ్డాయి. ధరణీబాబు వంగి వాటినన్నిటినీ యెత్తుకుంటున్నాడు. ఈ నా క్లయింట్ వద్ది అబద్ధాలపుట్ట ఏమో అని సందేహం కలిగింది. గత మూడు

మాసాలనుంచీ నడుంనొప్పి అని నా దగ్గిర్నుంచి ఎన్నిమందులు తీసుకెళ్ళాడో అంతులేదు; కన్పించినప్పుడుమాత్రం 'మందులు గుణమివ్వలేదోయ్, నడుం వంగనియ్యటంలేందే!' అనేవాడు. అతడు చక్కగా వంగటం స్వయంగాచూశానిప్పుడు. ఆమాట పొరపాటునయినా ఒప్పుకోనివాడు, నా చేత మూడు నెలలు వైద్యం చేయించుకోవటం, నన్ను బాధపెట్టటానికేలాగుంది. మానవస్వభావం తాలూకు ఒక అంశం స్పష్టంగా తెలిసిం దిప్పుడు. కొంచెం పరధ్యానంలో పడ్డాను.

సందులోపలికి వెళ్ళగానే స్వర్ణేందుబాబు ఇంటితలు పులు తెరిచి ఉండటం కన్పించింది. గుమ్మానికి ప్రక్కగా పెద్ద తొట్టి ఒకటుంది. అందులోకి ఓ గొట్టంలోంచి ఎక్కడినుంచో నీళ్ళు వచ్చిపడుతున్నాయి. దాని ప్రక్కనే పైన కొక్కెం విరిగి పోయిన బాల్చీ ఒకటి పడివుంది.

ధరణీబాబు కమలాఫలాలన్నీ గుడ్డలో మూటకట్టు కున్నాడు. నేను ఏకాగ్రదృష్టితో తెరిచివున్న దర్వాజాకేసి చూడసాగాను. ఏమో, ఒకవేళ హఠాత్తుగా రాత్రే ఎదుకు వచ్చి లోపలికి తీసుకెడుతుందేమో, అపరిచితుడైన జ్యోతి ర్మయబాబు లోపలినుంచి బయటికివచ్చినా రావొచ్చు - అని ఆశించాను. వీళ్ళిద్దరూ వస్తారని ఆశించినట్లు నాకు బాగా గుర్తుంది. ఈ తలుపులు తెరిచివున్న గుమ్మంలోంచి స్వర్ణేందు రావటంకూడా అసంభవమేమీకాదు, కాని ఎంచేతో తెలి యదు. అతడు వస్తాడని మాత్రం ఆశించలేదు.

చివరికి ఎవరూ రాలేదు. ఆ కొద్ది వ్యవధానంలో వాళ్ళె వరూ రాకపోవటానికి సముచితమైన కారణంకూడా నే నేదో

ఊహించుకున్నట్లు జ్ఞాపకం .. రాత్రంతా మేల్కొని ఉండ వలసిరావటంవల్ల జ్యోతిర్మయిబాబు బహుశా నిద్రపోతున్నాడేమో!... రాత్రి బహుశా స్నానంచేస్తూ ఉండేమో!.... లేదా నిద్రపోతున్న వంశీ తలంపి దిక్కున మెల్లిగా విసురుతూ కూర్చుండేమో! రాత్రంతా మేల్కొని స్వర్ణేందుకూడా ఇప్పుడు కాస్త ఓ కునుకుపోతూన్నాడేమో!....

నేను ముందు లోపలికి వెళ్ళాను.

నా వెనకాలే ధరణీబాబు వచ్చాడు.

లోపలికి వెళ్ళగానే ముందు పూర్ణేందుబాబు సజీవ నేత్రం కంటపడింది. అతడు లేవటానికి శక్తి లేనివాడయినా ప్రక్కగదిలో ఏం జరిగిందీ తెలుసుకునే వీలులేకపోయినా. ఏదో అతీంద్రియ ప్రభావంవల్ల ఆయనకి ఆభాసమాత్రంగా అంతా తెలిసిపోయిందేమో అన్న ఆలోచన నాకు వచ్చినట్లు జ్ఞాపకం. 'ఏం జరిగింది? ప్రక్కగదిలో ఏంజరిగిందో తెలుసా నీకు?' అని ఆయన సజీవనేత్రం నన్ను నిగ్గతీసి అడుగుతున్నట్లు కన్పించింది.

ఆయన ప్రక్కదగ్గరే ఖాళీగావున్న కుర్చీ ఒకటుంది. ధరణీబాబు ముఖంలో ఒక అద్భుతమైన పరివర్తనను గమనించాను. క్షణంలో అతడి ముఖంలో పూర్వజీవితానికి సంబంధించిన ప్రభుభృత్య సంబంధంవల్ల కలిగే దాస్యభావం వ్యక్తమయింది. నోరంతా తెరిచి పెద్ద నవ్వొకటినవ్వి, సవినయంగా నమస్కరించాక, సంకోచిస్తూ కూర్చున్నాడా కుర్చీలో...

నేను ప్రక్కగదిలోకి వెళ్ళి నిర్ఘాంతుణ్ణయాను.

స్వర్ణేందు ఏదో హోలీ ఉత్సవంలో పాల్గొని ఉన్నట్లు, అతడి పంచెమీద, చొక్కామీద, పక్కమీద ఎక్కడ చూసినా ఎర్రటి మరకలే. రక్తం! రక్తం! ఎక్కడచూసినా రక్తమే! వంశీ కంఠంమీద పెద్ద గాయముంది. ప్రక్కనే రక్తసిక్తమైన కత్తి – ఫర్నాండెజ్ పుట్టినరోజు పండుగకి రాత్రికి బహుమతిగా పంపినకత్తి – పడివుంది. దానితాలూకు ఒర కూడా క్రిందపడి ఉంది.

"ఏమిటిదంతా!" అన్నమాటలు వెలువడ్డాయి నా నోట్లోంచి.

స్వర్ణేందు నా ముఖంకేసి చూస్తూ ఊరుకున్నాడు.

తర్వాత అతడి మామూలు చిరునవ్వు ఒకటి నవ్వి, "నేనే చేశాను" అన్నాడు.

## 6

తర్వాత సరిగ్గా వెంటనే ఏం జరిగిందో, అదినాకు స్పష్టంగా జ్ఞాపకం లేకపోలేదు. కాని అదంతా వివరంగా వ్రాయను నేను. విచారకరమైనదనే ఉద్దేశ్యంతో కాదు, ఈ కథకి అవాంతరవిషయం అవుతుందికనుక వ్రాయను. అదీకాక వ్రాయటానికి వీలైనంత పూసగుచ్చినట్లు ఆ సంగతులన్నీ జ్ఞాపకంకూడా లేవు. ఒక హత్యాకాండ జరిగాక, దాన్ని భయంకరమైనదనో, లేదా అలాంటి మరో జాతీయమైన విశేషణాన్ని దేన్నైనా దానికి తగిలించి మనం సాధారణంగా పెద్ద గడబిడ చేసి ఏమేంచేస్తూ ఉంటామో, ఈ సందర్భంలోకూడా దానికి వ్యతిక్రమమేమీ జరుగలేదు. పోలీసులు వచ్చారు, పత్రికల్లో

కొన్ని అబద్ధాలు, కొన్ని నిజాలు, కొన్ని ఊహామాత్రాలు కలిపి గుచ్చెత్తి పత్రికల్లోచ్చాయి. కేసూ అయింది. ధర్మాప్త్రా జరిగింది . . . ఇలాంటి పిడుగేదో పడుతుందని ధరణీబాబు తల పంకిస్తూ ఒకనాడు మరీమరీ చెప్పనే చెప్పాడు. కేవలం అంతేకాదు. దూరాలోచన లేకుండా ఇంత పెద్ద దుర్ఘటనని పైకి పొక్కకుండా అణచిపారెయ్యాలనికూడా ప్రయత్నించాను. ధరణీబాబు అడ్డుపడకపోయినట్లయితే, నేనది చెయ్యబోయి ఎలా పట్టుపడేవాణ్ణో, అడుంతా నా ముందర మెల్లిగా బయట పెడుతూ నా కృతజ్ఞతని పొందటానికి కూడా అతడు ప్రయత్నించాడు. ఎన్నెన్నో గుసగుసలు, పైకి చెప్పతగినవి, చెప్ప తగనివి అయిన అనేక ఆలోచనలు, ఉద్వేగ – అనుద్వేగాల నటన – వేటికీ లోపం జరగలేదు. న్యాయశాస్త్ర రథచక్రం గిర్రున తిరుగుతున్నప్పుడు సహజంగా ఎంత చప్పుడవుతుందో, ఎంత – దుమ్ము రేగుతుందో – అంతా జరిగింది. వాటినన్నిటినీ ఇక్కడ వర్ణించటం ఈ కథకి పూర్తిగా అనవసరం. నేను రాత్రి కథ వ్రాయటానికి కూర్చున్నాకాని, స్వర్ణేందు కథ రాయటానికి కాదు. రాత్రిని వికసింపచేసి చూపటానికి స్వర్ణేందు ప్రసక్తి తీసుకు రావాల్సివచ్చింది – చీకటిని బాగా తెలుసుకోటానికి దీపాన్ని వెలిగించుకున్నట్లు . . .

ఇంతకు ముందొకసారి చెప్పాను. మళ్ళీ మరొకసారి జ్ఞాపకం చెయ్యతలచుకున్నాను. ఈకథకి క్రమపద్ధతిఅనేదిలేదు. మధ్యమధ్య చాలా ఖాళీలున్నాయి. వాటినన్నిటినీ నా కల్పనతో పూరిస్తున్నాను. నా యీ ఊహావిలాసానికి హేతువేమిటని ఎవరైనా ప్రశ్నించవచ్చు. యథార్థం చెప్పాలంటే

మోహం అని చెప్పకతప్పదు. ఈ మోహానికి వశమైపోవటం వల్లనే అన్నీ స్పష్టంగా తెలిసినాకూడా నా మనస్సు రాత్రి విషయంలో కసటువారలేదు. ఇదంతా జరిగినతర్వాతకూడా ప్రభాతుణ్ణి నిష్కళంకుణ్ణిచేద్దామనే ప్రయాసకూడా పడ్డాను.

ఈ సమయంలో ఆశ్చర్యకరమైన గాథ ఒకటి నాకు ఆభాసమాత్రంగా తెలియటం జరిగింది. ముందు ఆ గాథే చెపుతాను. అసాధారణమైన గాథ అది. ఎంత అసాధారణ మైనదంటే, అంతా తెలిశాకకూడా విశ్వసించాలనే ప్రవృత్తి కలగదు మనస్సుకి. నేనుచూడలేనిది, గ్రహించి తెలుసుకోలేనిది అయిన నిగూఢరహస్యం ఏదో ఉండిఉంటుందని, నేను చూసి గ్రహించి తెలుసుకున్నట్లయితే ఆ అసాధారణవ్యక్తిని సునాయాసంగానే సాధారణవ్యక్తిగా జమకట్టవచ్చునని అనిపిస్తుంది. అసాధారణుణ్ణి సాధారణునిగా నిరూపించటానికి ఎంతపట్టుదల మనకి! ఎవరిలోని అసాధారణతనీ మనం ఏమాత్రం సహించలేమనుకుంటా! ఆ వ్యక్తి నేర్పుగా నటించేవాడనో, బురఖా తగిలించుకున్నవాడనో అనిపించవచ్చు. అలాంటిదేమీ అనిపించనప్పుడు అతడు నిజంగా అసాధారణుడే. కాని ఈ వ్యక్తికి ఎలాంటి బురఖా ఉన్నట్లు నా కంటికీ కనపడలేదు, మనస్సుకీ తోచలేదు. కనుక నే నతణ్ణి అసాధారణుడని అనక తప్పదు.. వాస్తవానికి మొదట్లో అతణ్ణిచూసినప్పుడు అతడు సాధారణుడని నా కనిపించనేలేదు. ఆ గాథయావత్తూ పూర్తిగా తెలిశాక, అతడి అసాధారణత విషయంలో నేను అప్రమత్తుణ్ణయాను. రాత్రికథలో అతడిగాథని తెచ్చి రాయటానికి ముఖ్యకారణ మేమంటే - రాత్రి తల్లిజీవితాన్ని ఈగాథ కేవలం పరిపూర్ణంగా

కాకపోయినా, వివిధదశలలో, విభిన్న సమయాల్లో, అనేకవిధాలగా ప్రభావితంచేసింది. కనుక ప్రధానంగా కాకపోయినా గౌణంగానయినా రాత్రికథతో ఈ గాధకి చాలాసంబంధం ఉంది.

వివరాల్లోకిపోతే, ఈసందర్భంలోకూడా - నే నింతకు ముందే ఈ ప్రసక్తికి అవతారికగా చెప్పిన ఆ ఒక్క కారణాన్నే మరికాస్త విశదపరచాలి. మనం అసాధారణుణ్ణి అసాధారణునిగా చప్పున గుర్తించలేము. ఒకవేళ గుర్తించినా ఒప్పుకోం. అహంకారంకొద్దీ ఒప్పుకోవటాని కిష్టపడం. రాత్రి తల్లి - తను వాతి జీవితంలో తన గురుదేవుడని ఎవర్నయితే అందరికీ పరిచయం చేసిందో - పూర్వ జీవితంలో అతడి అసాధారణతని అంగీకరించి ఉండినట్లయితే బహుశా ఇదంతా జరిగేదే కాదు. బహుశా రాత్రి జన్మించేదే కాదేమో!

గురుదేవుల శ్రేణికి చెందిన వ్యక్తికి సాధారణంగా అంటి పెట్టుకుని ఉండే గడ్డాలు, జటలు, కాషాయవస్త్రాలు, రుద్రాక్షలు ఇలాంటివేవీ రాత్రి తల్లికీ గురుదేవుడైన రాఖాలబాబుకి లేనేలేవు. పేరుకుముందు 'స్వామి' అనో, పేరుకి తర్వాత 'ఆనంద' అనో తగిలించుకుని తన పేరు మహత్తును పెంపొందించుకునే ప్రయత్నంకూడా చెయ్యలేదతడు. వాస్తవానికి ధర్మంపేరుతో వంచనచెయ్యటమనేది లేదతడిలో . . . రాఖాల బాబు ఎంత భోళాగా ఉంటాడంటే, ఆతడ్ని హఠాత్తుగా చూస్తే అమాయకుడేమో అనే సందేహంకూడా కలుగుతుంది. శరీరాన్ని బట్టి చూస్తే అతడి తలకాయంచెం పెద్దదే. కళలో ఎంతో శాంతస్వభావం ఉట్టిపడుతూ ఉంటుంది. కాని ఓ విచిత్ర

మైనవిస్మితదృష్టి అతడిది. అతడు లోకాన్ని ఎప్పుడూ అకృత్రిమ విస్మయదృష్టితో చూస్తూ ఉంటాడా అనిపిస్తుంది. బాగా పరిశీలనగా చూడకపోయినా, అది – ఇంకెటూ మనస్సు మరల్చటానికి అవకాశం లేనంత, సర్వాన్నీ ఆకళించుకోగలిగినంత గంభీరవిస్మయం అని తెలిసిపోతూనే ఉంటుంది. రంగస్థలంమీది అభినయాన్ని చూస్తూ ప్రేక్షకుడు తన్ను తాను మరిచిపోయి చుట్టుప్రక్కల ఇతరులున్న సంగతికూడా గ్రహించలేని స్థితిలో యెలా ఉండాడో, అలాగే రాఖాలబాబు కూడా విశ్వరంగస్థలి యెదుట ఆత్మ విస్మృతుడై నుంచున్నవాడిలాగా ఉంటాడు. జగన్నాటక రంగంలో తానూ ఒక నటుడిననే మాటగుర్తే ఉండ దతడికి. ఇతర నటులంతా అతడి ఈ మరపును జ్ఞప్తికి తెస్తున్నప్పటికీ అతడ్ని సచేతనుణ్ణి చెయ్యలేకపోతుంటారు. విధిలేక మరొక నటుడు ముందుకివచ్చి అతడి పాత్రని కూడా తానే అభినయిస్తుంటాడు. రాఖాలబాబు కూడా కొంచెం ప్రక్కగా నిలబడి ఆ అభినయాన్నికూడా అంత ఆశ్చర్యపోతూనూ, చూస్తూ ంటాడు. ఇలాంటి మనఃప్రవృత్తి అసాధారణమైనదని చెప్పటం అనవసరం. కాని అతణ్ణి అసాధారణుడని యెవ్వరూ అనలేదు. అమాయకుడని, కాపురుషుడని, పిచ్చివాడని, అంతేనన్న మాటేమిటి, కొందరతణ్ణి నపుంసకుడని అనటం కూడా విన్నాను నేను. కాని అతడిలాంటివేవీ పట్టించుకోనేలేదు. అలా పట్టించుకునే మనస్తత్వమే కలవాడైతే, ఆత్మవిస్మృతుడైన రసిక ప్రేక్షకుడు కాకుండా, ఆత్మపరాయణుడైన, కళాకుశలుడైన నటుడే అయ్యేవాడు. ఈ ఆత్మవిస్మృత మనఃప్రవృత్తే కాకుండా, విమర్శక పీఠుల వ్యాఖ్యానాలు వచ్చి

గుచ్చుకోకుండా చేసే కవచంకూడా ఒకటుందతడికి - అది అతడి సరళమైన నవ్వు. ఎవరేన్నయినా అననీ, అతడికి విరుద్ధంగా వచ్చే చర్చ ఎంత విషాక్తమైనదికానీ, ఎంత అమర్యాదకరమైనదికానీ, ఒక్క చిరునవ్వుతో అతడు దాన్నుంచి తప్పించుకుని బయటపడతాడు. అతడి మనస్సుకేమీ అంటదు. ఇదంతా అభినయమేకదా, వీనికి కోపం తెచ్చుకుని లాభమేముంది అని అతడు అనుకుంటాడేమో బహుశా. ఇదంతా కేవలం నా ఊహే సుమా! నే నతణ్ని గురించి విరుద్ధంగా మాట్లాడేవారి నెవర్ని చూడలేదు. అతణ్ణయినా ఒక్కసారే చూశాను. అదయినా కొంచెంసేపే అతడికి మరొక పేరు కూడా ఉందని విన్నాను. రాఖాలబాబు ఒకచోట ఎక్కువ రోజులుండడు. భారత దేశమంతటా ముఖ్యంగా తీర్థక్షేత్రాలలో ఎక్కువగా తిరుగుతూ ఉంటాడు. సగం మాసిన పంచె ఒకటి కట్టుకుని, చేతులులేని చొక్కా తొడుక్కుని ఉంటాడు. సగం నెరిసినజుట్టు అంటకత్తెర వేసి వుంటుంది. మొదట్లో అతణ్నే చూడగానే దరిద్రుడని తోచవచ్చు. కాని, బ్యాంకిలో చాలా డబ్బు ఉందతడికి. అందులో చాలాభాగం తీర్థయాత్రలక్రిందనే ఖర్చుపెడుతూ ఉంటాడు. అతడికి సంబంధించిన ఈ యథార్థ విషయాలన్నీ నేను తర్వాత కొన్ని రాత్రి దగ్గర, కొన్ని కొన్ని ధరణీబాబు దగ్గిర్నుంచి, మరికొన్ని నిఖిలచౌధురీ దగ్గర్నుంచి సేకరించాను. నా ఊహతో వాటికి కొన్ని మెరుగులు కూడా దిద్దాను. నేను అతణ్ని హత్యాకాండ జరిగిన నాటి ఉదయమే ప్రత్యక్షంగా చూసింది. స్వర్ణేందు దగ్గర్నుంచి, ఎంతో కష్టంమీద అతడి అడ్రస్ అడిగి తెలుసుకుని, మీర్జా

ఫ్రాంక్ స్ట్రీట్ లోని ఇంటికి వెళ్ళగానే మొట్టమొదట నా కెదురు పడిన వ్యక్తే రాఖాలబాబు. వెస్టుకోట్ ఒకటి తొడుక్కుని వరండాలో కూర్చుని, కాలిబాటమీద ఆడుకుంటున్న పిల్ల వాడి కేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. కుర్రవాడు ముందర జడ వేసుకుని ఉన్నాడు. కళ్ళకి కాటుకవుంది. రంగు రంగుల దుస్తులు తొడుక్కున్నాడు. ప్రక్కయింట్లో ఏదో పెళ్ళిలా గుంది. భజంత్రీలు అక్కడే బారుతీర్చి కూర్చున్నారు. నేను వరండాలోకి వెళ్ళగానే అతడు తన శాంత – కుతూహాల దృష్టిని నావైపుకి మరల్చాడు. రాత్రి తల్లి గురుదేవుడతడే అని నేను మొదటో గుర్తించలేదు. గురుదేవుడన్న తర్వాత కనీసం ఓ కాషాయిగుడ్డ అయినా కట్టుకుని ఉంటాడని ఆశిం చాను. అతడు గుమాస్తాలాంటి వాడెవరో అయి ఉంటాడను కుని, కొంచెం ఆజ్ఞాపిస్తున్న ధోరణిలోనే – 'స్వర్ణేందుబాబు గారింటి దగ్గర్నుంచి ఘనశ్యాంబాబు వచ్చాడు. చాలా అవసర మైన పని ఉందట! అని లోపలికి కబురు చెయ్యండి' అని అన్నాను. అతడు తన మామూలు సరళమైన చిరునవ్వొకటి నవ్వాడు. తర్వాత ఇంకేమీ మాట్లాడకుండా లేచి వెళ్ళాడు. నేను వరండాలోనే ప్రతీక్షిస్తూ కూర్చున్నాను. కొంచెంసేప యాక అతడు మళ్ళీ వచ్చి "స్వర్ణేందుతల్లి పూజలో కూర్చుని ఉంది. మీరింకాస్సేపు కూర్చోగలిగితే కూచోండి. లేదా ఇష్ట మయితే – ఆ అవసరం ఎలాంటిదో నాతో చెప్పినా చెప్ప వచ్చు" అన్నాడు.

ఇంత దారుణమైనవార్తని భృత్యుడులాంటి వ్యక్తి ద్వారాపంపించటం సముచితం కాదనుకుని కూర్చోటానికే

నిశ్చయించుకున్నాననుకుంటున్నారేమో! కాదు. ఎందుకంటే ఎలాంటి నిశ్చయం చేసుకోటానికీకూడా మనస్సు సరియైన స్థితిలో లేదు. నేను మరతిప్పితే నడిచినట్లు – ఎదుటిగదిలోకి నడిచాను. రాఖాలబాబు, కూర్చోటానికి నాకో కుర్చీచూపించి మళ్ళీ బయటికివెళ్ళి కూచున్నాడు. ఆ కుర్రవాడింకా అక్కడ ఆడుకుంటూనే ఉన్నాడు.

అప్పుడు నా మనస్సెంత కింకర్తవ్యతా విమూఢావస్థలో ఉన్నదంటే – 'స్వర్ణేందు తల్లికోసం కొంచెంసేపు వేచి ఉండాలి' అని వినగానే ఏదో ప్రాణం లేచివచ్చినట్లుంది. వేరే కారణమేమీ లేదు. కాస్త వ్యవధి ఏదోఒకటి లభించిందికదా అనే...వంశీకంఠంమీది అంత పెద్దగాయం, రక్తంతో తడిసి వున్న స్వర్ణేందు, ధరణీబాబు అంతర్ధానమైపోయి, చుట్టుప్రక్కలవారినందర్నీ పోగుచేసుకుని రావటం, – వీటినన్నిటినీ అణచిపెట్టి 'జ్యోతిర్మయుణ్ణి తీసుకుని రాత్రి స్టేషన్‌నుంచిరాలేదు' అన్నమాటొక్కటే నా మనస్సులో జ్యోతిలాగా జ్వలించసాగింది. బయట ఆడుకుంటున్న కుర్రాడికేసి, విస్తుపోయి చూస్తూ వరండాలో నిలబడి ఉన్నవ్యక్తిమీదికి మనస్సు పోనిచ్చేట్లుగాలేదు అప్పటి నా స్థితి...నా పరధ్యానం మూలంగానే ఆరోజు నతడితో కొద్దిపరిచయంమాత్రం కలిగింది. అది కొద్దిపాటిది కనుకనే ఆ స్మృతిని లోభిలాగా మనస్సులో దాచిపెట్టుకున్నాను. అదే నేనతణ్ణి తొలిసారి – తుదిసారీకూడా చూడటం. స్వర్ణేందుతల్లి కనిపించిం తర్వాత ఇంకొంచం పరిచయమయింది. అర్థాత్తూ – రాత్రి తల్లి ఎక్కడికిపడితే అక్క

డికి నీడలాగా వెన్నంటి తిరిగే ఆ గురుదేవుడు – ఆ మాసిన గుడ్డలు కట్టుకున్న వ్యక్తేనని తెలుసుకున్నా నన్నమాట.

♦ ♦ ♦

ఎంతసేపు కూర్చున్నానో గుర్తులేదు.

కాని ఇదిమాత్రం బాగా జ్ఞాపకం ఉంది – నిగనిగలాడే ఎర్రంచు పట్టుచీర కట్టుకుని, పాపిట్లోని కుంకుమబొట్టుతో స్వర్ణేందుతల్లి నా యెదుటికివచ్చి నుంచున్నాకకూడా కొంత సేపు నేనలా మొద్దులాగానే కూర్చుని ఉన్నాను. తర్వాత చటుక్కున లేచి నిలబడి, ఒకమాట కొకటి సంబంధంలేకుండా వెర్రిమొర్రిగా ఏంవాగానో జ్ఞాపకం లేదు. కాని ఈ దారుణమైన దుర్వార్తమాత్రం తప్పక చెప్పి ఉంటాను...

స్వర్ణేందుతల్లి అంతావిని, కదలకుండా మెదలకుండా కాసేపు అలాగే నుంచుంది అప్పటి ఆమె ముఖకవళిక నాకు బాగా జ్ఞాపకం ఉంది. న్యాయస్థానంలో బోనులో నిలబడి, నిందితుడు తన శిక్షని ఎలావింటాడో, ఆమె సరిగ్గా అలాగే నిలబడి, నేను చెప్పినదంతా విన్నది. అంతా విన్నాక మళ్ళీ కాసేపు అలాగే నుంచుంది. తర్వాత ఆమె కుప్పగ కూలి పోయినట్లు – చటుక్కున చతికిలపడింది. ఏడవనూలేదు. ఒక్క మాట మాట్లాడనూలేదు. నేను తెల్లబోయిచూస్తూ నుంచున్నాను. కాదు, ఆమెసరిగ్గా నా యెదుటే కూచుని ఉన్నా, ఆమెని సరిగ్గా చూడలేకపోయాననే అనుకుంటాను. మాట విన్నాక ఆమెలోని ఓ క్రొత్తరూపాన్ని మళ్ళీ కనుక్కోగలిగానని అనుకున్నాను. తలమీది ముసుగు జారిపోయింది. ముడి ఊడిపోయి, ముఖంమీద, భుజాలమీద, వీపుమీద జుట్టు

చిందరవందరగా పడింది. ఇంతంత కళ్ళు చేసుకుని ఎక్కడికో చూస్తోంది. నాసారంధ్రా లుబికాయి. నేలమీద చేతులు రెండూ ఆన్చి, ఊగటం మొదలెట్టింది. ఆమె మనస్సునంతా మథించి పైకివచ్చిన ఆర్తధ్వనిలాంటి ధ్వని ప్రసవవేదనపడు తున్న మరొక మాతృమూర్తి నోట వెలువడగా విన్నాను నేను. కాస్సేపటికి ఆ ఆర్తధ్వని ఆగింది. కళ్ళు మరింత విస్ఫారితములయినాయి. కాని స్థిరదృష్టితో ఆమె దేన్నో చూస్తున్న ట్లుంది. తర్వాత చటుక్కున ఉపన్యాసభంగిమలో మాట్లాడ సాగింది :- "అదుగో గౌతమాశ్రమం! నల్లని కళంకం ఘనీభ వించినట్లు ఆ నల్లరాయి ఇంకా అలాగే పడిఉన్నట్లు నా కళ్ళకి కన్పిస్తూనే ఉంది. వర్షానికి కరిగిపోనూలేదు. ఎండకు బ్రద్దలై పోనూలేదు. కొంచెమైనా మొక్కవోలేదు. యుగయుగాల నుంచీ అలాగేపడి ఉంది!" అని మళ్ళీ కాసేపాగింది. మళ్ళీ ఊగటం మొదలెట్టింది. కొంచెంసేపయాక మళ్ళీ ఆమె నేత్రాలు క్రమంగా విస్ఫారితం కాసాగాయి. మళ్ళీ ఏదో చూడకలుగు తోందామె. మళ్ళీ ఆ వూపు ఆగింది. మళ్ళీ మొదలెట్టింది. "పాషాణి అయిన అహల్య ఇప్పటికీ ఇంకా పాషాణిలాగానే పడిఉంది. ఆమె కీనాటికీ యింకా విముక్తి లభించలేదు. ఇంకా శిలానుభవం చాలా మిగిలిపోయి ఉంది. ఇంకెంతో ఎండనీ, వాననీ, పిడుగుల్నీ సహించాలి." అని తర్వాత చేతులుచాపి నేలమీదపడుకుని "నీలమేఘశ్యామా! రామా! ఎక్కడు న్నావ్? రా, దయచెయ్, అభయదాయకమైన నీ చరణ స్పర్శతో - పాషాణి అయిన అహల్యకి విముక్తి కలిగించు"——

ఆమె నిశ్చలదేహం నేలమీద పడిఉంది. అతడి తల్లి భారమంతా భగవంతునిమీద వేస్తూ ఉంటుందని స్వర్ణేందు చెప్పగా విన్నాను. అది ఇదేనా! హఠాత్తుగా వెనక్కి తిరిగి చూశాను. రాఖాలబాబు వరండాలోంచి ఎప్పుడు లోపలికి వచ్చాడో విస్మితదృష్టితో నాకేసిచూస్తూ నిలబడిఉన్నాడు. అతడి ఆనిర్వికార - విస్మితదృష్టిని నే నెన్నడూ మరచిపోలేను. కాసేపు అలా నాకేసిచూసి, రాత్రి తల్లిదగ్గిరకి పోయి కూర్చు న్నాడు. ఎంతో ఆప్యాయతతో ఆమెతల నిమురసాగాడు. ఆతడి కళ్ళలోని దృష్టినిచూస్తే - అత డామెని ఓదార్చటం లేదేమో! ఏ అభినేత్రినో ఆమె అభినయ ప్రావీణ్యానికి ముగ్ధుడై నిశ్శబ్దంగా అభినందిస్తున్నాడేమో అనిపించింది నాకు.

"పద, ఆ గదిలోకి పద."

రాత్రితల్లి చీరె, జుట్టు సవరించుకుని, లేచి అతడివెంట గదిలోకి వెళ్ళింది. నేను మెదలకుండా అలాగే కూర్చుండి పోయాను.

ఓ క్షణం పోయాక మాటలు విన్పించసాగాయి - రాఖాలబాబు అంటున్నాడు-

"నువ్వు స్వర్ణేందుమీద కేసుకోసమై ఇక్కడ ఉండ తలచుకుంటే ఉండు. నేను రేపే హరిద్వారం వెళ్ళిపోతున్నాను. డబ్బు అదీ కావలసిన ఏర్పాట్లన్నీ చేసిపోతాను."

"మీరు నన్నిక్కడే ఉండిపొమ్మంటారా?"

"నేనేమీ అనటంలేదు" అని కొంచెం ఆగి, "నేన న్నడూ దేనినీ చెయ్యమని ఆదేశించలేదు నిన్ను" అన్నాడు.

తర్వాత మళ్ళీ కాసేపు నిశ్శబ్దం. తర్వాత చటుక్కున ప్రక్కయింట్లోంచి పెళ్ళి వాయిద్యాలు విన్పించాయి. అవేమీ వినలేకపోయాను నేను. కొంచెంసేపటికి రాఘాల బాబు బయటికి వచ్చాడు. శాంత విస్మితదృష్టితో కొద్ది సెకండ్లు నాకేసి చూసి, తర్వాత "మీ పూర్తిపేరేమిటి?" అని అడిగాడు.

"ఘనశ్యాం సర్కార్."

"ఆ సర్కార్ 'స్పెల్లింగ్' ఎలా రాస్తారో దయవుంచి చెప్పండి"

చెప్పాను. అతడు డ్రాయర్ లాగి చెక్ బుక్, కలం పైకి తీసి, చెక్కు ఒకటి రాసి నాకు ఇచ్చాడు. చూసుకున్నాను. వెయ్యిరూపాయల చెక్కు అది. చెక్కుమీదినుంచి దృష్టి మరల్చగానే - "మేము రేపు హరిద్వారం వెడుతున్నాం. స్వర్ణేందు కేసువిషయం మీరు దయవుంచి, కాస్త పైనఉండి చూస్తూ ఉండండి."

అని చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు. నేను ఎంత విస్మితుణ్ణి అయిపోయానంటే అతడికి నమస్కరించటంకూడా మరిచిపోయాను.

ఆ తర్వాత వారు మళ్ళీ నా కెప్పుడూ కనబడలేదు.

## 7

తిండిలేక ఎండి ఒరుగుపైన నలుగురైదుగురు వాద్యగాళ్ళు- రెండు డోళ్ళూ, రెండు సన్నాయిలు వేసుకుని ఎంత రణగొణ

ధ్వనిని కల్గించగలరో ప్రత్యక్షంగా చూడనిదే నమ్మటం కష్టం. వాళ్ళ నరాల్లో అంతో యింతో మిగిలిన సత్తువ నంతా ఓడుస్తూ మేళం వాయించుకుంటూ తిరుగుతున్నారు వాళ్లు. రంగురంగుల దుస్తులు వేసుకున్న కొందరు - పిల్లలు పెద్దవాళ్లు అన్న విచక్షతలేకుండా రాస్తాకటూ యిటూ నిలబడి, ఆ మేళాన్ని తన్మయులై వింటున్నారు. కొన్ని బాతులు తమ పిల్లల్ని యథేచ్ఛగా తిరగనిస్తూ, అవికూడా వాటికి కాస్త వెనకా ముందూ అక్కడే తారట్లాడుతున్నాయి. ఆ బాతు పిల్లలు పాలిపోయి వికృతంగా కన్పిస్తున్నాయి. కొంచెం పెద్ద వయితే అవే చక్కని హంసల్లా తయారవుతాయని చూడగానే స్ఫురించదు. డోలు, సన్నాయి వాయిద్యాల గొడవ వాటికి పట్టనట్లే లేదు. తిండి వెతుక్కోటంలో ఆదుర్దాగా తిరుగు తున్నాయి అవి. పెద్ద గాలి ఒకటి ప్రారంభమై, వేసవి మిట్ట మధ్యాహ్నపు ఉత్తప్తగాంభీర్యతని చెదరగొడుతోంది. ఆ గాలి చెట్ల ఆకుల్ని రాలకొడుతోంది. రోడ్డమీద దుమ్మును రేగ కొడుతోంది. ఎండి రాలిపోయిన ఆకుల్ని, కాగితాల్ని తన చిత్తం వచ్చినట్లు ఆడిస్తోంది. డోళ్లూ - సన్నాయిలూ సమా నంగానే మోగుతున్నాయి. రావిచెట్టుమీద తోక యెత్తుకు కూర్చున్న ఉడత ఒకటి చిక్ చిక్ మని అరుస్తూ ఆ సన్నాయి వాయిద్యానికి అంతరాయం కలిస్తోంది...చెప్పాలుకుట్టే ముసిలి వాడు లేడక్కడ. చలివేంద్రవాడికి బదులుగా తులసిపేరులు ధరించిన భక్తుడిలాంటివాడెవడో వచ్చి కూచున్నాడక్కడ. ఆకాశమెత్తుఉన్న పిండిమర పొగగొట్టంలోంచి,నల్లటి పొగ నిశ్శ బ్దంగావలయాకారంగా పైకిలేచిపోతోంది. ఈశాన్యపువైపునుంచి

మబ్బు పట్టుకొస్తోంది. చిన్న చిన్న మెరుపులుకూడా ప్రారంభ మయాయి. కాసేపట్లో ప్రారంభించబోయే గాలి దుమారానికిది నాందిలాగుంది. 'సీతారామ, సీతారామ' అని అరుస్తూ ఎదుటి సందులోంచి ఆబోతులాంటి మనిషి-ఎవడో వస్తున్నాడు. అతడి చేతులో తళతళలాడుతున్న అక్షయపాత్ర ఉంది. మెడనిండా తులసిపేరులున్నాయి. మొహం అంతా ఇంత వెడల్పున వంగ నామాలున్నాయి. అటూ ఇటూ చూసి, ఒకసారి కాండ్రించి ఉమ్మేసి, మళ్ళీ హరేరామ, హరేకృష్ణ, అంటున్నాడు. డొక్క పుష్టికలిగి, నిగనిగలాడుతున్న పెద్ద ఆవు ఒకటి ఆంబోతులాగా ఊగుతూ నెమ్మదిగా రోడ్డుకడ్డంగా నడిచిపోతోంది. ఓ గుంపు పావురాలు ఎక్కడినుంచో ఎగిరివచ్చి ఎదుటిడాబా పిట్టగోడల మీద వాలాయి. కమలారంగు బురఖా వేసుకున్న ఒక అమ్మాయి ఒంటెద్దుబండిలో కూర్చునిపోతూ, మధ్యమధ్య కుతూహలం కొద్దీ బురఖా కాస్త ప్రక్కకి తప్పించుకుని అటూ యిటూ చూస్తోంది. బాంగ్లా దేశానికి వెలుపల – ఈ వేసవి మిట్ట మధ్యాహ్నపు వాతావరణంలో కూర్చుని, కాలేజీస్క్వేర్‌లో నిఖిలభాబు నన్ను కలుసుకున్న ఆనాటి కలకత్తా నగరపు సంధ్యాసమయాన్ని కళ్ళకుకట్టినట్లు ఈ వ్రాతలో చిత్రించ గలనా లేనా అని ఆలోచిస్తున్నాను.

ఆ రోజున అంతకుముందే ఒక జల్లువాన కురిసి వెలిసింది. ఆ వాన పడటంవల్ల – అప్పటివరకూ ఎండకు కాలి కాలి ఉన్న భూమిలోంచి ఆవిరి ఇంకా పైకి వస్తున్నట్లే ఉంది. నిఖిలచౌధురీ ట్రాంలోంచి దిగి, నన్నుచూడగానే" మంచిదే అయిందిలే పద, నడుద్దాం" అన్నాడు. నేను పదిహేను రోజు

ల్నుంచీ కలకత్తాలో లేను. ఆ స్త్రీవ్యవహారాలు చూసుకోటాని కని మా గ్రామానికి వెళ్ళాను. వెంట తీసుకువెళ్ళిన పుస్తకాలన్నీ ఆఖరయినాయి. మళ్ళీ పుస్తకాలు కొందామని బయలుదేరాను. ఒక పాతపుస్తకాలషాపుకు వెళ్ళి నాకు కావలసిన నవలలన్నీ ఏరిపెట్టి, బేరమాడుతున్నాను. "మంచిదే అయింది, పద నడుద్దాం" ఈ మాటల్ని నిఖిలబాబు అతి స్వాభావికమయిన కంఠంతోనే అనటానికే ప్రయత్నించాడు. ఆ కంఠస్వరంతోపాటు – మునిగిపోతున్న వ్యక్తి ఎదుట ఓ నావో తెప్పో కన్పిస్తే ప్రాణంలేచివచ్చినట్లు ఎలా నిట్టూరుస్తాడో అతడుకూడా అలా నిట్టూర్చినట్లుతోచింది. నాకు ఆ పుస్తకాల ఖరీదెంతో ఇచ్చేసి, వాటిని చంకనెట్టుకున్నాను. బేరంచేసేందుకవకాశం లేకపోయింది. నిఖిలచౌధురీకేసి ఓరకంటితోచూసి, "ఏమిటి? సంగతేమిటి?" అని అడిగాను.

"దుస్సహం! పద"

మునిగిపోతున్నవాడి నిట్టూర్పులాంటి నిట్టూర్పు మళ్ళీ విడచినట్లులేదు. నిఖిలబాబు అప్పటికి కాస్త నిభాయించుకుని ఉంటాడు. నిశ్శబ్దంగా అతడివెంట నడిచాను.

కాలేజీస్క్వేర్‌లో నాలుగువైపులనుంచీ వచ్చే జనప్రవాహం అప్పటికి బాగా ఎక్కువయింది. నాలుగువైపులా బారులుబారులుగా ట్రాములు, కార్లు, రిక్షాలు, టాంగాలు, ఎద్దుబళ్ళు, చిల్లరబేరగాళ్ళు, నెత్తితట్టలవాళ్ళు, పత్రికలమ్మే కుర్రాళ్ళు, ఇంకా రకరకాల మనుష్యులతో కోలాహలంగా ఉంది, మేము కాస్త ప్రక్కకు తప్పుకుని నిలబడి, దిల్‌ఖుష్ కాబిన్ ఎదుటనుంచి హారిసన్ రోడ్డుమీదుగా – ట్రాములు

వెళ్ళిపోగానే – వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నాం. వరుసగా చాలా ట్రాములు నిలిచిపోయాయి. ఎదుట ట్రాంలైన్‌మీద ఎద్దుబండి ఒకటి బోల్తాపడింది. దిల్‌ఖుష్‌కాబిన్ కిటకిట లాడి పోతోంది. రవంతయినా చోటులేదు. ఓ కప్పు టీ తాగుతూ కాస్సేపుగడుపుదా మనుకున్న వాంఛను వదులుకోవాల్సి వచ్చింది. ఎదురుగా 'న్యూ ఫార్మసీ'లోని రంగురంగుల నీళ్ళు పోసివున్న పెద్దపెద్ద గాజుకూజాల్లో ఎలక్ట్రిక్ బల్బులకాంతుల కదలికలు చాలా ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నాయి. కృష్ణదాస్‌పాల్ విగ్రహానికి దిగువ పూలు, రకరకాల పటాలు, చిన్నచిన్న వస్తువులు, చైనారిబ్బన్లు అమ్ముతున్నారు. వార్టన్‌హాల్లో ఏదో ఉపన్యాసం ఇప్పుడే అయిపోయిందల్లేఉంది. వై. యమ్. సి. ఏ. గేట్‌లోనుంచిజనం బిలబిలావస్తున్నారు. నిఖిలచౌధురీ ప్రక్కనే నుంచునిఉన్నాడు – ఒక్కక్షణం నేనా సంగతే మరిచిపోయాను, పరధ్యానంలోపడి...కలకత్తానగరంలో ప్రతిక్షణం ఉత్తేజనతో నిండేవుంటుంది ఏ ఉత్తేజనా ఆట్టే సేపుండదు; బయస్కోపు బొమ్మలాగా క్షణంలో కరిగి విలీనమైపోతూ ఉంటుంది. సచేత నంగా ఉన్న మనస్సుమీద మళ్ళీ క్రొత్త దేదో సృష్టిఅవు తూనే ఉంటుంది. జనం ఎంతసేపని గుర్తుంచుకుంటారు? ఎన్నింటిని గుర్తుంచుకుంటారు? సృష్టి అవుతున్నదానిలోని ప్రతి అంశం చలిస్తూ ఉంటుంది. అది ఆశ్చర్యంగానూ ఉత్తేజకరంగానూ ఉంటుంది. మనస్సుకి దిక్కుతోచక చివరికి ఉదాసీనత ఏర్పడుతుంది. ఉహూం ఆక్షణంలో సరీగ్గా రెండుమాసాలక్రితం జరిగిన సంఘటన నాకు గుర్తులేదు. అప్పుడే నేను స్క్వేర్‌లో ఉన్న గడియారంకేసి చూసి, 'ఎంపయిర్'లో ఇవాళ నుంచి

ఢ్యాన్సు ఉంది. నిఖిలబాబు నా పాలబడటంవల్ల వెళ్ళటానికి వీల్లేకపోయిందే' అని దిగులుపడుతూ ఆలోచించసాగాను. హఠాత్తుగా ట్రాంలైను బాగుపడింది. గణగణ ట్రాములు నడవసాగాయి. మేమిద్దరం టాక్సీలను, రిక్షాలను తప్పించుకుని ఇటూఅటూ చూసుకుంటూ హారిసన్‌రోడ్డు దాటివెళ్ళాం

నిఖిలబాబు ఇంక ఒక్కమాటయినా మాట్లాడలేదు. సందులోకి వెళ్ళగానే అతణ్ణి మళ్ళీ "ఏమిటిసంగతి? చమేలీ ఇవాళ మళ్ళీ ఏమైనావంట చక్కగాచేసిందా?"అని అడిగాను. నిఖిలచౌధురీసందులోకి రాగానే మళ్ళీ జేబులోంచి నశ్యండబ్బీ తీశాడు. నా ప్రశ్నవింటూనే దానిమూతతీసి, ఒక చిటికెపట్టి చకితుడై నాకేసి ఒక్కక్షణంచూస్తూ నిలబడి, ఆ చిటికె పీల్చి, ముక్కుకి అటూఇటూ అంటుకున్న నశ్యాన్ని తుడుచుకుని, మళ్ళీ నాకేసిచూశాడు. అతడిచూపు నాకేదో కొరడాదెబ్బ తగిలినట్లుంది. నేను విస్మితుణ్ణయి – "సంగతేమిటో చెప్పండి" అని అడిగాను మళ్ళీ.

నిఖిలబాబు స్ఫుటమైన గొంతుకతో గద్దిస్తున్నట్లు "నడవండి" అన్నాడు.

తర్వాత అస్పష్టంగా మళ్ళీ "దుస్సహం!" అన్నాడు.

ఇద్దరం నిశ్శబ్దంగానే నడకసాగించాం.

  

నిఖిలబాబుగారి డాబామీద యిద్దరం మౌనంగా కూచ్చున్నాం. దగ్గరలో దీపం ఏమీలేదు. ప్రక్కయింట్లో గ్రామఫోన్ మోగుతోంది. కొద్ది రవగాలికూడా ప్రారంభించింది. నేను కొంచెం పరధ్యానంగానే కూచ్చుని ఉన్నాను.

స్వర్ణేందు కేసు విచారణ పర్యవసానం ఏమయిందీ తెలియదు నాకు. నేను స్వర్ణేందు విషయంలో బుద్ధిపూర్వకంగానే నిర్వికారంగా ఉన్నాననీ కాదు; రాఖాలబాబు నాకు వెయ్యి రూపాయల చెక్కు యిస్తూ రెండు నెలల క్రితం నన్ను కోరిన కోరికని లక్ష్యపెట్టకపోవటమూ కాదు. నేను ఆ రోజునే ఆ చెక్కు నిఖిలబాబుకి యిచ్చి న్యాయశాస్త్రానికనుగుణంగా నయినాసరే, విరుద్ధంగానైనాసరే స్వర్ణేందుని బ్రతికించితీరాలి అని చెప్పివచ్చాను. నిఖిలబాబు అందుకు ఒప్పుకున్నాడు. కాని చెక్కుమాత్రం అప్పుడే మార్చదలచలే దాయన. తర్వాత దాన్ని మార్చాడో లేదో నాకు తెలియదు. నిఖిలబాబు మంచి లాయరు, స్వర్ణేందుకి ఆత్మీయుడు. సాధ్యమైనంతవరకు చెయ్యతగిందంతా ఆయన చేస్తాడు. ఆ విశ్వాసం ఉందినాకు. కాని నేను ఈ విశ్వాసంమీదే ఆధారపడి నిశ్చింతగా ఉన్నానని, దాన్ని కారణంగాచూపి నేను తలయెత్తుకుని నిలబడగలననుకుంటారేమో; అసలు సంగతి అదిగాదు. అదీకాక నేను నిజానికి స్వర్ణేందు విషయంలో నిర్వికారంగాలేను. అతడి విషయం అప్పుడప్పుడు వాస్తవానికెంతో ఆదుర్దాతోనే ఆలోచిస్తున్నాను. అతడు నిర్దోషి అనటంలో నాకేమాత్రం సందేహంలేదు. కాని అంతకంటె సరియైనదేమిటంటే – నేను స్వర్ణేందు సంగతికంటె రాత్రి విషయమే ఎక్కువగా ఆలోచిస్తున్నాను. అందులోనయినా మరపుఅనేది లేదాఅంటే లేదనికాదు. వీరివిషయంలో నా మనస్సు ఎప్పుడూ సంపూర్ణంగా ఉన్మక్తమైలేదు నాదీ మానవహృదయమే. ఏ ఉత్తేజనాప్రభావంవల్లా కూడా ఉత్సాహపు గోపురమెక్కి ఎంతో

సేపు అక్కడ నిలబడలేదు. జారి జారి పోతూఉంటుంది. బహుశా ఇదే కారణమై ఉంటుందనుకుంటాను. స్వర్ణేందుని అరెస్టుచేసిన మర్నాటినుంచే అది దిగజారటం మొదలెట్టింది. వారంరోజులయేసరికల్లా కలకత్తానగరానికి, నా డాక్టరీజీవితానికీ సంబంధించిన క్రొత్త క్రొత్త ఉత్తేజనంమూలంగా మళ్ళీ నన్ను నేను మరిచిపోయాను. పక్షవాతంవచ్చి పడిపోయిన పూర్ణేందుబాబు భారాన్ని ఆయన మేనమామకొడుకు వహించాడు. అతడికి అల్లుడు వరుసయే నిఖిలబాబు ఈ వ్యవహారమంతా నిర్వహించే భారం పైనవేసుకున్నాడు. అలాంటప్పుడు ఇహ నే చెయ్యవలసిందంటూ ఏమీ లేకపోయింది. వాస్తవానికి సామాజిక సంబంధం అనేదికూడా ఏదీ లేకపోయినట్లయితే, నేనింకా పూర్తిగా వదిలించుకునేవాడిని. వీరితో అసలు నా కేర్పడినదే ఆకస్మికసంబంధం. ఆనాడు స్టేషన్ ప్లాట్‌ఫారంమీద రాత్రి నన్ను వివశుణ్ణి చెయ్యకపోయినట్లయితే, నే నసలు వీరినిగురించి బుర్ర చెడగొట్టుకునేవాణ్ణే కాను. స్వర్ణేందుని పరిశీలనగా చూసే సుయోగం, అదేమిటి అసలలాంటి ప్రేరణనికూడా పొందేవాణ్ణికాను బహుశా. నా కర్తవ్యపు ప్రోద్బలంవల్ల, జైల్లోవున్న స్వర్ణేందుని చూడటానికి కూడా వెళ్ళానొకసారి. స్వర్ణేందేవచ్చి కనపడలేదు. వంశీకి వైద్యం చేసినందుకు న్యాయశాస్త్రం నోటికిచిక్కి నేను బోను యెక్కి సాక్ష్యం చెప్పాల్సివచ్చింది. నా కెంతవరకు తెలుసో — నే నూహించుకున్నదంతా మాత్రంకాదు — అంతా ఉన్నదున్నట్లు, యథార్థంమీాది ప్రీతితో కాదు; తప్పనిసరి అవటంవల్ల చెప్పాను. కల్పించి రెండుమూాడు అబద్ధాలు చెప్పటంవల్ల

స్వర్ణేందుకి ఏదైనా ప్రయోజనం ఉంటుందనేట్లయితే తప్పకుండా అలాగే చెప్పేవాణ్ణి. కాని ఆ అదృష్టం లభించలేదు. ఆ రోజున ఉదయం ఒక్కక్షణం నాకేసిచూసి, స్వర్ణేందు తన మామూలు చిరునవ్వునవ్వి 'నేనే చేశాను' అని నాతో చెప్పినమాట ఉపసంహరించుకోలేదతడు. తన అపరాధాన్ని తన నోటిమీదుగా అంగీకరిస్తున్నవాణ్ణి న్యాయశాస్త్రపు కోరల్నుంచి ఎవరు తప్పించగలరు ?

కేవలం తననోటితోనే కాదు, తన చేత్తో స్వయంగా వ్రాసియిచ్చి స్వర్ణేందు ఆ నేరాన్ని అంగీకరించాడు. ఆరోజున సాయంత్రం తనతల్లి మీర్జాపూర్ స్ట్రీట్‌లోవున్న గురుదేవుని ఇంటికివెళ్ళిందని, తన చెల్లెలు రాత్రికూడా మధుపురం వెళ్ళటానికని తెల్లవారుఝామునఇంటినుంచి బయలుదేరిందని, ప్రక్కగదిలోతండ్రివున్నా - ఆయన లేవలేని స్థితిలో ఉన్నాడని, ఈ అవకాశాన్ని వృథాపోనీయకుండా తాను వంశీని స్వహస్తాలతో ఓ ప్రత్యేక కారణాన్ని పురస్కరించుకుని హత్య చేశానని, ఆ కారణం ఏమిటో మాత్రం చెప్పననీ వ్రాసియిచ్చాడు.

పోలీసులు స్వర్ణేందుతల్లినీ తండ్రినీ, రాత్రినీ కూడా సాక్షులుగా వేసుకుని సమనులు పంపించారు. స్వర్ణేందుతండ్రికిదంతా తెలియనే తెలియదు. పోలీసు వచ్చే సమయానికి ఆయన్ని కొంచెం రహస్యంగా తప్పించి తీసుకెళ్ళి ఉంచి, తర్వాత ఆరోజునే ఆయన మేనమామ కొడుకు యింటికి చేర్చడం జరిగింది. 'స్వర్ణేందు, రాత్రి, వంశీ - వీళ్ళంతా ఎక్కడికిపోయారు?' అన్న ప్రశ్న ఆయన కుడిచేత్తో ఎలాగో కాగితంమీద రాసి ప్రశ్నించాడు నిఖిలబాబుని. అతడేనో

ఆ అబద్దాలూ ఈ అబద్ధాలూ చెప్పి, ఆయన్ని మరిపిం చాడు. స్వర్ణేందు తండ్రి సాక్ష్యం ఇవ్వవలసిన అవసరం లేక పోయింది నిఖిలబాబు పోలీసులతో మాట్లాడి ఆ అవకాశాన్ని తప్పించగలిగాడు. స్వర్ణేందుతల్లి సాక్ష్యమివ్వటానికివచ్చింది. కాని ఆమెని నేను కలుసుకోలేకపోయాను. ఆ రోజున నేను కలకత్తాలో లేకపోవటమే కారణం. స్వర్ణేందుతల్లి స్వర్ణేందుని చూడాలని అనుకుంది కాని, స్వర్ణేందు కనపడలేదు. రాత్రి మధుపురంలో దొరకలేదు. ఆమె జ్యోతిర్మయుడితో బొంబా యిలో ఓ హోటల్లో ఉండగా దొరికింది. అస్వస్థతగా ఉండటం మూలంగా కాబోలు ఆమె రాలేదు. ఆమెకి బదులు డాక్టరు సర్టిఫికెట్ వచ్చింది. అయినా కమిషన్ వెళ్ళి ఆమె సాక్ష్యం తీసుకురావలసివచ్చింది. వంశీ అస్వస్థతగా ఉండటంచూశానని, ఆ తర్వాత అక్కడినుంచి బయలుదేరివచ్చేశానని అంతకంటె తనకేమీ తెలియదని చెప్పింది. స్వర్ణేందు అంగీకార పూర్వ కంగా చెప్పినమాటల్లో ఒక్క అక్షరమైనా ఉపసంహరించుకో లేదు. నిఖిలబాబు ఆఖరికిచేసిన ప్రయత్నంకూడా ఫలించలేదు. స్వర్ణేందుకు మతిభ్రమించిందని రుజువుచెయ్యటం సాధ్యం కాలేదు. డాక్టర్లంతా పరీక్షచేసి, అతడి మెదడు సరియైన స్థితిలో ఉన్నట్లు తమ ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అతడు మామూలుగా భోంచేస్తాడు, నిద్రపోతాడు. మామూలు ఆరోగ్యవంతులలాగానే మాట్లాడతాడు. అంతా అయిపోయి నాక నిఖిలబాబు నోటిమీదుగా నే నీ వివరాలన్నీ తెలుసు కోవలసి వచ్చింది. నాకు నేనై ఉత్సుకతతో ఈ సంగతులన్నీ తెలుసుకోనందుకు నాలో నేనే తెల్లబోకతప్పలేదు. దూరంగా

గ్రామఫోన్ మోగుతోంది. రవంత దక్షిణపుగాలి వీస్తోంది. నిఖిలబాబుగారి డాబామీద చీకట్లో నేను కొంచెం పరధ్యా నంలోపడి కూర్చున్నాను.

"ఇన్ని జరిగినా అనార్కిస్టులతోటి సంబంధం సంగతి పైకి రాకపోయినట్లయితే అతడికి బహుశా ఉరిశిక్ష తప్పేదే" అన్నాడు నిఖిలబాబు నశ్యం పీలుస్తూ...

"అనార్కిస్టులతో సంబంధం అంటే?"

"మీరేమీ విననేలేదా?"

నాలో నేను తెల్లబోతూ "లేదే!" అన్నాను.

"పోలీసులు స్వర్ణేందుని పరారీలో ఉన్న విప్లవకారు లలో ఒకణ్ణిగా గుర్తించారు. ఒకదాంతో కాదు రెండుమూడు రాజకీయ హత్యలతో అతడికి సంబంధం ఉందట! అతడికోసం వాళ్ళు గాలిస్తూనే ఉన్నారట! వంశీ 'అప్రూవర్'గా మారతా డేమో అన్న భావనతోనే అతణ్ణి హత్యచేశాట్ట:—ఇదీ వాళ్ళ 'థియరీ'..."

నిఖిల చౌధురీ లేచి డాబామీద పచార్లు చెయ్యటం మొదలెట్టాడు. నేను మెదలకుండా కూర్చుని ఉన్నాను.

'దుస్సహం!'

నిఖిల చౌధురీ మళ్ళీ వచ్చి కూర్చున్నాడు.

తర్వాత హఠాత్తుగా నా మీదికి వంగి, నిష్ఫలమైన ఆక్రోశాన్నేదో అణచుకుంటున్నట్లు గర్జిస్తూ "తెలుసా? స్వర్ణేందు నవ్వుతూ దాన్నికూడా ఒప్పుకున్నాడు. 'డామ్ హీజ్ స్మైల్'" అన్నాడు.

మళ్ళీ లేచి పచార్లు చెయ్యసాగాడు.

కొంచెం వెనకాముందాడుతూ—అప్రియమైన సత్యాన్ని వినటానికి మనస్సుని ఆయత్తపరచుకుని, "అతడికి ఉరి యెప్పుడు?" అని ప్రశ్నించాను.

"నిన్ననే ఉరి తీసేశారు"

గాలి స్తంభించలేదు. ప్రక్కనే ఎవరింట్లోనో మోగుతున్న గ్రామఫోనూ మోగుతునే ఉంది. చమేలీ వచ్చి వంట అయింది అని చెప్పింది నిశ్శబ్దంగా క్రిందికి దిగి వెళ్ళాం. ఫ్రెంచి కట్‌లెట్, మొదలయిన పదార్థాలన్నీ రుచ్యంగానే ఉన్నాయి. అయినప్పటికీ ఏదో స్వల్పమైన కారణాన్ని పురస్కరించుకుని నిఖిలబాబు చమేలీని కూకలేశాడు. చమేలీ నోరెత్తకుండా, నవ్వు మొహంతో నుంచుని ఉంది. అర్థాత్తూ ఎలా జరిగేవి అలా జరుగుతునే ఉన్నాయి. స్వర్ణేందుకి ఉరి పడటంవల్ల ఏమీ ఆగనూలేదు; ఏమీ మారనూ లేదు. స్వర్ణేందు నిర్దోషి అని నిస్సంశయంగా తెలిసినప్పటికీ, నాకు భోజనంమీది ఆసక్తి రవంతయినా తగ్గలేదు. బాగా తినటం మొదలెట్టాను. స్వర్ణేందు కోర్టులో అబద్ధం చెప్పినట్లు రుజువుపరచగలిగిన సంగతిని ఇప్పుడే విన్నాను. రాత్రి ఆ రోజున తెల్లవారుఝామున మధుపురం వెళ్ళటం అన్న ప్రసక్తే లేదని స్వర్ణేందుకు తెలుసు. రాత్రి జ్యోతిర్మయుణ్ణి తీసుకురావటానికని స్టేషన్‌కు వెళ్ళింది. మళ్ళీ తిరిగిరాలేదు.

నిఖిలబాబు మూడో కట్‌లెట్ తినటం పూర్తిచేసి, నాలుగోదానికి ఉపక్రమిస్తూ చప్పున – "కాని ఈ దుర్వార్తని చెప్పుదామని ఉద్దేశ్యంతోనే నిన్ను లాక్కుని రాలేదు. మరొక దారుణమైన వార్త ఉన్నదొకటి" అనేశాడు.

"అదేమి టికా?"

"రాత్రి అవనీశుడితో కలిసి బొంబాయినుంచి ఎల్లుండి వస్తోంది."

ఈ వార్త వినగానే నా ముఖ కవళిక ఎలా మారిందీ చెప్పలేను. కాని నిఖిలబాబు బహుశా అదిగమించేకాబోలు. "మీరలా వెలవెలపోతే లాభంలేదు. ఈ దెబ్బను మీరుండే సద్దుకురావాలి. వాళ్ళు ఇక్కడికే వచ్చి దిగుతామని రాశారు. తనకేదో చాలా అవసరమైన పని ఉందని అవనీశబాబు రాశాడు. కాని నేను ఉండటంలేదు. అతడి అవసరమైన పనేదో నా తరఫున మీరుండి చూసిపెట్టండి" అన్నాడు.

"మీరెక్కడికి వెడుతున్నారు?"

నేనాసించనిసమాధానం ఒకటి చెప్పాడు నిఖిలబాబు.

"పెళ్ళిచేసుకోటానికి"

"పెళ్ళిచేసుకోటానికా? ఇన్నాళ్ళకి మళ్ళా ఇదేం ఖయాలీ?"

"ఖయాలీకాదు. అవసరం. సహజమైన సమాజజీవితం గడపాలంటే పెళ్ళిచేసుకోవటం అవసరం. అస్వాభావికమైన ఉత్తేజనమధ్య ప్రతిభావంతులైనవారుమాత్రమే సుఖంగా ఉండగలరు. నాలాంటివాళ్ళవల్ల కాదది."

తర్వాత మళ్ళీ చిరునవ్వునవ్వుతూ—"అదీకాక చమేలీని అదుపులో పెట్టటానికి ఒకవ్యక్తి అవసరం. ఇప్పుడు మరీ హద్దు మీరిపోయింది" అన్నాడు.

ఎంతో కుతూహలం కలిగి అని చెప్పటానికి వీల్లేదు. కాని ఈ ప్రసక్తిలో ఏదో ఒకటి అడగాలికదా అనే భావన తోనే "ఎక్కడ చేసుకుంటున్నారు పెళ్ళి?" అని అడిగాను.

"ఓ కుగ్రామంలో నల్లగా, అందవికారంగా, లావుగా ఉన్న అమ్మాయిని చేసుకుంటున్నాను. ఆమె ఆరోగ్యవతి అన్న దొక్కటే ఆమెలో ఉన్న మంచిలక్షణం. అందకత్తెలనీ, స్లిమ్‌గా, తెలివిగా ఉండే యువతుల్నీ చూసిచూసి విసుగెత్తి పోయింది మనస్సు.

నిరర్థకం అని తెలిసికూడా అన్నాను – "మీలాంటి వారు ఇలాంటిపెళ్ళిచేసుకోవటం –"

నా మాట పూర్తి కానీయకుండానే నిఖిలబాబు – "వంశం నిలపటానికి" అన్నాడు. తర్వాత కాసేపాగి, అస్ఫుట కంఠంతో "దుస్సహం!" అన్నాడు.

ఉభయులం ఇంక మాట్లాడకుండా భోజనం చెయ్య సాగాం.

నా మనస్సులో ఒక్కవిచారమాత్రం మేఘంలాగా రక రకాలుగా అల్లుకోసాగింది. రాత్రివస్తోంది. జ్యోతిర్మయుడితో కాదు, అవనీశుడితో ... స్వర్ణేందు లేడు. నిఖిలబాబుకూడా ఉండడు!

చటుక్కున పెనుగాలి ఆగిపోయింది.

సన్నాయిడోలు – ఒక్కసారే ఆగాయి. నాలుగు వైపులా నిశ్శబ్దత అలముకుంది. ఆ నిశ్శబ్దతని చీల్చుకుంటూ ఉడతమాత్రం చిక్ చిక్ చిక్ మని కూస్తోంది...

# 8

కార్యకారణాలనేఅంటే సంబంధం అవిచ్ఛేద్యం. ఆతర్వాత జరిగిన సంఘటనలకి కూడా - ఆ కారణాలన్నీ నాకిప్పుడింత స్పష్టంగా జ్ఞాపకం లేకపోయినా - చాలా కారణాలున్నాయి. అన్ని సంగతులూ ఆలోచించి చూసుకుని నే నిప్పుడీ సిద్ధాంతానికి వచ్చాను...ఏమయితేయేం - ఈ సంగతి మాత్రం ఇప్పుడు నాకు గుర్తుంది. అవనీశుడికి సమాజంమీద, వ్యాపారంమీదా వున్న ఆసక్తి ఇంకొంచెం తక్కువగా వెల్లడి. అయి ఉన్నట్లయితే నేను ఆరోజున అర్ధరాత్రి నిఖిలచౌధురీ గారి డాబామీద చాటుగా నుంచుని, రాత్రి యేడుపును చూసి ఉండకపోయినట్లయితే, మోహపు వెల్లువలో పడి, కుసంస్కారాలులేని, అతి ఆధునిక ఆత్మత్యాగినని ప్రచారం చేసుకోవటమేకాదు. స్వప్రమాణంగా చెప్పుకోవాలనే ప్రబల మయిన ఆకాంక్ష నాకు కలగకుండా ఉన్నట్లయితే- బహుశా ఇలా జరిగేదికాదు. ఈ చిన్నకారణమే ప్రధానమయిందని చెప్పటానికి నే నొప్పుకోను. ధరణీబాబు, నిఖిలబాబుల అభిప్రాయం మాత్రం అదే...మొదటి రెండు కారణాలూ లేక పోయినట్లయితే నా మోహాన్ని ప్రదర్శించుకోవటానికి కాని ప్రదర్శించుకోవాలనే ప్రేరేపణ కలగటానికికాని అవకాశం లభించేదికాదు బహుశా. మొక్క మొలవటానికి క్షేత్రమూ బీజమూ రెండూ సమానమైన ప్రాధాన్యం కలవే...

అవనీశుడి సంగతి ఆలోచనకిరాగానే - నేను చాలా చిన్నప్పుడు చూసిన ఓ స్టేషన్‌మాష్టరు సంగతి గుర్తుకొస్తూ

ఉంటుంది. స్టేషన్ పేరేదో గుర్తులేదు. అసలది ఏ రైల్వేలైన్ మీావిదో అదీ జ్ఞాపకంలేదు కాని ఆదృశ్యం మాత్రం స్పష్టంగా గుర్తుంది; చాలా చిన్నస్టేష నది అక్కడ ఏరైలూ ఒక్క నిమిషంకంటె ఎక్కువసేపు ఆగదనుకుంటా. స్టేషన్లో కొంత భాగమే స్టేషన్మాస్టరు 'క్వార్టరు'. చుట్టూ బావురుమంటూ మైదానం. మా రైలు అక్కడికి వచ్చేసరికి సూర్యాస్త మయం అవుతూ అవుతూ ఉంది. అస్తమిస్తున్న సూర్యుని అరుణ కాంతులు నాలుగుప్రక్కలా వ్యాపించాయి. స్టేషన్ ప్రక్కనే బలిష్టంగా నునుపు తేలిన ఆవు ఒకటి కట్టేసి వుంది. ఆ ప్రక్కనే ఒక ప్రౌఢవ్యక్తి, ఒంటిని చొక్కాలేకుండా తల వంచుకుని, కుడితికలుపుతూ నుంచున్నాడు. మోచేతులు పైవరకూ కుడితి అంటుకుని ఉంది. రైలురాగానే అతడు తల పైకెత్తి "ఒరేయ్ ఫకీరాయా!" అని కేకేశాడు. ఫకీరాయా స్టేషన్లోంచి ఓ టోపీతీసుకుని, పరుగెత్తుకొచ్చి, ఆ టోపీ అతడినెత్తిమీాద పెట్టాడు. టోపీమీాద యస్. యమ్. అనే అక్షరా లున్నాయి అతడా కుడితిచెయ్యి అలాగేపైకెత్తి 'ఆల్ రైట్; ఆల్ రైట్' అన్నాడు ఫకీరాయా టంగ్ టంగ్ మని గంటకొట్టాడు. లైన్ క్లియర్ ఇచ్చాడు. గార్డు విజిల్ వేశాడు. రైలు కదిలిపోసాగింది. అవనీశుడికి – ఆ స్టేషన్మాస్టర్కీ పైకి అంతగా పోలికలులేవు కాని, ఆంతర్యంలో చాలా పోలిక లున్నాయి. ఉభయులూ లాభదృష్టిఉన్న అతిస్వార్థపరులు. ఇద్దరూ నల్లగానే ఉంటారు. ఇద్దరూ తమ కుటుంబవ్యవస్థకి ముప్పురాకుండా చూసుకోవటంలో నిమగ్నులై ఉండేవాళ్ళే. అవనీశుడి మొహంచూడగానే అతడు మరీ అంత కుటిలుడని

అనిపించదు. సూట్ వేసుకుంటాడు. పొట్టిగా, నల్లగా ఉంటాడు; మొద్దు పెదవులు, బుర్రముక్కు. కాని ఎన్ని ఉన్నా తెలివిగల ముఖంలా కన్పిస్తుంది. అంచేతనే మొహం కొంచెం కళగా ఉంటుంది. చూడగానే, అంటే పరిచయం కాకముందు విశ్వ సించతగినవ్యక్తి, సమర్థతఉన్నవాడూ అని అనిపిస్తుంది. పరి చయం అయినాక సమర్థతఉన్నమాట వాస్తవమే కాని, ఆ సామర్థ్యంలో అరవీసమైనా ఇతరులకోసం వెచ్చించాలంటే వెనుతీసేవాడని బోధపడుతుంది. 'హోటూ' ఉంది; పిలకా ఉంది. రెంటినీ శిరసావహించాడు. వ్యాపారదృష్ట్యా నిరామిష భోజనం చెయ్యటంకూడా ఓ అవసరమైన అంశమేమో అని పిస్తుంది నాకు. ఈ దేశంలో పరిశుద్ధమైన నేతి వ్యాపారంచేసే వారికి ఇలాంటివన్నీ తప్పకుండా ఉండవలసినవి...!

రాత్రిని తీసుకుని అవనీశుడు వచ్చాడని చమేలీవచ్చి చెప్పినప్పుడు నామనస్సుకి ఆశకంటె ఆశంకే ఎక్కువకలిగింది. 'ఆమె యెప్పుడూ పెదవికదల్చి మాట్లాడేది కాదుకదా అని తెలిసితెలిసి ఆమె కేమాత్రమూ యిష్టంలేని వ్యక్తిచేతుల్లో పెడతామూ ఆమెని?' అని స్వర్ణేందు వెనక ఒకసారి అన్న మాట జ్ఞాపకం వచ్చింది. ప్రబలుడైన అవనీశుడికి ఆహుతి కాకుండా రాత్రిని ఉద్ధరించగల శక్తి బహుశా నాలో లేదేమో అని భయం వేయసాగింది. రాత్రి మీద నాకేం అధికారం ఉంది? వారికి విరుద్ధంగా ఏదైనా చెయ్యటానికి మాత్రం ఉప పత్తి ఏముంది?

నిఖిలబాబుగారి ఇంటికి వెళ్ళగానే అవనీశుడు కన్పించాడు. క్రింద ఆఫీసుగదిలో అతడు ఒంటరిగా కూర్చుని ఉన్నాడు. చేతిలో ఓ పెన్సిల్ మాత్రం ఉంది. నన్ను చూడగానే అతడు హఠాత్తుగా లేచి నిలబడి. "రండి, దయచేయండి. తమకోసమే యెదురు చూస్తున్నాను డాక్టరుగారూ! నేను అవనీశుణ్ణి" అన్నాడు.

నమస్కార ప్రతినమస్కారాలయినాక కూర్చున్నాం.

నాకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండానే మళ్ళీ —"సరే కానీండి — బౌబజారులోని ఏ నేతికమీషన్ వ్యాపారస్థుడి నయినా ఎరుగుదురా మీరు?" అని అడిగాడు.

"ఎరుగను"

"పోనీ ఎవర్నయినా బ్రోకర్ని ?"

"ఉహుం"

పెదవులు రెండూ యెడంచేసుకుని, పెన్సిల్‌తో పంటి మీద నెమ్మదిగా తాటించుకుంటూ ఏదో ఆలోచించసాగాడు. తర్వాత హఠాత్తుగా టెలిఫోన్ - గైడ్ తెరచి, ఓ నంబరు వెతకి, వారికెవరినో ఫోన్‌లో పిలిచి, హిందీలో నేతి వ్యాపారాన్ని గురించి ఏదో మాట్లాడసాగాడు.

ఇన్నాళ్ళనుంచీ అవనీశుడు — రాత్రిని గురించి, అరుణోదయరక్తిమతో కూడిన ఏ మంచుతెరయితే నా మనస్సులో అల్లుకపోయిందో — అదికాస్తా చటుక్కున ఓ పెద్ద గాలి విసురికి ఎక్కడిదక్కడ తెగిపోయింది. 'డాట్స్'లో వేసే చిత్తరువంటూ ఒక రకం ఉన్నది. ఒక వైపునుంచి చూస్తే ఒక

రకంగా, రెండో వైపునించి చూస్తే మరొక రకంగా కన్పిస్తుందది. ఒకే చిత్రపు – ఒక వైపునుంచి చూస్తే సుందరి ముఖం కన్పిస్తుంది. దాన్ని తలకిందుచేసి చూస్తే 'ఒరాంగ్‌టాంగ్' కన్పిస్తుంది. ఆ చిత్రపుని తల కిందువైపునుంచి చూసి నేనేమిటో విభ్రాంతుణ్ణయిపోయాను.

"ఆఁ, ఆఁ ఇప్పుడే...తక్షణం"

రిసీవర్ కిందపెట్టి, అవనీశుడు లేచి విలబడ్డాడు. బట్ట తల తడుముకుంటూ "రండి డాక్టరుగారూ! టాక్సీలో మాట్లాడుకుందాం. మీతో మాట్లాడవలసిన విషయాలు రెండున్నాయి. నిఖిలబాబు లేరు కనుక 'నెక్స్ట్ బెస్ట్‌మాన్' మీరే ఇహ" అన్నాడు.

"ఎందాకా వెడుతున్నారు మీరు ?"

"ఎంతో దూరంకాదు, బౌబజారుదాకా. తర్వాత ఈ రాత్రి హోటల్లో ఎక్కడయినా ఓ గది చూసుకోవాలి. నేను మళ్ళీ రేపే వెళ్ళిపోవాలి. బహుశా మళ్ళీ ఇంక మిమ్మల్ని కలుసుకోలేనేమో!"

"హోటల్లో గది ఎందుకు ?"

అవనీశుడు కొంచెం నవ్వి, "నేనుండటానికి" అన్నాడు.

"రాత్రి రాలేదా ? ఆమె ఎక్కడుంది?"

"ఆమె మేడమీద ఉంది. ఇక్కడే ఉంటుంది రండి మీరు."

రోడ్డుమీదికి వచ్చి, టాక్సీఒకటి పిలిచి ఇద్దరం అందులో ఎక్కి కూర్చున్నాం. టాక్సీలో ఎక్కగానే అవనీశుడు ఆత్మీయత ఉట్టిపడుతున్న కంఠంతో "నేను మిమ్మల్ని గురించి చాలా

విన్నాను. మీరచనలుకూడా చాలా చదివాను. అంచేతనే మీరు నన్ను అపార్థం చేసుకోరని ఆశిస్తున్నాను" అన్నాడు.

నేను కొంచెం విస్మితుడినై చూస్తూ ఊరుకున్నాను.

"ఈరాత్రి ఈయింట్లో గడపటం ఇష్టంలేదు నాకు. రైల్లో కూడా మేమిద్దరం ఒకే పెట్టెలో కూర్చుని ప్రయాణంచెయ్య లేదు. వేరేవేరే పెట్టెల్లోనే ఎక్కాం" ఆ మాటతో నా ఆశ్చర్యం మరింత అధికమవటం గమనించి, కొంచెం నవ్వుతూ - "విడివిడిగా ప్రయాణంచేశామని దాఖలాగా ఉండటానికిగాను రెండు కంపార్ట్‌మెంటుల్లోని రెండుబెర్తులు రిజర్వుచేయించాను, ఇక్కడకూడా 'డాక్యుమెంటరీ ఎవిడెన్స్'ఉండటానికి హోటల్లో ఉందామనుకుంటున్నాను" అన్నాడు.

ఆ వ్యవహారమేమిటో బోధపడలేదునాకు. "అలాచెయ్యటంలో ఆంతర్యం ఏమిటి?" అని అడిగాను.

"ఆంతర్యం ఏముంది? మీరు డాక్టర్లు. రెండురోజుల్లో గ్రహించగలరు. స్వర్ణేందు మిత్రుడనేభావంలో నా కర్తవ్యం ఎంతవరకో అంతవరకూ చేశాను. ఆమెని ఆమె కాత్మీయులైన వారియింటికి చేర్చి వెడుతున్నాను. పూర్ణేందుబాబుగారి ప్రస్తుతపు అడ్రస్ ఏదో తెలుసుకుని, అవసరమనుకుంటే మీరామెని అక్కడికి చేర్చగలరు. నేను చేతులుకడుక్కుని వెనక్కి వెళ్ళి పోదామనుకుంటున్నాను."

"జ్యోతిర్మయబాబు ఎక్కడ?"

అవనీశుడు చిత్రమైన నవ్వొకటి నవ్వాడు.

ముఖం కొంచెం వంకరగా పెట్టి, 'అహ్హా హా' అని నవ్వి "అయితే మీకు జ్యోతిర్మయబాబుసంగతి తెలుసునన్న మాట!" అన్నాడు.

"కొంత విన్నాను"

"క్రమశః ఇంకా వింటారు"

అతడి కంఠస్వరం ఏదో విచిత్రంగా మారింది. బుర్ర ముక్కు క్రింద మొద్దుపెదవులు రెండూ ఏదో మాట్లాడటానికి కదిలినట్లే కదిలి మళ్ళీ మూసుకుపోయాయి.

"జ్యోతిర్మయబాబు ఎక్కడున్నా రిప్పుడు?"

"ప్యారిస్‌లో కొంచెండబ్బు పోగుచేసుకుని ఆర్టునిగురించి చర్చించటానికి ప్యారిస్ వెళ్ళాడు. ఏమయినా ఆర్టిస్టుకదా"!

నే నేమీ మాట్లాడకుండా ఊరుకున్నాను.

అవనీశ్ బౌబజార్లో టాక్సీ ఆపి, చాలా కొట్లలోకి వెళ్ళాడు. చివరికి ఓసందులో దూరాడు. నేను టాక్సీలోనే మెదలకుండా కూర్చున్నాను. స్టేషన్‌మాష్టరు రూపం కన్పించింది మనస్సుకి. ఆఫీసు టైములో ఆవుకి కుడితి పెట్టటంలో అంతర్గర్భితంగా ఉన్న పాలమీది అత్యాశతో కూడిన అతడి మనః ప్రవృత్తి ఏదైతే వ్యక్తమయిందో, మనలో చాలా మందిది అలాంటి మనఃప్రవృత్తే. జీవితంలో ఆనందం అనేది గృహకృత్యాలు చూసుకోవటంలోనే ఉంటుంది కాని, ఉద్యోగంలో కాదు. ఆ గృహసౌకర్యాలకి భంగంరాకుండా చూసుకోవటం కోసమే ఉద్యోగాన్ని నిలుపుకోటానికి ప్రయత్నించటం. ఇంటిపనులకి, ఉద్యోగవిధులకీ ఏనాడయినా పొత్తు కుదరకపోవటమంటూ తటస్థిస్తే, ఆ స్టేషన్‌మాష్టరు ఉద్యో

గానేన్న వదులుకుంటాడుకాని, ఇంటిపనులు మాత్రం మానుకోడు. వేటికీ భంగం రాకుండా ప్రేమజీవితం సాగేట్లయితే అవనీశుడిష్టపడతాడు దానికి. కాని ఇలాంటి యువతిమూలంగా తనపేరు ప్రతిష్ఠలకి భంగం వాటిల్లితే? అవనీశు డేమయినా అందుకు ఒప్పుకోడు. అవసరమయితే నిరామిషం భోజనం మాట, తాను పిలక కూడా ఉంచుకున్న సంగతేకాదు, రాత్రితో కళంకాన్ని తెచ్చిపెట్టే ఎలాంటి సన్నిహిత సంబంధమూ లేదని 'డాక్యుమెంట్స్' చూపించి మరీ ప్రమాణపూర్వకంగా రుజువుచెయ్యగలడు. అతడు తన వ్యాపారరీత్యా కలకత్తా వచ్చాడు. స్నేహితుడి చెల్లెలనే భావంతోనే-మరొక కంపార్ట్‌మెంట్‌లోని బెర్తుమీద కూర్చున్న రాత్రికి మధ్య మధ్య ఏమయినా కావాలేమో కాస్త కనుక్కుంటూవచ్చాడు అంతే. అంతకంటె మరేంలేదు.

కాసేపటికల్లా అవనీశుడు తిరిగివచ్చాడు.

తిరిగి రాగానే "ఫర్వాలేదులే. వెయ్యిరూపాయల వ్యాపారం జరిగింది. ట్రిప్పు ఊరికే పోలేదు" అన్నాడు.

నేను మర్యాదకి - అతడిమాటని సమర్థిస్తూ ముసిముసి నవ్వు నవ్వాను. అవనీశుడు ఓ పేరుపడిన హోటల్‌కి వెళ్ళి చేరాడు. నన్ను 'బెన్‌టోలా'కి తీసుకువెళ్ళి దిగబెట్టమని, అందుకయ్యే బాడుగ ముందుగానే ఇస్తానని టాక్సీడ్రైవర్‌ని పిలిచి చెప్పాడు.

"గుడ్‌నైట్"

"గుడ్ నైట్"

జనప్రవాహం మధ్యనుంచి టాక్సీ వసగెత్తుతోంది.

నేను మెదలకుండా కూర్చుని ఉన్నాను.

♦ ♦ ♦

"మీ రేమనుకున్నారు? అసహ్యాదాయకమైన వంశీ ప్రలాపనని జ్యోతిర్మయబాబువస్తే వింటాడేమో అన్నసంగతి తెలిసిఉండికూడా, నేను నోరుమూసుకుని కూర్చుంటాననుకున్నారా? కాని స్టేషన్‌కివెళ్ళి చూశాను. జ్యోతిర్మయుణ్ణి ఇక్కడికి రానిస్తే వీల్లేదు. అతడికళ్ళు సవితమీాది వ్యామోహంతో మూసుకుపోయినట్లున్నాయి. అతడు నాకేసి చూస్తూవున్నా సవితమీాదనే ధ్యాసపెట్టుకుని ఉండటం గమనించాను. అది గమనించినతర్వాతకూడా, సవిత ఇంటివెళ్ళే అవకాశాన్ని అతడికి కలగనిస్తానా? అదీకాక అతడురాగానే పోలీసుల చేతుల్లో పడొచ్చు. సవిత – పోలీసులు...అతణ్ణేమయినాసరే ఇక్కడికి రానివ్వలేదు. ఎలా వెనక్కి త్రిప్పి తీసుకువెళ్ళగలిగాను? కొరివిదయ్యాలు మార్గస్థుల్ని ఎలా పెడదారిని పట్టిస్తాయో, నిస్సహాయస్థితిలోఉన్న లేడిని పెద్దపులి ఎలాఅయితే మెడ కొరికేసి, సునాయాసంగా బుజానవేసుకుని పోతుందో – అలాగే...అయినా అతణ్ణి పట్టుకుని నిలపలేకపోయాను. ఏ హారిణమయితే చచ్చిపోయిందని అనుకుని నిశ్చింతగాఉన్నానో, ఆ హారిణమే నేనువరధ్యానంగా ఉండటాన్ని అవకాశంగా తీసుకుని హఠాత్తుగాబెదిరిపోయి దట్టమైనఅడవిలోకి పారిపోయింది."

ఊహూఁ. ఇవన్నీ రాత్రిచెప్పినమాటలు కావు. రాత్రిచెప్పినట్లు నేను ఊహించినవి. రాత్రిని మొన్నడూ నేనీసంగతుల్ని అడగనే

లేదు. అవకాశం దొరకలేదు. సాహసంలేక. మర్యాదనేది అడ్డువచ్చింది. అదీకాక ఎవరైనా సంశయనివృత్తి కోసమని ప్రశ్నిస్తారు సాధారణంగా. నా మనస్సులో సంశయమనేది అసలు లేనేలేదు. అన్నీ తెలిసికూడా ఎదుటివారిని తికమక పెట్టాలనే ఉద్దేశ్యంతో ప్రశ్నలు కురిపించే – మర్యాదయెరుగని వాళ్ళుంటారు కొందరు. ఇలాంటి ప్రశ్నలతో రాత్రిని నేను తికమకపెట్టగలనో లేనో నాకైతే తెలియదు; కాని ఆమెని అసలు తికమకపెట్టాలనే ఉద్దేశ్యమే నాకెప్పుడూ కలగలేదు

నేను ఊహించాను. ఆ రోజున రాత్రి నిఖిలచౌధురీ గారి డాబామీద చాటుగా నుంచుని ఉండి, ప్రక్కగదిలో ఏడుస్తూ పడుకున్న రాత్రిని చూసి నేను చాలాచాలా ఊహించుకున్నాను. కారుకమ్మిన అర్ధరాత్రివేళ, రాత్రి రహస్యంగా పడుకుని ఏడ్చింది. నేనా యేడుపు విన్నాను, చూశాను, నన్ను నేనే మరిచిపోయాను. నీళ్ళలో మంచుముక్క కరిగిపోయినట్లు నా మనస్సులో గడ్డకట్టుకుపోయి ఉన్న సంస్కారాలన్నీ మెల్లిమెల్లిగా కరిగిపోసాగాయి. శ్రావణమాసపు రాత్రివేళ – తెరపిలేకుండా కురిసేవర్షం హృదయంలో ఎలాంటి వైచిత్రాన్ని సృష్టిస్తుందో, ఆవైచిత్రి తాలూకు నిగూఢమైన అస్పష్టతలో బుద్ధి ఎలా పనిచెయ్యకుండా పోతుందో, సంశయపూర్వకమైన ఓ అనుభూతి కారణం లేకుండానే ప్రతిక్షణం తెలియని దేదో వచ్చి పడబోతుందని ఉగ్గపట్టుకుని ఎలా ఎదురుచూస్తూ ఉంటుందో – అలాగే అయింది నా మనస్సుకూడా. బహుశా అసంభవమైన దేదయినా సంభవమవుతుందేమో; బహుశా రాత్రి ఇప్పుడే లేచి కూర్చుని, 'నేను మీ న్యాయశాస్త్రాన్ని

ఒప్పుకోను. ధర్మాన్ని ఒప్పుకోను. దేన్నీ ఒప్పుకోను. నన్ను నేను మన్నిస్తానంటే, నేనంటూ ఓ వ్యక్తిని ఉన్నాను కనుకనే మీారు, ఈ జగత్తు ఇదంతా ఉండటం సంభవించింది - నాలోని వ్యక్తిత్వాన్ని అణచి నలిపి నాశనం చెయ్యనీయను, చెయ్య నీయను. మీావల్ల కాదు. నన్ను కట్టిపడేసి ఉంచటం మీావల్ల కాదు. మీా న్యాయచట్టాల్ని ఛిన్నాభిన్నం చేసేసి, నా వ్యక్తి త్వాన్ని నేను వెల్లడి చేసుకుంటాను. అని బిగ్గరగా అరుస్తుం దేమో!

కాని ఆమె యేమీా అనలేదు. ఆ స్వస్తమైపోయిన కేశజాలంతో బోర్లగా పడుకుని, కన్నీరు వరదలై పారేటట్లు ఏడ్చింది. నేను మెదలకుండా చూస్తూ నుంచున్నాను. నేను చూస్తూ నిలుచున్న సంగతి ఆమెకి తెలియడం, ఆమెలోని దుర్బలత బయటపడ్డ ఆ సమయంలో నామెనిచూాశాననీ ఆ తర్వాత ఎప్పుడూ నే నామెతో చెప్పలేదు. సామ్రాజ్ఞిలాగా దయతలచి నాకేదో ప్రశ్రయం ఇచ్చాననే ఆమె భావన. నే నేదో ఎంతో కుతూహలంతో ఆమె కృపాభిక్ష యాచించా ననీ, తనలోని ఉదారబుద్ధిని ప్రశంసించే అవకాశాన్ని నాకు కల్పించి నన్నేదో కృతార్థుణ్ణి చేశానని అనుకుంటోంది. ఆమె కిందపడి దొర్లుతూ ఏడ్వటంలో నేను ప్రత్యక్షంగా గ్రహించిన దాన్ని ఆమెకి తెలియచేస్తే నాకేమిటి లాభం? ఆమెని కించ పరచటంకావొచ్చు. సంకుచితురాల్ని చెయ్యటంకావొచ్చు. పరాజితమై. విధ్వస్తమైపోయిన ఆమె అహంభావాన్ని నీచుడి లాగా పరిహసించటం కావొచ్చు. రాత్రిని అవమానించాలనే కాపురుషత్వంకాని, నిష్ఠురతకాని నాలో లేవు. జ్యోతిర్మయుడి

సంగతి వేరు. అతడు విశుద్ధుడైన శిల్పి. అంచేత స్వభావతః నిష్ఠురుడుకూడా అయి ఉంటాడు. శిల్పులు వెలుగు లోకపు బాటసారులు ప్రతి యుగంలోనూ అంధకారమయమైన రాత్రిని అధిగమించి వారు ప్రయాణిస్తూ ఉంటారు. జ్యోతిర్మ యుణ్ణే తప్పుపట్టను నేను.

'రాత్రి అవనీశుడితో కలకత్తా ఎందుకు వచ్చింది?' ఈ ప్రశ్న నా మనస్సులో ఉదయించింది. అప్పుడు దానికి సమాధానం యేమీ తోచలేదు. కాని తర్వాత తోచింది. సవిత కలకత్తాలో ఉందో లేదో చూద్దామని వచ్చింది రాత్రి. సవిత కలకత్తాలోనే ఉంది....

## 9

కలకత్తానగరంలోని టాక్సీలు - ట్రాములకోలాహలం, జనం సందడి, ధరణీబాబు ఛద్మోద్వేగం, నిఖిలచౌధురీ నిష్కారణకోపం, రాఖాలబాబు వీలునామా, డి. కె. వర్ణన, డాక్టరీ జీవితపు సాఫల్య - వైఫల్యాలు, రచనాజీవితపు ఉత్సాహ నిరుత్సాహాలు-ఇన్ని ఉన్నా అయిదు చిత్రువులు మాత్రమే నా మనస్సులో చిత్రితమై వున్నాయి - బహుశా శాశ్వతంగానే చెరిగిపోకుండా ఉంటాయనుకుంటా.



గాఢాంధకారం. మైదానంలావున్న ఓ నిర్జనప్రదేశంలో రాత్రి పడుకుని వుంది. నేను ప్రక్కనే కూర్చున్నాను. మే మిద్దరంతప్ప ప్రపంచంలో మరెవరూ లేనట్లు - కలకత్తా

తన అతులితైశ్వర్యంతో సహా క్షణికమైన బుద్బుదంలాగా హఠాత్తుగా ఆవిర్భవించి ఇప్పుడే విలుప్తమైపోయిందా అన్నట్లు అనిపించసాగింది. చీకటిగుహలో ప్రవేశించిన మానవుడు దారి తప్పినట్లే - రాత్రి మనఃకుహరంలో ప్రవేశించి నేనూ దారి తప్పాను. కార్లధ్వనులు - దోమల సంగీతపు ధ్వనుల్లా వినిపిస్తున్నాయి. రాను రాను అవి వినిపించటంకూడా తగ్గుతోంది. మృత్యుముఖంలోవున్న రోగి నాడి క్రమంగా క్షీణమైపోతున్నట్లు-నాలుగువైపులావున్న వెలుగు క్రమక్రమంగా క్షీణిస్తూ వెలవెల పోతున్నట్లు తోస్తోంది మనస్సుకి. ఇంక తక్కిన ప్రపంచమంటూ ఏమీ ఉన్నట్లేలేదు. ఉన్నదల్లా అనుభూతి మయమయిన స్పందన ఒక్కటే మే ముభయులం ఆస్వాదనకి లయబద్ధంగా ఊగుతూ కాలప్రవాహంమీద తేలిపోతున్నాం. కాలగతికూడా క్రమక్రమంగా ఆగిపోతున్నట్లుంది. చైతన్యం మెల్లమెల్లగా మొద్దువారిపోతున్నట్లుంది. ఆమె దీర్ఘనిశ్వాస ధ్వనికి చటుక్కున ఉలిక్కిపడ్డాను. కలకత్తామహానగరం మళ్ళీ తన ఐశ్వర్యంతో సహా మా చుట్టూ ఆవిర్భవించింది. వెలుగూ చీకటీ మళ్ళీ యథాప్రకారంగా వచ్చేశాయి. ఇటుతిరిగిచూస్తే రాత్రి ఆదమరిచి నిద్రోతోంది.

♦ ♦ ♦

రోజంతా మబ్బు మబ్బుగానేవుంది.

ఊరికే తిరిగిరావటానికే బయలుదేరాం. ఎంతోవడిగా పరుగెత్తే రైల్లో - ఓ ఖాళీకంపార్టుమెంటులో కూర్చున్నాం ఇద్దరమూ. ఆరోజున మబ్బుల్ని చీల్చుకుని వెలికివస్తున్న సూర్యకాంతి - పూర్తిగా వచ్చేసిం దనటానికి వీల్లేదు - ఏదో

అలౌకికమైనదాని పూర్వాభాసలాగా – వస్తూ – వస్తూన్నట్లు మాత్రమే వుంది. ఆ రోజున ఆ హోరుగాలి – ఆమె ముంగురుల్నీ, ఆమె ధరించిన వస్త్రాన్నీ చీకాకుపరచటానికే వీచినట్లుంది. జపాకుసుమంలాంటి ఎర్రటి సిల్కుచీర కట్టుకున్నదామె. దానికి అంచు ఏమీలేదు. శిరస్సున అవగుంఠనంలేదు. కిటికీలోంచి బయటికిచూస్తూ మెదలకుండా కూర్చుని వుంది. ఒంటినిండా చీరెవుంది. ముఖం మాత్రమే పైకి కన్పిస్తోంది. ఆకాశంలో జ్వాలనాత్మకమైన నక్షత్రమేదో సంచరిస్తూంటే, దాని ముక్క ఒకటి పృథివ్యాకర్షణకి హాఠాత్తుగా భూమ్మీదపడితే దానికొస ఆరిపోయి నల్లగా ఉన్నట్లూ – మిగిలినదంతా ఇంకా జ్వలిస్తూనే ఉన్నట్లు తోచసాగింది. రెండువైపులా దిగంతవిస్తృతమైన మైదానం. క్రొత్తగా పడినరైల్వేలైను. వేగంగాపోతున్న రైలు – అది ఉయ్యాల లూగుతున్నట్లుంది. ఆమె హాఠాత్తుగా ఇటుతిరిగి నాకేసిచూసింది. ఆమె నిర్నిమేష నేత్రాలు ఒక్కసారి రెప్పలల్లార్చాయి. కుతూహలంతో మిశ్రితమైన ఓ మందహాసరేఖ ఆనల్లటి నేత్రాల్లో తళుక్కుమంది. మరుక్షణంలో ఆ నవ్వు పెదవులమీదికి పాకింది.

"మీకు చాలా విచారకరంగా ఉందనుకుంటాను; అవునా?"

విస్తుపోతున్న భంగిమలో – "లేదు, చాలా ఆనందంగా ఉంది" అన్నాను.

ఆమె తన కుతూహలదృష్టిని ఒక్కనిమిషంమాత్రం నా ముఖంమీద నిలిపి, మళ్ళీ ముఖం అటుత్రిప్పుకుని, కిటికీలోంచి బయటికి చూడసాగింది. హోరుగాలి మరింత హెచ్చింది. ఆమె

ముంగురుల్ని. చీరెనీ లుంగచుట్టిపెయ్యసాగింది. నా కెంచేత ఆనందంగా ఉన్నదీ ఆమె తెలుసుకోదలచుకోలేదు. కాని నిజానికెంచేతనో మరి నాకు ఆనందం కలగటంలేదు. విచారమే కలుగుతోంది. అంచేతనే కచ్చితంగా నాకు ఆనందమే కలుగు తోందని విశ్వసనీయమైన కారణాన్ని దేన్నీ వివరించి చెప్పలేక పోయాను.

న్యాయశాస్త్రాన్ని న్యాయశాస్త్రంతోనే ఒద్దికలోకి తెచ్చు కోవటంలో ఆనందం యెందుకుండదు!

ఆమె మళ్ళీ ఇటు తిరిగి నాముఖంకేసిచూసింది. కొన్ని క్షణాలపాటు అలాగేచూస్తూ ఊరుకుంది.

"మరి మీఆత్మీయులు? ఈసంగతి తెలిస్తే వారుకూడా ఆనందిస్తారా?"

"బహుశా ఆనందించరు. కాని వాళ్ళకి తెలియవలసిన అగత్యంఏముంది? జీవితంలో ఆనందదాయకమైనవాటిని చాలా మంది వీలైనంతవరకు సంరక్షకులకు తెలియకుండానే చేస్తూ ఉంటారు"

'ఆధునికత' అనే మద్యాన్ని సేవించినమాట వాస్తవమే. కాని ఒక్క గుక్కెడుమాత్రమే దానివల్ల మత్తెక్కటంకంటె మనఃక్షోభే ఎక్కువకలిగింది. అయినా నిజంగా మత్తెక్కినట్లే నటించాల్సి వస్తోంది. మత్తు అసలే ఎక్కలేదనికాదు. అయితే అది ఆధునికతనే మద్యాన్ని త్రాగటంవల్లకాదు. సనాతనత అనే సురని సేవించటంవల్ల.... దానిలో ఆధునికతా సంపర్కం లవలేశమైనా లేదు. యువతీసంపర్కంతో యువకులకు మొట్ట మొదట కలిగే మైకం అదే. ఆ మైకాన్ని ఆధునికతా ఛద్మ

దేహంతో, మిథ్యానందాతిశయసహకారంతో నిస్ప్రహతకింద నటించాల్సి వస్తోంది.

అతివేగంగా పరుగెడుతున్న రైలు ఉయ్యాలలూగు తోంది. రెండువైపులా దిగంత విస్తృతంగా ఉన్న పచ్చని మైదానం – మసుగ్గావున్న పగటివెలుగులో ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లుంది. ఆమె ముంగురులు, ఆమె కట్టుకున్న ఎర్రచీర ఆ హోరుగాలికి పిచ్చెత్తిస్తున్నట్లున్నాయి. నేను మెదలకుండా చూస్తూకూచున్నాను. మఖమల్ కోమలత్వంతో ఒప్పారే ఆమె నల్లటిముఖంలో – ప్రకాశింపని అపురూపమైన అరుణకాంతిని ప్రకాశింపచెయ్యటానికి ప్రయత్నించసాగాను.



మరొక రోజున హఠాత్తుగా సాహిత్యాన్నిగురించి చర్చ వచ్చింది.

రాత్రి తన తండ్రి దగ్గరకి వెళ్ళలేదు. వెళ్ళతలుచుకో లేదు. ఆమెకి ఉండటానికి – వేరే ఇల్లు కుదిర్చాను. ఇంటి యెదుట కాస్త ఖాళీప్రదేశం ఉంది. ఆ స్థలంకూడా ఆమె ఇంటిఎదురుగా ఉన్న మూడంతస్తులమేడ యజమానిదే. రోజూ బస్సుల్లో, ట్రాముల్లో, టాక్సీల్లో, రైళ్ళలో రాత్రిని నావెంటే సుకుని తిరుగుతున్నాను. భోజనమూ మొదలైనవి హోటల్లో. రాత్రి ఇష్టప్రకారం కేవలం పడుకున్నేందుకు మాత్రమే ఇల్లు అద్దెకి తీసుకోవటం జరిగింది. ఆ రోజున సాయంత్రం రాత్రి నా డిస్పెన్సరీకి రావలసింది. చాలాసేపు యెదురుచూశాను. కాని ఆమె రాలేదు. మిగిలిపోయిన 'కాల్స్' రెండింటికి కూడా హాజరై అక్కడినుంచి సరాసరి రాత్రి యింటికి వెళ్ళాను.

వెళ్ళి చూద్దామనుకదా, ఆ ఎదుట ఖాళీప్రదేశంలో జనం చాలా మంది మూగి ఉన్నారు. మూడంతస్తుల మేడాయన తండ్రి శ్రాద్ధపు మెతుకులకై అక్కడ మూగిన అలగాజనాన్ని ఒక్కొక్కళ్ళనే సాగనంపుతున్నాడు. కుంటివాళ్ళు, గుడ్డి వాళ్ళు, ఆడవాళ్ళు, మగవాళ్ళు, చిన్నవాళ్ళు – పెద్దవాళ్ళు – అందరూ చిరిగిపోయిన గుడ్డలతో కేగిపోయిన తలలతో ఆ ప్రదేశమంతా బిలబిలలాడుతున్నారు. ఆజాగా అంతా దుష్ట పదజాలంతో, దుర్గంధంతో నిండిపోయింది.

ఆ మైదానంవైపుకి ఉన్న కిటికీలన్నీ రాత్రి మూసి ఉంచడం చూశాను. బహుశా ఆ మూకమూలంగానే ఆమెకి బయటకి రావటానికి వీల్లేకపోయి ఉంటుంది. గొళ్ళెం కొట్ట గానే నౌకరు వచ్చి తలుపులు తీసి వెళ్ళిపోయాడు. పైకి వెళ్ళి చూశాను. రాత్రి చదువుకుంటోంది. నా దగ్గర చేరిన రక రకాల మాసపత్రికల్లో కొన్నీ ఆమెకి పంపించాను.

"ఈ రోజుల్లో సాహితీ సమాజంలో కూడా చాలా కక్షలున్నాయల్లే ఉందే!"

ఆ ప్రశ్నకి నేను సంసిద్ధుణ్ణయిలేను. అయినా జవా బిచ్చాను.

"ఎందుకుండవు? మనుష్యులు – ముఖ్యంగా రచయి తలు స్వతంత్ర భావాలు కలవాళ్ళు. ఎవరికి వారికి వేర్వేరు స్వతంత్రభావా లున్నాయి. వాటిని వెల్లడించుకునే అధికా రమూ ఉంది వారికి. అంచేత ఒకరికి ఒకరికి పడకపోవటం కక్ష లుండటం స్వాభావికమే."

"స్వాతంత్ర్యం మీదుండే అభిలాషే ఇంత పొత్తు లేక పోవటానికి హేతువంటారా మీరు? చాలా పత్రికల్లో—చాలా వ్యాసాలు చదివిన మీదట – నిజానికెవరికీ సాహిత్యంమీద స్థిర మైన అభిప్రాయాలనేవి లేవనీ—అందరూ వ్యాపారదృష్టితో రచ నలు చేస్తున్న వారనీ అనిపిస్తుంది నాకు."

"అలా అభిప్రాయపడటంలో అర్థమేమిటి ?"

"అర్థమా ! దేశంలో దరిద్రులైన ప్రజాసామాన్యాన్ని తీసుకుని సాహిత్యం వెలువడనంతవరకు—అది సిసలైన సాహిత్యం కాజాలదు – అని వ్రాసినతడు వస్తుతః ప్రకాశకుడో, ప్రకాశ కుని మిత్రుడో అయివుంటాడు. దరిద్రప్రజానీకాన్ని తీసుకుని రాసిన మరోపుస్తకానికి దేనికో 'పబ్లిసిటీ' ఇవ్వటం అతడి అసలు ఉద్దేశ్యమైవుంటుంది. మరొక ఇది చూడండి – ఇంకో పత్రికలో చదివాను – ఈ దేశంలో ప్రజాసాహిత్యం అనేది ఇంతవరకు పుట్టనేలేదని ఆ వ్యాసంలోని సారాంశం. ఇతడికీ ఆ మొదటి వ్యాసరచయితకీ శత్రుత్వం ఏదో ఉన్నదల్లేవుంది. మరొక పత్రికలో అభ్యుదయ సాహిత్యాన్ని గురించిన తర్జన భర్జనలున్నాయి. వాళ్ళ ఉద్దేశ్యంలో—"

ఆమెని అంతటితో ఆపి—"వీళ్ళంతా వ్యాపారదృష్టితో చేస్తున్న వారేననే సందేహం మీకెందుకు కలిగింది? ఆ వ్యాసా రాల్లో వారు చూపిన యుక్తులు అర్థసిద్ధంగాలేవా ?" అని ప్రశ్నించాను.

రాత్రి చిరునవ్వు నవ్వుతూ—"తెలివైనవాళ్ళు తమకను కూలమైనదో – ప్రతికూలమైనదో ఏదో ఒకయుక్తిని సుల భంగా సృష్టించగలరు. సమర్థుడైన న్యాయవాది ఒక్కొక్క—

వ్యాను ద్రోహినికూడా నిర్దోషి అని ఋజువు చెయ్యగలడు. అంతమాత్రాన సత్యమంతా అసత్యమైపోదు. ప్రేమికులు తాము ప్రేమించినవారి జాతి మత కుల భేదాలను గురించి ఆలోచించనట్లే - నిజమైన సాహితీపరులుకూడా ఇది ఏ సాహిత్యం కిందకి వస్తుందీ అనే మీమాంసలోపడి బుర్రలు చెడగొట్టుకోలేరు. మానవుల సుఖదుఃఖాలు, ప్రేమానురాగాలు, ఆశా నిరాశలు - అర్థాత్తూ ప్రజాజీవితాన్ని ప్రతిబింబింపజేసేదే సాహిత్యం. ఆ వ్యక్తి శ్రీమంతుడా - పేదవాడా, ప్రభువుగారి భార్యా-పాకీవాడి పెళ్ళామా అని చర్చించుకుంటూ కూర్చునే వాళ్ళు - పల్లెటూళ్ళలో ఉబుసుపోక రచ్చబండమీద కూర్చుని రాచకీయాలు చర్చించే ఆసాములసగోత్రులు... వాళ్ళు వర్తకులుకాని - సాహితీపరులు కారు.

వెయిటింగ్‌రూంలో రాత్రితో సాహిత్యచర్చ చేశాక మళ్ళీ ఆమెముందర సాహిత్యప్రసంగం తీసుకువచ్చే సాహసం లేకపోయింది నాకు. నా దగ్గిరున్న మాసపత్రికల్ని ఏదోరవంత ఆశతోనే ఆమెకి తీసుకొచ్చి ఇచ్చాననుకోండి. సాహిత్యాన్ని గురించి ఇటీవల రెండుమూడువ్యాసాలు-అదీ 'ప్రొలిటేరియట్ లిటరేచర్' మీదనే రాశాను, రాత్రి అభిప్రాయాన్ని విన్నాక. వాటిల్లో వెలిపుచ్చిన లోకాన్ని మభ్యపెట్టే సత్తాగల నా ఉద్వేగం ఆమెదృష్టిలో పడకుండా ఉండాలని మనస్సులో దణ్ణాలుపెట్టుకున్నాను. ఏదో ఒకసాకుతో నేను ఈ మాసపత్రికలన్నీ ఇక్కడినుంచి తీసుకు పోవాలి.

"ఎన్‌లార్జి చేయించటానికని ఇచ్చిన జ్యోతిర్మయుడి ఫొటో అయిందేమో?"

"ఎప్పుడు ఇస్తానన్నాడు?"

"ఇవాళే"

"అయితే వెళ్ళొద్దాం పద"

"ఆపాదుమూాకనంతా తీసుకుంటూ ఇవాళ బయటికి రావడం ఇష్టంలేదు నాకు. మీారే వెళ్ళిరండి"

ఆమె ఆదేశం. ఆఁ, ఆదేశమే. దాన్ని నిర్లక్ష్యంచెయ్య గల మానసికశక్తి నాకు లేదు. ఆమె ఎందు కాదేశించదు. ఆమె యేమీా దాచలేదు. జ్యోతిర్మయుడికిసంబంధించిన ఏవిష యమూా నాదగ్గిర దాచలేదు. అన్నీ తెలిసిఉండే నేనామెకి – కాదు పొరపాటుగా చెపుతున్నాను – నేనామెకి ప్రశ్రయ మివ్వలేదు. ఆమే నాకు ప్రశ్రయమిచ్చింది. అన్నీ తెలిసిఉండే నేనామెకి అర్ఘ్యాన్ని నివేదించాను. దాన్నామె స్వీకరించి నన్ను కృతార్థుణ్ణిచేసింది.

ఎందు కాదేశించదు!

బయటికి వచ్చేశాను. ఆ మూాకని తీసుకుని అతి కష్టంమీాద రోడ్డుమీాదికొచ్చిపడ్డాను. వీధి మూాలమలుపు తిరిగి అదృశ్యుణ్ణి అయిపోయేముందు వెనక్కి తిరిగి నే చూాసిన ఆ రూపం నామనస్సులో స్పష్టంగా హత్తుకుపోయిఉన్న దివ్వటికీ. రెండో అంతస్తులోని వరండాలో కటకటాలమీాదికివంగి రాత్రి నిర్వికారభావంతో నుంచుని ఉంది. ఆమె పాదాలచెంత అసం ఖ్యాకులైన భిక్షుకులు!

  

టెలిఫోన్ మోతకి నేను లేచి కూర్చునేప్పటికి రాత్రి రెండుగంటలయింది. కలకత్తా నగరమంతా నిద్రపోతోం

దప్పుడు. నా పడకగదిలో తెరచివున్న కిటికీలోంచి కనపడు తున్న ఆకాశంలో–చటుక్కున ఓ మెరపు మెరసింది. రయ్యన గాలి వీస్తోంది. ఆ రోజల్లా రాత్రిని చూడనేలేదు. సాయంకాలం వెళ్ళాను. కాని కనపడలేదు. ఆమె ఒక్కతే ఎక్కడికో వెళ్ళింది. రాత్రే ఎక్కడనుంచో ఫోన్ చేస్తున్నది కాబోలనుకున్నాను. గోకుల్ వచ్చి "నవీనబాబు—"

నవీన్‌బాబు ఎవరా అని ఆలోచించటానికి ప్రయత్నించాను. రోగులపేర్లు, పేటెంట్ మందుల పేర్లు జ్ఞాపకం పెట్టుకోవటం అనేది ఎంత దుస్సాధ్యమైన విషయమని! అయితేనేం. ఈ రెండూ నావృత్తికి అపరిహార్యాలు. నవీనబాబు పూర్ణేందుబాబుకి నేలువిడిచిన తమ్ముడని చటుక్కున గుర్తొచ్చింది. మంచం దిగి వచ్చాను. టపటపమంటూ వర్షంకూడా దిగింది. భూమిమీదికి! గాలి వేగం హెచ్చింది. నవీనబాబు ఫోన్‌లో "అన్నగారు ఏదోలా ఉన్నారు. తమరు దయఉంచి వెంటనేరండి" అని చెప్పాడు.

రాత్రి రెండు గంటలప్పుడు 'ఏదోలాఉండే' చాలా మంది రోగుల గాథలు తెలుసు. ఎవరివంతు వచ్చినా దయ ఉంచటంలో నే నేం వెనుతీయలేదు. కాని – పూర్ణేందుబాబు స్వర్ణేందు తండ్రి అన్నసంగతి పూర్తిగా జ్ఞాపకం వచ్చేసరికి నా వ్యంగ్య – తీక్ష్ణ – కఠినస్వరం కాస్తా చటుక్కున సన్నగిలింది.

ఆదరా బాదరా చొక్కా తొడుక్కుని, బూట్లు వేసుకుని, స్టెతస్కోప్, బాగ్ చేత పుచ్చుకుని, హఠాత్తుగా ఏదో ఒక టాక్సీ కనబడకపోతుందా అన్న ధైర్యంతో వీధిలోకి వచ్చేశాను. కలకత్తా మహానగరమే అయినా అంత రాత్రివేళ

ప్రయాణసాధనాలు దొరకటం సులభంకాదు. కాలిబాట మీాదినుంచి గబగబా నడవసాగాను. బ్రహ్మాండమైన కార న్యాలీస్ట్రీట్ నిర్జనంగా ఉంది. టపటప చినుకులు పడుతున్నాయి. గాలీ జోరుగా వీస్తోంది. రాత్రి సంగతి గుర్తొచ్చింది. ముఖ్యంగా ఆమె వచ్చినప్పట్నించీ పూర్ణేందుబాబుని చూడటానికి వెళ్ళ నందుకే మరీ జ్ఞాపకం వచ్చి ఉంటుందనుకుంటూ. 'ఎందుకు వెళ్ళలేదు?' అన్నప్రశ్న ఆమెని అడిగాను. ఆమెచెప్పిన సమా ధానం నిఖిలబాబు కయితే సంతోషజనకంగా కనిపించిందేమో కాని, నాకుమాత్రం అసంతృప్తికరంగానే వుంది.'వెడితే ఆయన అన్నయ్య సంగతి అడుగుతారేమో!' అని చెప్పింది. కాని ఆ చెప్పేతీరులో ఏదో కాపట్యం వున్నట్లుంది. ఆ కాపట్యా నికి కారణం ఏమిటో -అది ఆభాసగా నాకు తెలియకపోలేదు. కేవలం ఆభాసమాత్రంగానే సుమా! రాత్రి ఈ విషయంలో సుస్పష్టమైన సూచన నెందుకివ్వలేదో అదే ఆలోచిస్తూ నడవ సాగాను. ఎంతసేపు నడిచానో జ్ఞాపకంలేదు. టపటప చినుకుల వర్షం పడుతూవుండటం, ఖాళీగావున్న కాలిబాటమీాదినుంచి రాత్రి సంగతే ఆలోచించుకుంటూ నడిచి వెళ్ళటం మాత్రమే జ్ఞాపకం వుంది.

శ్యాంబారిటోలాలోని నవీన్‌బాబు యింటికి చేరుకో గానే, నవీనబాబు గబగబా బైటికివచ్చి 'ఏమిటో నిశ్శబ్దంగా పడుకుని ఉన్నా'రని చెప్పాడు. గదిలోకి వెళ్ళి చూశాను. సజీవ నేత్రంకూడా జాలిగా చూస్తున్నట్లే వుంది. నిద్ర రావటం లేదాయనకి. దీర్ఘనిద్ర వస్తోంది కళ్ళమీాదికి. ముఖంలో పరి

పూర్ణమైన ఆత్మ సమర్పణాభావం ప్రస్ఫుట మవుతోంది. పూర్ణేందుబాబు మరణించాడు!

తిరిగి వచ్చేటప్పు డొక టాక్సీ దొరికింది. రాత్రి కీ వార్త చెప్పిపోవటం కర్తవ్యమని మనస్సుకి తోచింది. రాత్రి బసకి చేరుకుని విస్మితుడైనాను. రాత్రి ఇంకా మేలుకునే వుంది. కిటికీలోంచి దీపం కన్పిస్తోంది. ఒక్కక్షణం మెదలకుండా నుంచుండిపోయాను. అప్పటికీ యింకా టపటప వర్షం పడుతూనే ఉంది. రయ్యిన గాలి వీస్తూనేవుంది. వీధిచివర నిలిపి వచ్చిన టాక్సీ హెడ్ లైట్ కాంతి నిశ్శబ్ద అంధకారాన్ని చీల్చేస్తోంది. నేను రాత్రి గది కిటికీ కేసి చూస్తూ మెదలకుండా నుంచున్నాను. రాత్రి ఇంతసేపటివరకూ ఎందుకు మేల్కొని ఉంది? ఒక్క రెప్పపాటులో - సంభవమూ, అసంభవమూ అయిన రకరకాలకారణాలు మనస్సులోకి గుంపుగావచ్చాయి; పోయాయి. గొల్లెం చప్పుడు చేశాను.

రాత్రి కిటికీ దగ్గిరకి లేచివచ్చింది.

"ఎవరు?"

"నేను"

"మీరా - ఇంత రాత్రివేళ!"

నౌకర్ని లేపకుండా తానే క్రిందికిదిగివచ్చి తలుపుతీసింది.

"ఇంతరాత్రప్పుడు హఠాత్తుగా ఏమి టిది?"

"పైకిరా, చెపుతాను. నువ్వింకా మేల్కొని ఉన్నావెందుకు?"

"ఉత్తరం రాసుకుంటున్నాను"

"ఎవరికి?"

"ఫర్నాండెజ్‌కి"

ఫర్నాండెజ్‌ని నే నెరిగిఉన్నట్లు - ఆ సంగతికూడా తెలుసు నన్నట్లు అంతమామూలు ధోరణిలో చెప్పింది. ఒక్క నిమిషంలో - చాలారోజుల క్రిందటి దృశ్యం మనస్సుకి గోచరించింది - కోల్‌టోలాస్ట్రీట్ మలుపులో స్వర్ణేందు - అతడిచేతిలో పత్రికచుట్టిఉన్న ఎర్రటి ఒరగల కత్తి - రాత్రి పుట్టినరోజుకి ఫర్నాండేజ్ కానుక...

నా కేమీ తెలియనట్లు "ఫర్నాండేజ్ ఎవరు?" అని ప్రశ్నించాను.

"ఫర్నాండేజ్ మాకు డ్రైవరుగా ఉండేవాడు. ఇవాళ సాయంత్రం మా పాత ఇంటిసంగతులు తెలుసుకుందామని వెళ్ళాను. ఫర్నాండేజ్ నాకు రాసినఉత్తరం, ఈఫొటో - అక్కడికి వచ్చిఉన్నాయి."

టేబిల్‌మీద ఫొటో పెట్టివుంది. పొడుగ్గా, బలిష్టంగా ఉన్న ఓ అబ్సీనియన్‌వ్యక్తిలాంటి వ్యక్తి!

రెప్పవాల్చకుండా ఫొటోకేసి చూడసాగాను.

హఠాత్తుగా కిటికీలోంచి రయ్‌న కొట్టిన గాలివిసురుకి రైటింగ్‌పాడ్‌లోని కాగితాలు ఫర్‌న చిరిగి ఎగిరిపోసాగాయి. రాత్రి ఫర్నాండెజ్‌కి పెద్దఉత్తరం రాయటం చూశాను. ఏం రాసిందోమాత్రం చూడలేదు. రాత్రి ఓ పుస్తకం తెచ్చి ఆ పాడ్‌మీద బరువుపెట్టింది.

"పూర్ణేందుబాబు ఇప్పుడే చనిపోయారు" అనిచెప్పాను.

రాత్రి ఆ మాటవిని ప్రమాన్పడిపోయింది.

తర్వాత చాలాసేపటికి "ఇన్నాళ్ళకి శాంతి లభించింది" అన్నది.

కాస్త యినా ఏడవలేదు.

తర్వాత హఠాత్తుగా - "సరేకాని, వెనుక ఓసారి మీ దగ్గిర ఓ సూట్ కేసుపెట్టి వెళ్ళాడు, ఉన్నదా అది?" అని అడిగింది

"ఉంది."

"రేపు తీసుకురండి దాన్ని"

"అలాగే"

ఒకర్ని ఒకరం స్థిరదృష్టితో చూసుకోసాగాం. బయట టపటప వర్షం పడుతూనేవుంది. జోరుగా గాలి వీస్తూనేవుంది. క్రిందసందులో పెద్ద టాక్సీ ఒకటి మూర్తీభవించిన చీకటిముద్ద లాగా అలాగే ఆగి వుంది.

♦ ♦ ♦

ఆ సినిమా - ఏదో ఓ మంచి నవల.

సాయంత్రం కాస్త తీరిగ్గా ఉండేట్టుగా ప్రొద్దునే పను లన్నీ చక్కపెట్టుకున్నాను. ప్రక్కప్రక్కనే రెండు సీట్లు ముందుగానే రిజర్వు చేయించాను. సరిగ్గా వేళకి రాత్రి బసకి వెళ్ళి తలుపు కొట్టాను. సమాధానం ఏమీ రాలేదు. చేతి గడియారంకేసి చూసుకున్నాను. ఇంకా అరగంటే వున్నది టైం. టాక్సీ చేసుకుని వెళ్ళకపోతే వేళకి అందుకోలేము. మళ్ళీ ఇంకోంచెం గట్టిగా తలుపుకొట్టాను. నౌకరు కుర్రాడు దిగి వచ్చాడు. తలుపు తెరిచి "అమ్మగారు అస్వస్థతగా వున్నారు" అని చెప్పాడు.

సుస్తీ చేసిందా? ఆదరా బాదరా పైకి వెళ్ళాను. ఎదుటి గదిలో ఎవ్వరూ కన్పడలేదు. పిలిస్తే జవాబురాలేదు. పడకగదిలోకివెళ్ళి చూశాను. అక్కడా ఎవరూలేరు. మళ్ళీ పిలిచాను, జవాబు రాలేదు. ఇక్కడా అక్కడా చూసి, చివరికి బాత్ రూం ప్రక్కనేవున్న చిన్న చీకటి గదిలోకి వెళ్ళిపోయి చటుక్కున ఆగాను. ఆ చీకటిగదిలో ఓమూల రాత్రి పడుకుని వుంది. ప్రసవవేదన పడుతోంది రాత్రి. ఏడవటంలేదు, వణికిపోవటమూలేదు. విధికి తనని సమర్పించుకుని, నిశ్శబ్దంగా నిశ్చలంగా పడివుంది. నేనూ నిశ్శబ్దంగానే నిలబడ్డాను. రాత్రి నా పాదాల అలికిడి విన్నది. చిరెజుట్టు సవరించుకుని, మెల్లిగా లేచి కూర్చుంది. తర్వాత నా ముఖంలోకి నిర్నిమేషంగా నిశ్చలంగా చూస్తూ 'ఇవాళే వచ్చేట్లుంది' అంది. నేను ఇంకో క్షణం కూడా అలాగే నిలబడి వున్నాను. కాని మరుక్షణం లోనే నా డాక్టరీ వివేకపు హెచ్చరికతో బయటికి పరుగెత్తుకు రావాల్సి వచ్చింది. అదివరకే మాట్లాడి వుంచుకున్న మంత్రసాని కోసం టాక్సీ చేసుకుని పరుగెత్తాల్సి వచ్చింది.

రాత్రి పన్నెండు గంటలు దాటాక రాత్రి సంతానం భూమ్మీద పడింది.

నేను ఆ బిడ్డకి 'ప్రభాత్' అని నామకరణం చేశాను.

## 10

ఇహ తర్వాత రచయిత తప్పనిసరిగా, నిరభ్యంతరంగా మంచి ఉద్వేగంతో చెయ్యవలసిన వర్ణనంతా నేను చెయ్యబోవటంలేదు. వసంత ఋతువుతాలూకు మంత్రదండ స్పర్శతో

మోడువాలిన చెట్లన్నీ మొగ్గ తొడిగినట్లు, అదృశ్యశక్తి ప్రభావంతో శిలలు బ్రద్దలై సెలయేర్లు పొంగినట్లు, వర్షాగమంతో ఎండిపోయిన నదులు కట్టల్ని ఒరుసుకుంటూ ప్రవహించినట్లు, సంతానవతి అయాక రాత్రి మాతృహృదయం కూడా అలా- ఊహూఁ. రాత్రి విషయంలో నే నిలాంటి స్వాభావికమైన వర్ణన చెయ్యలేను. అలా చేస్తే అది మిథ్యఅవుతుంది. నేను స్వయంగా చూశాను. సంతానాన్ని ప్రసవించి రాత్రి వికసోన్ముఖి కాలేదు; సెలయేటిలాగా పొంగిపోనూలేదు. ఆమె ఏమిటో శుష్కించిపోయింది. ముణుచుకుపోయింది. నిర్భీకమైన ఆమె సత్తా నిర్జీవమైపోయింది. ఆమెని చూస్తే ఆకాశంలో ఎగిరే విమానాన్ని ఎవరైనా గుండుదెబ్బతో క్రిందికి కూల్చివేశారా అనిపిస్తుంది. ఆమె కళ్ళలో వ్యక్తమైన మానభావంలో, మాతృహృదయపు స్నిగ్ధతలేదు. బాణం తగిలి రెక్కలు తెగి పడిపోయిన పక్షియొక్క మానవిలాపంలాంటి విలాపం ఉంది. ఆమెకి రోజంతా శాంతిలేదు, రాత్రంతా నిద్రలేదు. ఆ మాంసపిండానికి అనుక్షణం తీర్చవలసిన అవసరాలకి శక్తి అంతా ధారపోయటంలో నాకేమీ మహాత్వం కనిపించలేదు. తిరుగులేని న్యాయశాస్త్రానికి బలియై ఆమె ఏదో కఠినశిక్ష అనుభవిస్తున్నట్లు కన్పించింది నాకు. ఆమె మలినముఖాల, శంకితదృష్టి, విశీర్ణదేహం, మనస్సులో ఎంత విచారమున్నా పైకి ఛద్మగాంభీర్యం- లేదు. వాటిలో మహనీయత ఏమీలేదు.

ప్రభాత్ బంధితురాలిలా ఉన్న తల్లి వేదనని గ్రహించాడా? గ్రహించాడేమో అనే నా కప్పుడప్పుడు సందేహం కలుగుతూ ఉంటుంది. శిశువు మనం అనుకున్నంత అమాయ

కుడుకాడేమో నిజానికి – అనిపిస్తుంది. ప్రభాత్, తల్లి వ్యథ నిగ్రహించాడు. ఏనిగూఢమైన ఉపాయం ద్వారానో గ్రహించా డనిపిస్తుంది నాకు. అంచేతనే వాడు తల్లికి విముక్తి కలిగించి పోయాడు. కాకపోతే అంత అందంగా స్వస్థతగా ఉన్న శిశు వుకి హఠాత్తుగా మృత్యు వెందుకు సంభవిస్తుంది ?...

అస్వస్థతగా ఉండి, గాలి మార్పుకోసమని పశ్చిమ ప్రాంతంలోని ఈ పట్నానికి వచ్చి కూర్చుని, జరిగిపోయిన సంఘ టనల్ని నెమరుకు తెచ్చుకుంటూ ఈ కథ రాశానుకాని, నిజాని కిందులో నాకు తెలిసిం దెంత అని ఇప్పుడనిపిస్తోంది. అంతా అస్పష్టమే. కల్పనని, వాస్తవాన్ని, వెలుగునీ, చీకటినీ మిశ్రితం చేసి నేను సృష్టించిన ఈ రచనలో ఏది కల్పనో, ఏదిసత్యమో ఏది వెలుగో, ఏది చీకటో నాకేమీ తెలియదు. అసలంతా నా మనోవికారమే నేమో; ఎవరెరుగుదురు? అంతా మిథ్యే అయినా అవొచ్చు. కాని సంశయానికి తావులేని ఒక సత్యాన్ని మాత్రం నేను ఒప్పుకోకుండా ఉండలేను – నేను మోహాంధుణ్ణి. మోహం తాలూకు మాయా అంజనాన్ని కళ్ళకి పెట్టుకోవటంతో నేను అసహ్యంగా ఉన్నదాన్ని అందం గానూ, పాపాన్ని పుణ్యంగానూ, అసత్యాన్ని సత్యంగానూ చూసి, ఇతరులకికూడా చూపటానికి ప్రయత్నించాను. అధునిక యుగంలో సర్వనాశనదాయకమైన ఇలాంటి మనఃప్రవృత్తి బహుశా నాకే పట్టిందనుకుంటాను. అన్యాయాన్ని అన్యాయ మని యెరిగి ఉండికూడా, స్వీయ దౌర్బల్యానికి సిగ్గుపడాల్సింది పోయి, వ్రాయకలిగిన శక్తి ఉందికదా అని దాన్ని సుందరంగా

చిత్రించటానికి ప్రయత్నించాను. తెలుసుకునికూడా ఊరుకుని ఉండలేకపోయాను.

మూడో అంతస్తులోని గదిలో కూర్చుని రాస్తున్నాను. దిగంతంలో ఎక్కడో సూర్యుడస్తమిస్తున్నాడు. అటువైపున స్తూపాకారంలో ఉన్న మేఘం బంగారపు రంగుపూడి అద్దిన ట్లుంది. గుంపులుగుంపులుగా పక్షులు ఎగురుకుంటూ పోతున్నాయి. లంకల్లో మేసిన పశువులమందలు తిరిగివస్తున్నాయి. నదికి అటువైపున తాటితోపుకవతల స్వర్ణస్వప్నం రూపొందుతున్నట్లుంది. అటువైపున్న నీలమేఘం అంచునపడ్డకాంతి బంగారపు జరీలాగా ప్రకాశిస్తోంది.

డి. కె. చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి.

"వాళ్ళందరూ పాపపుణ్యాలబరువునంతా వదిలించుకుని మానస సరోవరంవైపుకి వెళ్ళారు. వాళ్ళు అలా చెంగుచెంగున కొండయెక్కి వెడుతూంటే నేను చూస్తూ నిలబడ్డాను."

హిమాలయప్రాంతాల్లో రాఖాలబాబు, స్వర్ణేందుతల్లి డి. కె. కి కన్పించారుట: వాళ్ళతో పరిచయంకూడా అయిందట! వాళ్ళతో నాకు పరిచయం ఉన్నదన్నసంగతి డి. కె. ఎరుగడు. అంచేతనే అతడు కలకత్తాకు తిరిగివచ్చి వాళ్ళ కథ నా కెంతో ఉద్వేగంలో చెప్పసాగాడు —

— రాఖాలబాబు భలే విచిత్రమైన వ్యక్తి భాయీ! భ్రష్టురాలైన తన భార్యని - భ్రష్ట అని తెలిసికూడా - ఒక రోజైనా విడిచిపెట్టలేదు.

నేను మెదలకుండా వింటూ ఊరుకున్నాను. ఏం మాట్లాడలేదు. కాని నా కళ్ళల్లో నా కనుబొమ ముడిలో ఆశ్చర్యం వ్యక్తమయిం దనుకుంటాను

విశ్వాసం కలగటంలేదా నీకు? నాకు ఎలా తెలుసు అని అనుకుంటున్నావల్లే ఉంది నువ్వు. రాఖాలబాబు భార్యే స్వయంగా నాతో చెప్పిం దొకసారి. బదరీనాథ్‌కి వెళ్ళేదారిలో ఒకసత్రంలో ఆగాం మేము. ఆరోజున బ్రహ్మాండమైనవెన్నెల. హఠాత్తుగా రాఖాలబాబుభార్య కెందుకో పిచ్చరేగింది! జుట్టు రేపుకుని, కళ్ళు పెద్దవి చేసుకుని – అదంతా ఒక విచిత్రగాథలే భాయీ! హఠాత్తుగా నాతో చెప్పటం మొదలెట్టింది – ఊహూఁ. నే నీ పాపభారాన్ని గుండెలమీద పెట్టుకుని బదరీ నాథ్‌కి రాలేను. గుండెపగిలి చచ్చిపోతాను. నువ్వు విను. నీకైనా చెప్పకుంటే నా గుండె కాస్త తేలికవుతుంది. మా జ్యోతిర్మయుడు ఏడాది పిల్లవాడై ఉండగా పూర్ణేందుబాబు అనే వ్యక్తితో మాకు పరిచయం కలిగింది. ఆ పరిచయం క్రమంగా ఆత్మీయతగా పరిణమించింది. ఆ ఆత్మీయత పర్యవసానం ఏమంటే కడుపునపుట్టినబిడ్డను వదిలేసుకుని నే నతడివెంట పడిపోయాను. పూర్ణేందుబాబుదగ్గిర చాలారోజులున్నాను. చాలామంది నన్ను పూర్ణేందుబాబుభార్యనిగానే ఎరుగుదురు –

ఇంతలో ఫోన్ గణగణ మోగింది ధీరేన్‌నే ఎవరో ఫోన్‌లో పిలిచారు – అవసరమైన పనున్నదని. ధీరేన్ కథను అసంపూర్ణంగానే వదిలేసి వెళ్ళిపోయాడు – మరో రోజు నెప్పుడైనావచ్చి మిగిలినకథ చెప్పుతాననిచెప్పి వెళ్ళాడు. ఇంతవరకు రాలేదు. ఎవరో సావాసం దొరకటంవల్ల దక్షిణ దేశయాత్రకి

వెళ్ళాడని తెలిసింది. అతడు మానస సరోవరానికి వెళ్ళలేక పోయాననేఅనే దుగ్ధతో - మొదటినుంచీ రాఖాలబాబునిగురించి చెప్పినమాటలు మాటిమాటికీ నాకు జ్ఞాపకం వస్తున్నాయి - 'వాళ్ళిద్దరూ పాపపుణ్యాలబరువు వదిలించుకుని మానససరోవరానికి ప్రయాణమై వెళ్ళారు. వాళ్ళు అలా చెంగుచెంగున కొండయెక్కి వెళ్ళిపోవడం నేను చూస్తూ నిలబడ్డాను.

ఉత్తరపువైపునఉన్న మబ్బుతునకలమీాదకూడా అరుణ కాంతులు వ్యాపిస్తున్నాయి. చూస్తూండగానే అంతా గులాబీ మయమైపోయింది. తాటితోపుకు అటుగా ఉన్న నీలమేఘం క్రమంగా విస్తరించింది. దాని కొసలమీాదికి వ్యాపించినకాంతి జరీ అంచులాగా ప్రకాశిస్తోంది. తెల్లమబ్బుతునక ఒకటి సూర్యుడి కడ్డంగా వచ్చింది. అందులోనుంచి కిరణాలకాంతి నాలుగువైపులకీ చిమ్ముతోంది.

నిఖిలచౌధురీ రాఖాలబాబు విల్లు తీసుకువచ్చి నా కిచ్చిననాటి సంగతి కూడా ఇప్పుడు నాకు జ్ఞాపకం వుంది. రాఖాలబాబు మహాప్రస్థానానికి వెళ్ళబోయేముందు వీలునామా ఒకటి రాసి, నిఖిలచౌధురీ అడ్రసుకు పంపాడు. ఆతడు తనకున్న స్థిరచరాస్తులను రాత్రికి - జ్యోతిర్మయుడికి సమానంగా చెందేట్టు రాసియిచ్చాడు. పూర్ణేందుబాబు - బ్రతికి వున్నంతకాలం సుఖంగా వెళ్ళపుచ్చటానికికూడా - అందులో ఏర్పాటు చేశాడు. పూర్ణేందుబాబు చనిపోయిన సంగతి వారికి తెలియలేదల్లేవుంది. రాత్రి అడ్రసు నాకు తెలుసో తెలియదో కనుక్కుపోదామని వచ్చాడు నిఖిలబాబు. అడ్రసు నాకు తెలియదని చెప్పలేకపోయాను. ప్రభాత్ పోయిన మూడోనాడే

రాత్రి వెళ్ళిపోయింది...ఎక్కడికి వెళ్ళిందీ మాత్రం తెలియదు నాకు.

నేను ఇప్పటికీ ఆమెకోసం ప్రతీక్షిస్తూనే వున్నాను. సమాజానికి దూరంగా నిలబడికాదు, సామాజికమైన అధికారం హస్తగతం చేసుకునే ప్రతీక్షిస్తున్నాను. న్యాయశాస్త్ర దృష్ట్యా నేను ఆమెకి భర్తని. జ్యోతిర్మయుడి బిడ్డకి జారజుడనే కళంకం రాకుండా చెయ్యటానికి న్యాయశాస్త్రానుగుణ్యంగా నేనామెని వివాహమాడాను. నాకు తెలుసు. ఆమె ఇహ రాదు...నాకిదికూడా తెలుసు. నాకోసంకాక తన సంతానం కోసం, అదీ నా పట్టుదల మూలంగానే. అసలామె ఈ వివాహానికి అంగీకరించింది.

నన్నామె ఎన్నడూ ప్రేమించలేదు...

అయినప్పటికీ నేనామెకోసం ప్రతీక్షిస్తున్నాను.

దూర దిగంత రేఖలోంచి – తప్తకాంచన సన్నిభుడైన తపనుడు నెమ్మది నెమ్మదిగా క్రుంగి దిగిపోతున్నాడు. అరుణ రాగ రంజితమైన మేఘాల వర్ణవైచిత్రి క్రమంగా కాంతి విహీనమైపోతోంది. అంధకారం అలుముకుంటున్న అలికిడి కాబోలు విన్పిస్తోంది.

రాత్రి ఆసన్నమయింది.